# నేనో స్కూలు టీచరును
# నే కోరి ధరించేది ఆప్కో చేనేతను




అవును — నిజమే...!
నిద్రలేచింది మొదలు, రోజంతా శ్రమించే సీతాకోక
చిలకల్లాంటి వనితలు మీరు—అలాంటి మీకు తేలికగా,
హాయిగాఉంటూ పడుతున్న శ్రమని తెలియకుండా చేస్తాయి
ఆప్కో చేనేత చీరలు.
ఆప్కో— మహోన్నత మైన చేనేత చీరెలు దర్శనమిచ్చే
ఏకైక సంగమ స్థలం...
ఆకర్షణీయమైన పోచంపల్లి, పెడన, నారాయణ్‌పేట్,
గుంటూరు, మాధవరం చీరెలు, కన్నుకలలకు అద్దంపట్టే
కలంకారీ, కరీంనగర్, ఉప్పాడ, పొందూరు, బందారులంక
చీరెలు సుందరమైన రంగుల్లో సిద్ధిపేట, గొల్లభామ,
నేతచీరెలు అందాన్ని మీకు బందీలుగా చేస్తాయి —
రోజువారీ వాడకానికి తేలికగా, మన్నికగా ఉంటాయి.
సరికొత్త అందాల దూతలు... కళ్ళుచెదిరే సౌందర్య
దాతలు నాణ్యమైన, నాజూకైన ఆప్కో చేనేతచీరలు.

**20%**
**పండుగ తగ్గింపుతో**

**అక్టోబరు 31 వరకు**




ముచ్చటైన రంగుల్లో మెరిసే మనోహరం
ముప్ఫై లక్షల చేనేత కళాకారుల శ్రమఫలం

AKSHARA(H)/APCO/820.

నేడే మీ సమీప ఆప్కో కేంద్రాన్ని సందర్శించండి అందాల ఆప్కో చేనేతలను మీ స్వంతం చేసుకోండి.

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

విడి ప్రతి వెల రు. 4-00

సంపుటము 82 | స్థాపితం 1908 బొంబాయి : 1914 మద్రాసు | సంచిక 7

వ్యవస్థాపకులు : దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

(1938-1972 సంపాదకులు : శివలెంక శంభుప్రసాద్)

ఆంధ్రపత్రిక ప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3, ఫోన్లు : 75667, 61247, 61248

**అందరికీ మా దసరా శుభాకాంక్షలు!** - ఎడిటర్

## వీక్లీ పోస్ట్

### ఆత్రేయగురించి!

"అగాధమనే జలనిధిలో.....ఆణిముత్యమున్నట్లు-శోకాన మరుగునదాగి- సుఖమున్నదని....." ఉద్బోధించిన ఆత్రేయ, "నవ్వినా.....ఏడ్చినా కన్నీళ్ళే మిగులుతాయి" అంటూ మనల్ని కన్నీళ్ళు కార్చనిచ్చిన ఆత్రేయ, 'ఛలోక్తులు' చతురోక్తుల కన్నా.... 'ఆర్ద్రత' హృదయాన్ని కదిలించి, కరిగించి, మెదడుని ఆలోచింప జేస్తుందన్న' ఆత్రేయ మనకిక లేరు. ఈ నిజాన్ని జీర్ణించుకొనేందుకు, కొన్ని దశాబ్దాలు పడుతుంది.

అక్షరానికో 'అర్థం' చూపిస్తూ....మనిషి మనస్సులో పేరుకుపోయిన భావాల్ని వెలికితీసి, మనముందుంచే-'మనసుకవి' మనకిక లేకపోయినా...ఆయన చెక్కిన అక్షర శిల్పాలు, మనస్సు అంచుల్ని తాకి, మనల్ని మైమరిపిస్తూనే ఉంటాయి.

ఆయన కలం నుంచి జాలువారిన మేలి ముత్యంలాంటి మాటలు, పదాల కలయికతో తయారయిన పాటలు-మనచుట్టూ పరిభ్రమిస్తూనే ఉంటాయి.

కలల్లో తేలిపోయే కన్నెపిల్లల మనస్సులో మనస్సుగ కల్సిపోయి, మనస్సుని వీణలు మీటే విధంగ, యువ హృదయాల్ని కదిలించి, రసజ్ఞుల హృదయంలో చెరగని ముద్రగ నిలిచిపోయిన 'ఆత్రేయ' ఇంటర్వ్యూని, 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' ఎనభయి రెండవ జన్మదిన సంచికలో...ప్రత్యేకంగా ప్రచురించారు. పాఠకులు ఆ ఇంటర్వ్యూని పఠికించేసరికి, ఆయన ఆత్మ అనంతవాయువుల్లో కల్సిపోయింది. అలాంటి సమయంలో ఆయనను మరోసారి స్మరించుకొనే విధంగా, ఆంధ్రసచిత్రవార పత్రిక ఆయన ఇంటర్వ్యూని ప్రచురించటం గొప్ప విషయం. ఆయనకు నివాళులు అర్పించుకొంటూ 'ఆంధ్రసచిత్ర వార పత్రిక' సంపాదక వర్గానికి ఇందుమూలంగా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

-జి.సత్యం, సూళ్ళూరుపేట

(74 వ పేజీ చూడండి)

## పఠండి లోపలికి!



ముఖచిత్రం
తారాపథంలో
ఊయల ఊగుతున్న రమ్యకృష్ణ
(ఫోటో: కె.ఆర్.వి. భక్త)

పై వారం
విద్యాశాఖాధికారి వెంకారెడ్డితో ఇంటర్వ్యూ

### ఈవారం ప్రత్యేకం:-



### కథలు:-



### సీరియల్ నవలలు:-



### వ్యాసాలు, శీర్షికలు:-

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఎడిటోరియల్ అడ్వయిజర్ : శివలెంక రాధాకృష్ణ    ఎడిటర్ : వీరాజీ    ముద్రాపకుడు, ప్రచురణకర్త : శివలెంక నాగేశ్వరరావు

విజయవాడ 6-10-1989    శకసం. 1911 ఆశ్వయుజమాసం 14వ తేదీ

# అడుసు త్రొక్కనేల? కాలు....?

నోరు జారినా కాలు జారినా వెనక్కి తీసుకోడం రామారావులకీ, రాజీవ్‌గాంధీలకే చెల్లును గాని సభాపతులైనంత మాత్రాన వెలువల రాజకీయరంగంలో అందరికీ చెల్లదని యిప్పుడు స్పష్టంగా తేలిపోయింది. అందరు సభాపతులు ఒక ఎత్తు మన శాసన సభాపతి నారాయణరావుగారొక ఎత్తు! ఈ మధ్య వీరు వార్తలలో కెక్కుతున్నంతగా వెనకటికి రాజ్‌నారాయణ్‌లు కాని యీ మధ్య కాలంలో సుబ్రహ్మణ్యస్వాములుగాని పతాక శీర్షికలని అలంకరించటంలేదు. ఓ మాట అన్నా మరోమాట వద్దా- ఏ పదవీ ఏ పట్టం కోరని సుబ్రహ్మణ్యస్వామిలాంటి "స్వాముల"కు అది చెలామణీ అవుతుంది కాని శ్రీ జి. నారాయణరావుగారు పార్టీ పొలిట్‌బ్యూరో చేతిలో చిక్కుకుపోయారు. వ్యక్తిగా పవిత్ర భారతదేశ పౌరునిగా తమకు ఎన్ని హక్కులు, యే మేరకు వున్నాయో శాసనసభాపతిగా చాలా అనుభవం గడించిన నారాయణరావుగారికి తెలియవని కాదు కాని యీ హక్కులు వగైరాలు మాట్లాడలేని స్థితిలో ఆయనని తెలుగుదేశం పార్టీ యిరికించింది! హిందూ లాయర్‌ల సమ్మేళనం, ముస్లిం డాక్టర్‌ల సభలు జరగవచ్చును- అందులో పెద్దలు నారాయణరావుగారి లాంటి వారు పోయి హితోక్తులు సూక్తులు చెప్పనూ వచ్చును కాని- ముస్లింలు మైనారిటీలు కాదంటూ అఖిలభారత (హిందూ) లాయర్‌ల సంఘంలో నారాయణరావుగారన్న మాటలకీ- రాజ్యాంగంలో జమ్మూ కాశ్మీర్‌కి ప్రత్యేక ప్రతిపత్తి అవసరమా? అనవసరమా? అన్న వాదానికి అసలు సంబంధమేలేదు! ఈ రెండిటినీ జోడించి ముస్లింవర్గాలను శ్రీ నారాయణరావు నొప్పించారనడంలోనే తమాషా అంతా వుంది! అంత కన్నా గమ్మత్తు మరొకటి ఏమిటీ అంటే తెలుగుదేశం పొలిట్ బ్యూరోకీ, కార్యదర్శికి ఆ పార్టీకి యింకా తత్‌సంబంధీకులకే సభాపతి న్యాయవాదుల సంఘంలో నిపుణుని హోదాలో ముఖ్య అతిధిగా దానికి ప్రారంభోత్సవం చేస్తూ అన్నమాటలకి యెటువంటి సంబంధం లేదంటూ తెలుగుదేశం ప్రధాన నాయకులంతా పత్రికల్లో హడావుడి ప్రకటనలు చేయడం చూస్తే, యిదంతా సందు మలుపున పొంచివున్న ఎన్నికల మహాశక్తి ఆడిస్తున్న ఆటే అనుకోవాలి!

రాజ్యాంగం న్యాయశాస్త్రం- చట్టసభల సాంకేతిక హక్కులు వగైరాలన్నీ తెలిసిన నారాయణరావుగారు వెంటనే 'సారీ' చెప్పడం మరోసారి 'సారీ' చెప్పడం కూడా జరిగినా హడావుడి సద్దుమణగకపోటంలో ఆశ్చర్యం కూడాలేదు. అసలు శాసనసభలో . అందర్నీ (చండ) శాసించిన శ్రీ నారాయణరావు శాసన సభాపతిగా ఎన్నికకాంగానే తాను యే పార్టీకి చెందను- అంటూ తెలుగుదేశం పార్టీకి రాజీనామా చేసి వుంటే యివాళ యీ "వ్యాఖ్యల"మీద కనీసం ఆయన "పార్టీ"కి యీ విధంగా "సారీ"మీద "సారీ"లు పబ్లిక్‌గా చెప్పుకోవలసిన అవసరం తప్పేది. అయితే శాసన సభాపతులు చాలా మంది తాము అదివరకు ఎవరి టిక్కెట్‌మీద ఎన్నికైనారో ఆ పార్టీకి విధేయులై కొనసాగటానికే యిష్టపడుతున్నప్పుడు- ఒక్క నారాయణరావుగారినే పార్టీని అంటిపెట్టుకున్నందుకు యిక్కడ నిందించబోవటం లేదుగాని- తెలుగుదేశం పార్టీ సెక్యులర్ విధానాలు, యీ విధంగా సభాపతి వ్యాఖ్యల పబ్లిక్ ఉప సంహరణ ద్వారా రుజువు చేయవలసిన అవసరాన్ని చూస్తేనే కొంచెం చిత్రంగా వుంటుంది!-శ్రీ ఎన్.టి.ఆర్. "మ్యూటినీ" అన్నప్పుడు "వోట్ల బ్యాంకు"కి యెటువంటి దెబ్బతగల లేదు కనుక, ఆయనను వ్యాఖ్యలు ఉపసంహరించుకోమని ఎవ్వరూ అడగక్కర లేక పోయింది. కాని శ్రీ నారాయణరావుగారు· శాసన సభాపతుల "సుప్రీం" అథారిటీని నిరూపించడంలో తన ధైర్య సామర్థ్యాలను రుజువు చేసుకుంటున్న తరుణంలో పార్టీ "కొరడా"కి సర్కస్ పులిలాగా లొంగిపోవలసిరావడాన్ని అటు అభినందించాలో లేక యిటు బలహీనతగా వర్ణించాలో తెలియని ధర్మ సందేహమొక్కటి తల ఎత్తిన కారణంగా ఓ చిన్న సామెత చెప్పి వదిలివేస్తున్నాం- "అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల?"-

25-9-89



యాదేవీ సర్వభూతేషు...

# కన్నుల విందుచేసే 'చున్నట్'లు

## దసరా ఉత్సవాలకు ప్రతీకలు

'చున్నట్'! బెంగాలులో దీనికో ప్రత్యేకత. చెక్కటి బట్టకు, చేతి నైపుణ్యంతోడైతే ఆవిర్భవించే అద్భుతమైన అందాలు.

కలకత్తా విక్టోరియా మెమోరియల్... ఆగ్రా తాజ్‌మహల్... ఒరిస్సా కోనార్క్ మందిరం... హౌరాబ్రిడ్జి... టి.వి. స్టేషన్... ఒకటేమిటి? 'చున్నట్' నైపుణ్యానికి నోచుకోని అందం పాపం చేసుకున్నట్టే...

దుర్గాపూజ మహోత్సవాల్ని వివిధ రూపాలలో చక్కటి దృశ్యాల మధ్య శోభాయమానంగా తీర్చిదిద్దటానికి వుపయోగపడే ప్రక్రియ 'చున్నట్.' దేవీ నవరాత్రులు ఒక ఎత్తయితే చున్నట్ చాతుర్యం మరో ఎత్తు. ప్రతి చున్నట్ పనికోసం డబ్బు వేలనుండి లక్షల్లో ఖర్చవుతుంది. పోటీ ప్రపంచంలో ఆధునికత్వపు రహదారుల్లో అద్భుతాలు సృష్టించడంలో డెకరేటర్లు అనుక్షణం ప్రయత్నిస్తుంటారు.

చున్నట్ తయారీకి కావలసిన సరంజామా: వివిధ రంగుల్లో కాస్త వెడల్పుతో పొడవైన పలుచటి బట్ట ముక్కలు, మేకులు, వెదురు వగైరా. వీటికి ప్రాణంగా చక్కటి డిజైన్.

నిర్మాణ సారధులుగా వందలాది కూలీలు డెకరేటర్ల అజమాయిషీలో క్షణక్షణ గండం నూరేళ్ల ఆయుష్షుగా నవరాత్రులకు నెలరోజుల ముందుగానే కార్యనిర్వహణకు అంకితమై అందాలకు వూపిరిపోస్తూ, దినసరి వేతనంపై కాంట్రాక్టు రేటుపై, నామమాత్ర సౌకర్యాల మధ్య తిండి తిన్నామన్నట్లు, నిలువనీడలేక నిరంతరం శ్రమిస్తూంటారు ఈ చున్నట్ కళాకారులు.

తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలకోసం రవ్వంత ఆలోచించినట్లే, తేజోవంతమైన విద్యుత్ దీపాల మధ్య కన్నుల మిరుమిట్లు కురిపించే 'చున్నట్' కళాకారులు కళ్లలోకి తొంగిచూస్తే లీలగా విషాదఛాయలు గోచరిస్తాయి. వీరికి ప్రభుత్వ గుర్తింపు లేదు. వీరు రకరకాల దోపిడీల మధ్య జీవితాలు లాగిస్తున్నారు.

'చున్నట్' ఒక అందమైన కళ. దీనికి సంబంధించిన కళాకారులను చున్నట్ కళాకారులుగా పరిగణించి వారికి కనీస వేతనాన్ని నిర్ణయించి మెడికల్, గ్రూప్ ఇన్సూరెన్సు వంటి సౌకర్యాలతో జీవన భద్రతల్ని కల్పిస్తూ వృత్తి మందకొడిగా వున్నప్పుడు వీరి యజమానులైన డెకరేటర్ కంట్రాక్టర్లు ఆర్థికంగా ఆదుకునేట్టు తగిన నియమనిబంధనల్ని తయారుచేసి అమలు జరిగేలా చూడాల్సిన బాధ్యత పశ్చిమ బెంగాల్ రాష్ట్ర కళా సాంస్కృతిక వ్యవహారాల శాఖకు ఎంతైనా వుంది.



చున్నట్ నైపుణ్యానికి మచ్చుతునక...



బట్టపై అందాలు చెక్కినారు...

-జోగారావు గుండాన

# ప్రేమంటే తెలుసా?



వాతావరణం గొప్ప చల్లగా వుంది-యిప్పుడో గడియో వానపడవచ్చును...ప్రియుడు చేస్తున్న పని వదిలి ప్రియురాలి కోసం. పరిగెత్తుకు వచ్చాడు. ఆమె చీర తిరగేసి కట్టుకుందో, మరి ఎలా కట్టుకుందో.... మావు కనబడకుండా కట్టుకొంది... స్నేహం: పగ్గమై లాగగా వచ్చింది, ఆ యిద్దరూ కలుసుకున్నది వాళ్ల "బృందావనం" ఒక ఫుట్ పాత్... ఫుట్ పాత్ మీద నిలబడ్డ ఈ జంటని ఎవరూ గమనించరు.. ఎలా గమనిస్తారు? చిరుగుల పంట్లాం-ఎరుపు కోటు-చింకి టోపీరాయుడు హీరో అని యెవడికి పడుతుంది?

ఆ యిద్దరూ అర్జెంటుగా మాట్లాడేసుకున్నారు. స్నేహం అనే విత్తనం ఆ రెండు పేద గుండెల్లోను ప్రేమగా మొలకెత్తుతున్న ఛాయలు, మొహంలో, కళ్లలో వాళ్ల చిరునవ్వుల్లో తొంగి చూస్తున్నవి.

"టీ అబ్బి" హీరోకి ఫ్రెండు... చిన్న డబ్బా, దానికింద కుంపటి దానితో తగిలించిన కప్పులు, బకెట్ లో నీళ్లు!

"ఛాయ్ తాగుతావా?" అడిగాడు హీరో. గొప్పగా చూసింది హీరోయిన్... ప్రియుడు యిప్పించే టీ ఎలా కాదంటుంది.

స్పెషల్ టీ చెప్పటం కోసమా అన్నట్లు హీరో "ఛాయ్ వాలా" చెవులు కొరికాడు.

"ఈసారి మాత్రం అప్పు యివ్వను... రొక్కం కొట్టాలి" అన్నాడు ఛాయ్ వాలా.

హీరో రాజు ఒప్పుకున్నాడు. ఓహో!... ఆ వాతావరణంలో వేడి వేడిగా రెండు కప్పులు అక్కడే ఫుట్ పాత్ మీద కుర్చుని సేవిస్తూంటే యెంత మజాగా వుంది...

దొంగ చూపుల మత్తులో వేడి వేడి 'టీ'గమ్మత్తుగా వుంది... అయిపోయింది. ప్రేయసి-హీరోగారి ఆతిధ్యాన్ని అపురూపంగా స్వీకరించింది.. టీ త్రాగేసింది...

కానీ హీరోగారికి గొంతులో పచ్చివెలక్కాయ పడ్డది.. చిల్లర లేదు. అంటే టోకు వుందనా? 'ఛాయ్ వాలా' మొహమంతా మీసాలు చేసుకుని చూస్తున్నాడు.

భయపడ్డాడు హీరో,

కాని భంగపడటం యిష్టంలేదు.. కాని. యెట్లా?

"మీ దగ్గర చిల్లర పావలా కానుందా?"

అమ్మాయిగార్నడిగాడు వంద రూపాయల నోట్లు మాత్రం చింకి జేబుల నిండా వున్నట్లు కేవలం చిల్లర పావలాకాసు మాత్రం లేనట్లు-అడిగాడు.

దీనమైన దృశ్యమా? యిది కాదు.. పేలైన సన్నివేశం అది..

అదృష్టవశాత్తు ఆమె స్నేహితుడి దగ్గరికి పోతూ పుట్టి నేతులతోనా? పోవడం అన్నట్లు చిల్లర 'మానేటు' వేసుకొచ్చింది.

నవ్వుతూ యిచ్చింది.. ఆ నవ్వులో-ఏముందో ఆనక చెప్తాను.

హీరో ఆ పావలా కాసు ఛాయ్ వాలా కిచ్చేశాడు. మేఘాలు గర్జించాయి... వర్షించాయి. ఆ వానలో ఎదలోపల పెరిగే వెచ్చని ప్రేమలో "ప్యార్ హువా" హీరోయిన్, హీరోలు అలాగే తడుస్తూ "ప్యార్ హువా యిక్ రార్ హువా..." అంటూ పాడుకుంటూంటే... ఆ ప్రేయసి నవ్విన నవ్వులో ఆ విశాలమైన నోరు యిప్పినప్పుడు పలువరుస మల్లెపూల్లా మెరిసె సినిమా కవ్వులంతా తల్లక్రిందులా యిద్దై కూడా రాయలేని రెండర్థాల డైలాగులు కొన్ని వందలు తళుక్కుమన్నాయి-. ప్రేమ, జాలి, ఆదరణ, ఆకర్షణ విశ్వాసం యిన్ని భావాలను కామెరా క్లోజప్ లో పట్టుకుంది.

ఈ సీను ఎక్కడిదో... యీ పాటికి అందరూ 'గెస్' చేసే వుంటారు. ఈ సన్నివేశం మన ఆధునిక నవలలోను-అప్టుడేట్ బైస్కోపులోనిది కాదు. రాజకపూర్ తీసిన 'శ్రీ 420' సినిమాలోనిది.

ప్రేమ ఫుట్ పాత్ మీద చింకి గుడ్డల' వాళ్ల మధ్య పావలాకి రెండు కప్పులు లభించే 'ఛాయ్'లోను ఆవిర్భవిస్తుందాని అడుగుతున్నారా? ఆ సన్నివేశ కల్పన చేసిన "సినిమా కారుడు" ఆ సీన్ చూసిన ఎవ్వరికీ ఆ సందేహం రానంత కళాత్మకంగా తీశాడు. ఏనాటి మాటో అది.. సినిమాతోనే సున్నితమైన ప్రేమ సన్నివేశాలకతను సృష్టి చెప్పాడు.

ఇలాంటివి మనకేవాళ సినిమాల్లో దొరకవు. ఈ ప్రేమ కథల్లోను దొరకదు.

'మన సనేది' ఒకటుంది. దాన్ని కామిరా పట్టుకోవాలంటే-డైరెక్టర్ కి ఎంత తపస్సు కావాలి?

మన కథల్లోనే అయితే! తొలిచూపు నుంచీ కూడా ఇలా "గర్భా దానవు" గది 'కళ' కారిపోవడమే తప్ప...

మన సినిమాలైతే సరేసరి... అమ్మమ్మ మాట్లాడుకుంటే చాలు-హీరో హీరోయిన్ లు- అన్నీ రెండర్థాలే యిక పాడుకున్నవో సరేసరి!

హృదయం అనేది ఒక "పడగ్గది అర" ఒక "లాడ్జింగ్ హవుస్ గది" అదో కార్యం గది మంచం-లాంటిది సుమా?-అంతకన్నా ఆషదానికి మగాడికి మధ్య వుండే హృదయం ఏమిటీ? ప్రేమ ఏమిటీ?- నాన్సెన్సు... 'దో బదన్' అంటే రెండు శరీరాలు ముఖ్యం- "దో దిల్ కా జమానా చలా గయా" అంటూ రెండు గుండెకాయలొక్కటయ్యే రోజులు పోయాయి.... అన్నట్లుగా తయారైంది దేశవాళీ బైస్కోపు....

హృదయం-ఆరాధన విరహం-త్యాగం లాంటి దంతా పాట్ స్పెషల్ స్టఫ్ అయిపోయింది..

ఏం చేస్తాం... ఎవరికోసం చూస్తాం.. గట్టిగా ఒకర్ని ఒకరు నలిపేసుకుంటూన్న సన్నివేశం చూపెడుతూనే, గుడ్డివాళ్లకో సమా? అన్నట్లు-మన సినిమా స్రష్టలు- "నలిపేయి... చంపేయి.. నీ కౌగిలిలో నన్ను యిది చేసై అది చేసై" అంటూ అరపై వాద్యాలతో బ్యాక్ గ్రౌండులో గోల కూడా చేస్తున్నారు. ఆరేళ్లకూనకి పైసన్నివేశంలోని ఒక స్టిల్ ని పత్రికలో పడ్డదాన్ని చూపెట్టి అడగండి-"యిదేమిటి బాబూ" అని, టక్కున వాడంటాడు "ఇదే తెలీదా? వాళ్లిద్దరూ ప్రేమించుకుంటున్నారు" అని. అయ్యా అదీ ప్రేమ. ★★★

# రుచి మిన్న అన్నిటి కన్నా








## స్వస్తిక్స్

ఇన్‌స్టంట్ గులాబ్ జామూన్ మిక్స్

మేము తయారు చేసే ఇన్‌స్టంట్ పదార్థాలను వాడండి.

KAN ADS (B)




సరస్వతి ఆ ఆఫీసులో కొత్తగా చేరింది. ఈ మధ్యనే ప్రభుత్వం వారు ఆవిడకా ఉద్యోగం ఇచ్చేరు. సరస్వతి భర్త ఆ ఆఫీసులోనే పని చేసేవాడు. పెళ్ళయిన రెండేళ్ళకే సరస్వతి భర్త ఏక్సిడెంటులో పోయేడు. సరస్వతి డిగ్రీ పాసయింది.

అనాధగా వున్న సరస్వతి పరిస్థితి చూసి సెక్షను హెడ్డు వీర్రాఘవులు గారు ఎన్నో తంటాలు పడ ఎందరి కాళ్ళో పట్టుకోగా సరస్వతికా ఉద్యోగం వచ్చింది. వీర్రాఘవులు గారు అంత ప్రయాస పడడానికి కారణం సరస్వతి తండ్రి అతని స్నేహితుడు కావడమే.

సరస్వతి పెద్ద అందగత్తె కాకపోయినా చూడ్డానికి బావుంటుంది. మగ దక్షత లేదు. మనిషి బావుంటుంది... యింకేం.. ఆ ఆఫీసులో అందరికీ సరస్వతంటే అదో రకమైన ఇష్టం. అందరూ ఎప్పుడూ ఏదో ఒక పని కల్పించుకుని ఆమె చుట్టూ తిరుగుతూ ఏదో ఒకటి మాట్లాడుతూ వుంటారు.

అయితే అందరి కన్నా సరస్వతితో ఎక్కువగా మాట్లాడేవాడు సురేష్.

సరస్వతి పక్క సీటే సురేషుది.

అవసరమున్నా లేకపోయినా కల్పించుకుని ఆఫీసు విషయాలు గాని ఇంటి విషయాలు గాని రాజకీయాలు గాని సినిమాలు గాని ఏదో ఒకటి సరస్వతితో మాట్లాడుతూనే వుంటాడు సురేష్. అతనలా కల్పించుకుని మాట్లాడ్డం మిగిలిన వాళ్ళకంతగా నచ్చదు.

సరస్వతి మనోగత అభిప్రాయం ఎవరికీ తెలీక పోయినా సరస్వతికి అతనంటే యిష్టమేనని అతనంటే యిష్టం లేని వాళ్ళు చెప్పుకుంటూ వుంటారు.

సురేషు మనిషి బావుంటాడు. మంచి ఉద్యోగం ఆస్తి కూడా వుంది. బాధ్యతలాట్టే లేవు.

ఆ రోజు సరస్వతి ఆఫీసుకి ఆలస్యంగా వచ్చింది.

ఉదయం పది గంటలకి ఎండ చాలా తీవ్రంగా వుంది.

సరస్వతి తన సీట్లో కూర్చుని అలుపు తీర్చుకుంటోంది.

సురేషు అప్పుడే మేనేజరు రూములోంచి బైటికొచ్చాడు. సీట్లో కూర్చుని అటెండరు తెచ్చిన చల్లని మంచినీళ్ళు గడగడా తాగేసాడు. గ్లాసు కింద పెడుతూ సరస్వతి వైపు చూసేడు.

సరస్వతి అప్పుడే ఏదో ఫైలు పట్టుకుని మేనేజరు గారి రూములోకి వెళ్ళబోతోంది.

వెళుతున్న సరస్వతిని దగ్గరగా రమ్మని తల పంకించి సౌజ్ఞ చేసాడు.

సరస్వతి దగ్గరగా వచ్చింది.

సురేషు చుట్టూ చూసేడు. తనకి రెండో పక్క వుండే గుమస్తా ఆ రోజు రాలేదు. ఎదురుగా కూర్చునే గుమస్తా ఎవరితోనో హస్కుతో పడ్డాడు.

చాలా రోజులబట్టి సరస్వతిని అడగాలనుకుంటున్న విషయం అడగడానికి మంచి సమయం దొరికిందతనికి.

"మధ్యాహ్నం లీలామహలులో ఇంగ్లీషు పిక్చరుకి వెళదామా!"

చిన్నగా ఎవరికీ వినపడనంత నెమ్మదిగా అడిగాడు. అలా అడగడమైతే అడిగాడేగాని అతని గుండె మాత్రం దడదడా కొట్టుకుంటోంది.

అతనంత చొరవగా అడుగుతాడని ఊహించని సరస్వతి చకితురాలయింది.

అయితే ఒక్క క్షణం ఆలోచించి తరువాత నెమ్మదిగా అలాగే అన్నట్టు తలాడించి తన పనిమీద వెళ్ళిపోయింది.

బిగపట్టిన ఊపిరిని నెమ్మదిగా విడిచిపెట్టాడు సురేష.

సుతారంగా అడుగులు వేస్తూ వెలుతున్న సరస్వతి చెవి రింగులు గమ్మత్తుగా ఊగసాగాయి. ఆ రింగుల లాగే సురేష మనసులో కోరికలు కూడా ఊగసాగాయి.

ఆ రోజు శనివారం. మధ్యాహ్నం ఆ ఆఫీసుకి సెలవు. అందుకే సినిమా ప్రోగ్రాం పెట్టాడు సురేష.

ఆ సాయంత్రం...

సినిమా వదిలిన తరువాత ఇద్దరూ బీచికి వెళ్ళారు. చల్లగాలి కోసం సాయంత్రపు షికారు కోసం వచ్చిన జనంతో బీచంతా చాలా హడావుడిగా వుంది. ఆ హడావుడికి కాస్త దూరంగా ఇసుకలో ఒకరి కొకరు ఎదురుగా కూర్చున్నారిద్దరూ.

"సరూ!" నెమ్మదిగా పిలిచాడు సురేష.

కొత్త పిలుపుకి కొంత ఆశ్చర్యపోయినా "ఊ" అంటూ తలపైకెత్తింది సరస్వత.

"నేను... నేను" నసిగాడు సురేష.

"ఊ... ఏమిటి నువ్వు"

క్వళ్ళను మార్కు కళ్ళతో రెప్పలార్పుతూ సురేషని చూసింది సరస్వతి.

ఆ చూపుకే అయిసయి పోయేడు సురేష.

"ప్రేమిస్తున్నాను"

ఎలాగయితేనేం మాట పూర్తి చేసేడు.

సరస్వతి ఊహించిందే ఆ మాట.

"మనం... మనం... పెళ్ళి చేసుకుందామా"

మళ్ళీ నసిగాడు సురేష.

"అలాగే... కాని... నా విషయం నీకు తెలుసుగదా, నాలాంటిదాన్ని చేసుకోవడానికి మీ పెద్దవాళ్ళు ఒప్పుకుంటారా!"

సందేహంగా అడిగింది సరస్వతి.

"నీకా భయమే అక్కరలేదు. తప్పకుండా ఒప్పుకుంటారు. ఒప్పుకోక పోతే వాళ్ళనీ వాళ్ళ ఆస్తినీ కాదని మరీ నిన్ను పెళ్ళి చేసుకుంటాను. సరేనా. నాకు కావలసింది నువ్వు... ఆస్తిపాస్తులు కాదు."

సరస్వతి ఒప్పుకుందన్న సంతోషంలో గంభీరమైన ఉపన్యాసం ఇచ్చాడు సురేష.

నిండుగా నవ్వింది సరస్వతి. ఇద్దరూ కలసి రోడ్డుమీదకొచ్చారు. ఆ రాత్రి హోటల్లో భోంచేసారు.

"సరూ! ఎలాగూ మనం పెళ్ళి చేసుకోబోతున్నాం కాబట్టి కాస్త ఎడ్వాన్సుగా..." అంటూ భోజనం చేస్తున్నప్పుడు సరస్వతిని చిలిపిగా చూసి కన్నుకొట్టాడు సురేష.

సరస్వతి సిగ్గే అతనికి సమాధానం అయింది.

ఇద్దరూ రిక్షాలో సరస్వతి ఇంటికొచ్చారు. దారిలో సురేష సరస్వతికి మల్లెపూలు కొన్నాడు.

సురేషని గదిలో కూర్చోబెట్టి లోపలికెళ్ళింది సరస్వతి.

సురేష సోఫాలో కూర్చొని సరస్వతితో తను గడపబోయే మధురక్షణాలను ఊహించుకోసాగాడు.

ఎదురుగుండా డబుల్‌కాట్. దానిమీద ఫోంబెడ్డు. దానిపైనున్న తెల్లని బెడ్‌షీటు ఆ మంచం మీద వెన్నెల పరచినట్టున్నది. దృశ్యం.

స్నానంచేసి తెల్లని పాలనురగలాంటి చీర కట్టుకుని సురేష తనకోసం కొన్న మల్లెపూలను తలలో పెట్టుకుని చేతితో పాలగ్లాసు పట్టుకుని అపరమోహినిలాగ తన దగ్గరకు వచ్చిన సరస్వతిని చూసేసరికి సురేషకి మతిపోయినంత పనయింది.

ఇంతకాలం సురేష సరస్వతిలో వున్న ఆకర్షణనే చూశాడు... ఇప్పుడు అందాన్ని చూస్తున్నాడు.

ఎదురుగా అందాలరాశి.. ప్రక్కనే తెల్లని పానుపు.. సురేష ఆత్రంగా సరస్వతిని పొదివి పట్టుకున్నాడు.

సరస్వతి ఆర్తిగా అతని గుండెల మీద వాలిపోయింది.

"సురేష్" మధురంగా పిలిచింది సరస్వతి.

"ఊ" సరస్వతి స్పర్శతో మైకంలో తేలిపోతూ బదులు పలికాడు సురేష.

"నేనీ ఉద్యోగం మానేస్తాను సురేష్!" గోముగా పలికింది సరస్వతి గొంతు.

అయితే ఆ మాటలు విన్న సురేషకి మాత్రం చిన్న షాక్ కొట్టినట్లయింది. అతని చేతుల పట్టు సడలింది.

"ఎందుకూ!" అర్థం కానట్టు అడిగాడు.

"ఎందుకేమిటి సురేష్! ఇప్పుడు నేను చేస్తున్న ఉద్యోగం నా మొదటి భర్త చనిపోయిన కారణంగా నా బ్రతుకు నిరాధారం అయిపోయింది కాబట్టి బ్రతుకు తెరువు కోసం ప్రభుత్వం వారు ఇచ్చింది. ఇప్పుడు నువ్వు నాకు జీవనాధారం కాబోతున్నావు. ఇంక నా బ్రతుకు తెరువుకి లోటేముంది. ఇప్పుడు మనకా సంపాదన ఎందుకు. నీతో కాపురం చేస్తూ నా మొదటి భర్త వలన కలిగిన సంపాదనను అనుభవించడం ఎంత నీచం. పైగా నాకిది ఇష్టంలేదు కూడా. ఇక నుండి నీకు భార్యనై నువ్వు ఆఫీసు నుండి వచ్చే వేళకు నీ కోసం ఎదురు చూస్తూ వుండడంలో వున్న ఆనందం ఆఫీసులో నీతో బాటుగా పని చెయ్యడంలో వుండదు...

## రవిశాస్త్రిపై మాధురి కన్ను?



అమృతాసింగ్‌తో చెట్టాపట్టాలేసుకొని తిరిగి బహుళ ప్రచారం పొందిన క్రికెటర్ రవిశాస్త్రికి యిప్పుడొకమ్మాయి ఆ స్థానాన్ని ఆక్రమించబోతోంది. ఆమె ఎవరో కాదు...మాధురీదీక్షిత్ ట.

లండన్ వెళ్లిన రవిశాస్త్రికి యిటీవల ఈ అమ్మడు ఫోన్ చేసిందట. ఫోన్‌లో ఏం మాట్లాడిందో... ఏమో ఎవ్వరూ పసిగట్టలేకపోయారు గాని... ఫోన్‌లు చేస్తోందని మాత్రం కనిపెట్టగలిగారు.

మరి వీళ్లిద్దరి మధ్య వ్యవహారమేమిటో ఎవరికీ అంతుచిక్కటంలేదు కాని అమృతా చేసినట్లు మాత్రం చెయ్యొద్దు అని సలహా పారేశారట.

మాధురి ప్రేమ వలలో చిక్కుకొని ఏమైపోతాడోనని బెంగపడుతున్నారట రవి అభిమానులు.



బొంబాయి రేవులో బెర్నార్డుషాగారు నౌకపై పత్రికా ప్రతినిధులతో ముచ్చటించుట.

# షా గారికి రవీంద్రుని ఆహ్వానము

## శాంతినికేతనమునకు రమ్మనిరి

### షా గారు రాజాలననుట

కలకత్తా, జనవరి 18 : (1933)

ఈ మధ్య రవీంద్రనాథ టాగూరునకు జార్జి బెర్నార్డు షా గారికి జరిగిన యుత్తర ప్రత్యుత్తరములను "విశ్వభారతి సమాచారము" ప్రచురించినది.

రవీంద్రుడీ క్రింది విధముగా బెర్నార్డుషా గారికి ఆహ్వానమంపెను.

"ఇండియాకు వచ్చినందులకు సుస్వాగతము, శాంతినికేతనమునకు రావలసినదిగా ఆహ్వానించుచున్నాము. మీరు వచ్చిన చాల సంతోషించెదము. మీ దంపతులిద్దరికి మా అభివందనములు."

బెర్నార్డు షా గారి ప్రత్యుత్తరము. "నేనిప్పుడు హిందూ దేశమును చూచుటకు రాలేదు. నేను ప్రయాణము చేయుచున్న నౌక బొంబాయి కొలంబోల యందు మకాము చేయుట చేత ఊరిలోనికి వెళ్లి వీధుల వంబడి కొన్ని గంటలు తిరిగెదను. యూరోపియను అస్పృశ్యులకు ప్రవేశమిచ్చు దేవాలయములకు వెళ్లెదను. ఈ పర్యటనము ఏర్పాటు చేసిన వారు క్రిక్కిరిసి యున్న రైళ్ల యందు 5 దినములు రాత్రి పవలు ప్రయాణము చేసి ఇండియాను చూడమనిరి. మధ్య మధ్య మాత్రము భోజనము చేయుటకు, తాజ్‌మహల్ చూచుటకు కొన్ని నిముషముల వ్యవధి నిచ్చెదరు. ఎక్కువగా ప్రయాణము చేసిన వాడనగుటచే అట్టివి నాకు నచ్చవు. పైగా నేను వృద్ధుడనగుట మూలమున అట్టి కష్టములకు చచ్చుట తప్పదు. మిమ్ములను చూడజాలనందుకు చాల విచారమగుచున్నది. ప్రస్తుత భారతదేశమందున్న పరిస్థితులు మాటల స్థితిని మించి పోయినది. దానిని నేను బాగుగ గ్రహించితిని."

(1933, జనవరి -25 ఆంధ్రపత్రిక వీక్లీ నుంచి)

ఏమంటావు... అందుకే నేను ఉద్యోగం మానేస్తాను. మనం సోంవారం ఉదయాన్నే రిజిస్ట్రాఫీసుకి వెళ్లి పెళ్లి చేసుకుందాం. ఆ వేళే నేను ఉద్యోగానికి రాజీనామా లెటరు పంపించేస్తాను."

సురేష గుండెల మీద వాలిపోయి తన్మయత్వంతో ప్రేమగా చెప్పుకుపోతోంది సరస్వతి.

సురేషకి మాత్రం చెవుల్లో చీమలు కుడుతున్నట్లనిపిస్తోంది సరస్వతి మాటలు వింటూ వుంటే.

సరస్వతి చెప్పడం పూర్తి చేసేసరికి సురేషలో పూర్తిగా చలనం వచ్చింది.

ఉద్యోగంలేని సరస్వతి దరిద్రగొట్టు మొహం అతని కళ్లముందు కనబడింది.

అంతే... సోఫాలోంచి ఒక్క ఉదుటున లేచాడు సురేష.

ఏం జరిగిందో సరస్వతికి అర్థమయ్యేలోపుగానే-

"సరస్వతీ! నాకు అర్జంటు పనొకటి జ్ఞాపకం వచ్చింది... వొస్తాను...గుడ్‌బై."

అంటూ.. సరస్వతి పిలుస్తున్నా వినిపించుకోకుండా గబగబా ఆ గదిలోంచి బైటికి వెళ్లిపోయాడు సురేష.

సురేష వెళ్లిపోయాక తనలో తను నవ్వుకుని తలుపేసుకుంది సరస్వతి.

సోమవారం ఉదయం ఆఫీసులో సరస్వతికి సురేష మరి కనబడలేదు.

## ఈ కాలం కుర్రాళ్ళు

నాలుగు రోజులు పోయాక.. ఓ రోజు సాయంత్రం..

సరస్వతి ప్రక్క వీధిలో వున్న వీరరాఘవులు గారింటికి వెళ్లింది.

సరస్వతి వెళ్లేసరికి వీరరాఘవులుగారు వీధి వరండాలో కూర్చుని ఏదో మేగజైన్ తిరగేస్తున్నారు.

సరస్వతిని చూడగానే "రామ్మా... రా" అంటూ సాదరంగా ఆహ్వానించేరు.

"థాంక్సండీ! మీరిచ్చిన సలహా బాగా పని చేసింది. ఆ రోజు తర్వాత సురేష మళ్లీ నాకు కనబడలేదు."

జరిగిన విషయమంతా వివరించింది సరస్వతి.

"ఇంక కనబడడు లేవమ్మా! ట్రాన్స్‌ఫరుకి అప్లయి చేశాడు. అందాకా లీవు పంపించాడు. ఈ కాలం కుర్రాళ్ళకి ఆడది కావాలి .. దాని డబ్బు కావాలి. .. దాని బాధ్యత మాత్రం అక్కరలేదు."

నవ్వుతూ అన్నా ఆయన గొంతులో తీవ్రత ధ్వనించింది.

ఆయనవంక కృతజ్ఞతగా చూసి ఇంటిలోపలికి నడిచింది సరస్వతి.

★ ★ ★ ★ ★ ★

"హ... హ... హ" గది పైకప్పు ఎగిరిపోతుందేమో అన్నంత బిగ్గరగా నవ్వేరు వీరరాఘవులుగారు.

ఆయన చేతిలో అప్పుడే వచ్చిన వారపత్రిక వుంది.

ఎప్పుడూ గంభీరంగా వుండే వీరరాఘవులుగారు అన్నీ మరిచిపోయి అంతలాగ నవ్వేసరికి ఆ ఇంట్లో వాళ్లందరూ ఆశ్చర్యపోయేరు.

"ఏమమ్మా! నువ్వు కోరిన ప్రకారమే నువ్వుద్యోగం మానెయ్యడానికి ఒప్పుకునేగదా మా వాడు నిన్ను పెళ్లి చేసుకున్నది. అటువంటప్పుడు మావాడ్ని ఈ కథలో మాత్రం పనికిరాని వెధవని విలనుగా చేసి పారేసేవే. ఇది అన్యాయం కదూ!"

పత్రికలో పడిన కథని చూపించి నవ్వుతూ కోడల్ని అడిగారు వీరరాఘవులుగారు.

ఆ కథ రాసింది వీరరాఘవులుగారి కోడలు సరస్వతి.

మామగారు అలాగడిగేసరికి సిగ్గుపడి పోయింది సరస్వతి.

"కథ రాసింది నేనే అయినా అలా రాయమన్నది మాత్రం మీ అబ్బాయిగారే మామయ్యా!"

తలొంచుకునే సమాధానం చెప్పింది సరస్వతి.

"అవును.. నాన్నా! మా మధ్య జరిగిన విషయాన్ని ఈ విధంగా తమాషాగా కథ రాయమని సరూకి సలహా ఇచ్చింది నేనే."

మధ్యలో కల్పించుకుని చెప్పాడు అప్పుడే ఆ గదిలోకి వచ్చిన సురేష.

కొడుకుని కోడల్ని ఒకసారి చూసి తనలో తానే ముసి ముసిగా నవ్వుకుంటూ పత్రికా పఠనంలో మునిగిపోయారు వీరరాఘవులుగారు.

# నెస్టమ్® బేబీ సిరియల్ – రైస్

## మీ పాపాయి యొక్క ఆదర్శప్రాయమైన తొలి ఘన ఆహారం

### వాడి చూడండి!

నెస్టమ్ బేబీ సిరియల్‌ని పాలలో కలిపినప్పుడు అది అన్నానికి గల తేలిగ్గా జీర్ణమయ్యే గుణం, పరిపూర్ణ పోషకాహారపు మంచితనం అందజేస్తుంది 4 నెలలు వయసు వచ్చాకా పాపాయి ఆహారంలో మీరు ఘన పదార్థాలు ప్రవేశ పెట్టేటప్పుడు, నెస్టమ్‌తో ప్రారంభించండి బియ్యంతో తయారు చేయబడిన నెస్టమ్, తేలిగ్గా జీర్ణయం అయ్యేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది అంతేకాదు, నెస్టమ్, ఇనుము, విటమిన్‌లతో మరింత బల వర్ధకం చేయబడింది.



నెస్టమ్‌ని తయారు చేయడం ఎంతో సులువు దీనిని ముందుగా కాచిన వెచ్చటి పాలల్లో కలపండి అంతే, పాపాయికి తినిపించేందుకు ఆహారం తయారు!

నెస్టమ్ పాలు లేకుండా అందుబాటులో ఉన్న ఒకే ఒక సిరియల్ మీరు మీ పాపాయి ఆహారంలో వివిధ రుచులు తెచ్చేందుకు ముందుగా ఉడికించి యింట్లోనే తయారు చేసి, మెత్తటి గుజ్జుగా చేసిన కూర ముక్కలు, పప్పు, పండ్లు నెస్టమ్‌లో కలపండి

కేవలం
రూ 9/-* కే
డబ్బాలో
200 గ్రా.
సంచీ




* స్థానిక పన్నులతో సహ

**ఉచితం!**
నెస్టమ్ రెసిపి బుక్ లెట్
ఈ చిరునామాకు వ్రాయండి
నెస్టమ్
పోస్ట్ బాక్స్ నెం. 6016
న్యూ ఢిల్లీ 110 008




ప్రస్తుతం ఒక్క ఆంధ్ర ప్రదేశ్ లోనే దొరుకుతోంది.

R K SWAMY/FSL5327 TEL

# సీరియల్ ద్రౌపది

### ప్రయాగ రామకృష్ణ



(గతసంచిక తరువాయి)

ఇంతవరకూ సాగిన కథ-*20* : పాంచాల దేశాధీశుడు ద్రుపదుని కుమార్తె ద్రౌపదిని పంచపాండవులు పెళ్లాడతారు. ధర్మరాజు పట్టాభిషేకానంతరం ఖాండవ ప్రస్థం చేరిన పాండవులు నారదుని సలహాపై రాజసూయ యాగం నిర్విఘ్నంగా కొనసాగిస్తారు. మయ సభలోతనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా దుర్యోధనుడు పాండవుల సంపదను హరించి ద్రౌపదిని అవమానిస్తాడు. ధృతరాష్ట్రుడివల్ల దాస్య విముక్తులైన పాండవులు అనుద్యూతంలో ఓడిపోయి అడవులపాలవుతారు. పన్నెండేళ్ల అరణ్యవాసానంతరం పాండవులు మత్స్య దేశాధీశుడు విరాటరాజు కొలువులో మారు పేర్లతో ఆశ్రయం సంపాదిస్తారు.

మహారాణి సుధేష్ణకు ఒక తమ్ముడున్నాడు. అతని పేరు సింహబలుడు. విరాట రాజు సేనకు అతడే అధిపతి.

అసలైతే మత్స్య దేశానికి విరటుడే రాజుకాని, అధికారమంతా సింహబలుడిదే. విరటుడు పేరుకేరాజు.

విప్రస్త్రీకి క్షత్రియ పురుషునివల్ల కలిగిన సంతానం సూతవంశంగా పేరుపొందింది. పూర్వకాలంలో ఈ సూతులకు రాజ వంశాలతో సంబంధాలుండేవి. కొందరు రాజాశ్రయం పొంది రాజ్యాలు సంపాదించారు. వాళ్ళల్లో శ్రేష్ఠుడు కేకయుడు.

అతనికి ఇద్దరు భార్యలు.

మొదటి భార్యకు సింహబలుడు పుట్టాడు. రెండవ భార్యకు సుధేష్ణ కలిగింది. సింహబలుడ్ని కీచకుడని కూడా పిలుస్తారు. అతనికి నూట అయిదుమంది తమ్ముళ్ళున్నారు. వాళ్ళని ఉపకీచకులంటారు. విరటుడు కోశల రాజపుత్రి శ్వేతను మొదట పెళ్ళి చేసుకున్నాడు. తరువాత కొంతకాలానికే ఆవిడ మరణించడంతో సుధేష్ణను పట్టమహిషిగా స్వీకరించాడు. సుధేష్ణతోపాటే కీచకుడు కూడా కోటలో పాగా వేశాడు.

కీచకుడు మహాబలశాలి. విరటుడి సేనా, బల, కోశాగారాలు వృద్ధిచేస్తూ ఇరుగుపొరుగు రాజ్యాలెన్నో జయించి బావగారికిచ్చాడు.

దానితో మత్స్యదేశంలో అతనిమాటకు తిరుగులేకుండాపోయింది.

అసలే రసికుడు. దానికితోడు అధికారం, డబ్బూ చేతినిండా వుండేసరికి కోరికలు చెలరేగాయి. ఎక్కడెక్కడి సౌందర్యవతులనూ చెరబట్టి అనుభవించాడు. అందగత్తెల అనుభవాలతో పండిన రసికత తనదని కీచకుడికి గర్వముండేది. కాని సైరంధ్రిని చూచాక అతని రసికతా గర్వం మాయమైంది.

'.... సైరంధ్రిని మించిన సౌందర్యవతి మరిలేదు. సృష్టిలోని సౌందర్యమంతా కరిగి సైరంధ్రిగా ముద్దకట్టింది. ఈ సుందరిని ఎలా అయినా అనుభవించాల్సిందే' అనుకున్నాడు కీచకుడు. సైరంధ్రిని విడిచి బతకలేనని పించిందతనికి. ఆమెకోసం అల మచింటి పోతున్నాడు.

మొదట్లో-

'ఇదెంత, నా దగ్గర పనిచేసే పరిచారిక...' అనుకుని వెర్రిమొర్రి వేషాలు వేయబోయాడు.

సైరంధ్రి మర్యాదగా తిరస్కరించింది.

అయినా ఆవిడ అందం కీచకుడి ప్రాణాలను పట్టి లాగుతునే వుంది.

వాడు ఆమె ముందు మోకరిల్లి దీనంగా బ్రతిమాలుకున్నాడు.

ఆవిడ కాదంది.

బలిష్ఠమైన శరీరాన్ని పొంగిస్తూ, కండలు మెలితిప్పుతూ కారుకూతలు కూశాడు.

పురుగును చూసినట్టు చూసింది సైరంధ్రి. అసహ్యించుకుందతన్ని.

ఆమె తిరస్కారంలోని ఆకర్షణ, కోపంలోని అందం కీచకుడ్ని పిచ్చివాణ్ణి చేశాయి.

తనను అసహ్యించుకునే స్త్రీకోసం పడిచచ్చే మనస్తత్వం వాడిది.

సైరంధ్రికోసం చాలాసార్లు ప్రయత్నించి తనవల్లకాక చివరికి సుధేష్ణ దగ్గర ప్రాధేయపడ్డాడు.

'అక్కా! సైరంధ్రిమీద నాకు మనసైంది. ఆమె అందం నన్ను బతకనివ్వడంలేదు. ఎలా అయినా సరే ఆమెను ఒప్పించి నా వద్దకు పంపించు' అన్నాడు.

'నీకు తెలీదేమో ఆ సైరంధ్రికి గంధర్వులైన అయిదుగురు భర్తలున్నార్ట. వాళ్ళంతా పరాక్రమవంతులని చెబుతోంది. సైరంధ్రి తేజస్సు, గాంభీర్యం చూస్తుంటే గంధర్వులమాట కూడా నిజ

మేనని పిస్తోంది. అనవసరపు ఆలోచనలు చెయ్యక ఒళ్ళు దగ్గర పెట్టుకుని వుండు' అని సుధేష్ణ తమ్ముడ్ని మందలించింది.

కీచకుడు విన్నాడు కాదు.

చివరికి విసిగి 'సరే సైరంధ్రితో చెప్పి చూస్తాలే' అంది సుధేష్ణ.

మహారాణి ఒకరోజు సైరంధ్రిని పిలిచి 'నువ్వు మా తమ్ముడి మందిరానికి వెళ్ళి అక్కడ తయారుచేస్తున్న మధుర పానీయాలూ, వంటకాలూ ఇక్కడికి పట్టుకురా' అని చెప్పి సువర్ణ, రజత పాత్రలు ఇచ్చింది. సైరంధ్రి మనసు కీడును శంకించింది.

'నేను ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళను. మరెవర్నయినా పంపించండి' అని మంచిగా బ్రతిమాలుకుంది మహారాణిని.

'లేదు నువ్వే వెళ్ళాలి' అని బలవంతంచేసి ఒప్పించి సైరంధ్రిని తమ్ముడి దగ్గరకు పంపింది సుధేష్ణ.

సైరంధ్రి భయపడ్డట్టే జరిగింది.

కీచకుడు హాహ్హాహ అని నవ్వుతూ సైరంధ్రికి దగ్గరగా వచ్చాడు. 'సుందరీ! ఎన్నాళ్ళకు దయ కలిగింది' అన్నాడు. అతను మీద మీద కొస్తుంటే సైరంధ్రికి పెద్దపులి, సింహం గుర్తుకొచ్చాయి.

కాళ్ళల్లోంచి వణు కొచ్చింది.

'... ఈ పిచ్చి చీరలోనే ఇంత అందంగా వున్నావు. నాజూకైన వస్త్రాల్లో ఇంకెంత అందంగా వుంటావో!' అని పయ్యెద అందుకోబోయాడు.

సైరంధ్రి దూరంగా జరిగింది.

కీచకుడు పెద్దగా చప్పట్లుకొట్టాడు. ఒక పరిచారిక ఉరుకులు పరుగులతో లోపలికి వచ్చింది.

'ఈ అందాలభరిణను లోపలికి తీసుకు వెళ్ళండి. సువాసనా తైలాలతో స్నానమా



డించండి. తర్వాత సర్వాలంకారాలతో శయన మందిరంలోకి ప్రవేశపెట్టండి' అని సైరంధ్రిని ముద్దాడబోయాడు. సైరంధ్రి విసురుగా అతన్ని తోసేసి, చేతిలోని పాత్రలను నేలకుకొట్టి గిర్రున వెనక్కి పరుగెత్తింది.

కీచకుడు ఆమె వెంట పడ్డాడు.

సైరంధ్రి పరుగెత్తుకుంటూ వెళ్ళి రాజసభలో ప్రవేశించింది.

అక్కడికి కూడా వచ్చాడు కీచకుడు.

అధికార దర్పం, అహంకారం, ధన గర్వం కళ్ళకు ఎగదట్టి ఆ మత్తులో వూగిపోతున్నాడతను. విరటుని కొలువులో అందరూ చూస్తుండగానే 'ఛీ! దాసీదానా' అని సైరంధ్రిని కాలితో తన్నాడు.

ఆ సమయంలో అవిడ భర్తలయిదుగురూ అక్కడే వున్నారు. ఎవరూ అడ్డు రాలేదు. ఇదేమిటని? అడగలేదు.

సైరంధ్రి మెల్లగా లేచింది.

ఒంటినిండా దుమ్ము.

కళ్ళనిండా నీళ్ళు.

గుండెనిండా రొప్పు.

జుట్టు చెల్లాచెదరైంది.

లేచి ఒక్కసారి సభంతా కలయ చూసింది.

తన భర్తలుకంటబడగానే ఛీ అనుకుంది.

'... ఒక అధముడు... ఒక నీచుడు... ధర్మాధర్మాలు తెలుసుకోకుండా, స్త్రీలోలతతో కళ్ళు మూసుకుపోయి పరదారమీద కాలెత్తితే నోరుమెదపని భర్తలువుంటేనేం, లేకపోతేనేం' అనుకుంది.

ఎవ్వరూ మాట్లాడలేదు. రాజసభంతా నివ్వెరపోయి చూస్తోంది.

'... నోరు అన్నం తింటున్న వేళ నీ బుద్దెందుకు గడ్డి కరుస్తోందని ఏ ఒక్కరూ ఈ కీచకుడ్ని దండించరేం...

వీడిలా ఆడపిల్లల్ని చెరబట్టి హింసిస్తుంటే మీలో ఎవ్వరూ వీడ్ని పల్లెత్తు మాట అనరేం!

మీరెందుకు భయపడుతున్నారు?

వీడి డబ్బుకా? అధికారానికా? ఏనుగు బలానికా? దేనికి...?

అక్రమాలు చెలరేగిన రాజ్యంలో మంచిని కాపాడలేని నురపతులు నరకానికి పోతారు' అంది సైరంధ్రి.

విరటుడుకి ఆమె శపిస్తున్నట్టనిపించింది.

'మత్స్య దేశంలో ఇలాంటి దుర్మార్గులూ,దుష్టులూవున్నారనుకుంటే ఈ రాజ్యంలోకే అసలు అడుగు పెట్టకపోయేదాన్ని' అంది.

ఆ మాటకి విరటుడు తలదించుకున్నాడు.

కీచకుణ్ని బతిమాలి అక్కడనుంచి పంపించేశాడు.

భీముడు ఇదంతా చూస్తునే వున్నాడు.

కడుపుమండుతోంది.

సైరంధ్రికి జరిగిన పరాభవానికి ప్రతీకారం చెయ్యాలనుకుంటూ దగ్గరలో వున్న ఓ చెట్టుపైవు దృష్టిసారించి పిడికిళ్ళు బిగించాడు.

'వల్లవా! వంటకట్టెలు కావల్సినవాడివి అడవికి వెళ్ళాలి కాని సభాభవనం వెలుపలవున్న ఫలపుష్ప వృక్షాలను పెకలిస్తావా! ముందు వెళ్ళి రాజుగారి విందు సంగతి చూడు' అని ధర్మరాజు తమ్ముడికోపాన్ని చల్లార్చాడు.

చేసేదిలేక భీముడు అక్కడ నుంచి నిష్క్రమించాడు.

కంకుభట్టు వేషంలో వున్న ధర్మరాజు సైరంధ్రికి నచ్చచెప్పి సుధేష్ణ మందిరానికి

## ద్రౌపది చీరపై మోజు!

టి.వి. మహాభారత్‌లో ద్రౌపదీ వస్త్రాపహరణం సందర్భంలో ఉపయోగించిన 66 మీటర్ల పొడవున్న చీరను 'బిన్నీ' కంపెనీ ప్రత్యేకంగా తయారుచేసిందట.

దీన్ని ఆసరాగా చేసుకొని కొంత మంది వ్యాపారస్థులు ద్రౌపది కట్టిన చీర మా దగ్గర వుందని కస్టమర్స్‌ని ఆకర్షిస్తున్నారట. ఇది తెలిసిన బిన్నీ కంపెనీ పెద్ద ప్రకటన గుప్పించేసిందట - అటువంటి ఆకర్షణలకు లొంగిపోవద్దని, ఆ చీర త్వరలో తెప్పించి అమ్మకానికి పెడతామని.

రూపా గంగూలీ కట్టుకున్న చీర మీద జనాలకి మరి ఎందుకంత మోజో? ఒకవేళ మోజుపడి కట్టుకున్నారే అనుకోండి ఏ దుశ్శాసనుడి కంటో పడితే.... యింతే సంగతులు ....చిత్తగించవలెను!

## సామంతాతో లెండిల్ పెళ్ళి



వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో ఫైనల్ వరకు వచ్చి తృటిలో విజయలక్ష్మిని కోల్పోతున్న ప్రపంచ నెంబర్ వన్ టెన్నిస్ క్రీడాకారుడు ఇవాన్ లెండిల్ 'సంసార' లక్ష్మిని చేపట్టటంలో విజయం సాధించాడు.

తన ప్రియురాలు సామంతా ఫ్రాంకెల్‌ను చేసుకోవాలని ఎప్పటినుంచో కలలు కంటున్నాడు. ఆ కలలను నిజంచేస్తూ గ్రీన్ విచ్‌లోని తన స్వగృహంలో ఫ్రాంకెల్‌ను భార్యగా స్వీకరించాడు.

లెండిల్ తల్లిదండ్రులు చెకొస్లొవేకియానుంచి, క్రిస్టోవాన్ రెన్స్‌బర్గ్ దక్షిణాఫ్రికా నుంచి వచ్చి ఈ వివాహానికి హాజరయ్యారు. ఇతర బంధువర్గీయులు కూడా ఈ కార్యక్రమంలో పాలుపంచుకున్నారు.

యు.ఎస్. ఓపెన్ టైటిల్‌ను, ఫ్రెంచి ఓపెన్ టెన్నిస్ టైటిల్‌ను, ఆస్ట్రేలియా ఓపెన్ టైటిల్‌ను గెలుచుకున్న ఇవాన్ లెండిల్ ఒక్కసారి కూడా వింబుల్డన్ టైటిల్‌ను గెలుచుకోలేకపోయాడు. సామంతా అడుగుపెట్టిన వేళావిశేషం... ఈసారన్నా ఆ టైటిల్‌ను గెలుచుకుంటాడేమో వేచిచూడాలి!

పంపే ప్రయత్నం చేశాడు.

సైరంధ్రి కదల్లేదు.

పైగా 'ఈ కీచకుని స్పర్శకంటే మరణమే మేలు. కన్ను లెర్రచేసి ధనుష్టంకారం చేస్తే పారిపోవాల్సిన దుర్మార్గులను నా భర్తలు ఎందువల్లనో ఉపేక్షిస్తున్నారు. నా భర్తలే నన్ను కాపాడలేనప్పుడు ఒకరినని ప్రయోజనమేమిటి?' అని నిర్లక్ష్యంగా అంది.

'సైరంధ్రీ! ఆగు. నీకు వివేకంపోయినట్టుంది. నాటకంలో వేషాలు వేసే వాళ్ళలా చేతులు తిప్పుతూ, ఛీ, యేమిటా అభినయం?.... ఇల్లాలినంటావు, గంధర్వులైన అయిదుగురు భర్తలున్నారంటావు, ఇల్లాళ్ళిలాగే ప్రవర్తిస్తారా? నీ భర్తలు యోధానుయోధులన్నావుగా వాళ్ళే నిన్నవమానించిన వాని శిక్షిస్తారు. నువ్వు నీ యింటికి వెళ్ళు' అని కంకుభట్టు మందలించాడు. ఆ మాటలకు ద్రౌపది మనసు గాయపడింది.

నిజమే, 'నా తల్లి వెన్నెల బొమ్మ' అని తండ్రి అనేవాడు.

'నువ్వు ఏ పని చేసినా తీర్చినట్టుందని' అత్తగారు మెచ్చుకునేది. 'నీ చూపూ, మాటా, కదలిక అందంగా అమర్చినట్లుంటాయని' తనను గెలుచుకున్న వీరమూర్తి విజయుడు ఇప్పటికీ అంటాడు. 'నువ్వు గడ్డం కింద చేయి ఆన్చుకుని మౌనంగా కూర్చుంటే నీ కనుబొమ్మల నీడలలో నిశ్చితంగా మెరుస్తూ నీ నల్లని కళ్ళు కనిపిస్తాయి' అని వాయుపుత్రుడంటాడు.

- చెప్పదలుచుకున్నది స్పష్టంగా చెప్పడం తనకు ఇష్టం. తను మాట్లాడేటప్పుడు అప్రయత్నంగా చేతులు కదులుతాయని తనకూ తెలుసు.

అయితే-

## "కంకుభట్టూ ! నేను నటినే"

తాగి తూలుతున్న పశువొకడు నా వెంటపడి, నా పైట లాగి, కారుకూతలు కూస్తుంటే అవి సహించలేక ప్రభువుల వారికి విన్నవించుకుందామని కొలువుకు రావటం తప్పా ? వచ్చి మొరపెట్టుకోవటం తప్పా ?

.... ఆ ధూర్తుడు నా జుట్టుపట్టుకు లాగి, విసురుగా తోస్తే, ఈ సభలో ఇంత మంది యోధులున్నారు, అందరి చేతుల్లో బలముంది, కత్తుల్లాంటి కండలున్నాయి, వాడి వొళ్లెందుకు తూట్లు పొడవలేదని అడగటం తప్పా ?

యేది తప్పు ?

పైగా తనలో ఇల్లాలి లక్షణాలే లేవంటాడా ధర్మరాజు. ఎంత అన్యాయం !

సంతోషమైనా, దుఃఖమైనా తన ముఖంలో స్పష్టంగా ప్రతిఫలిస్తుంది. అసలే అగ్నికుండంలోంచి పుట్టిందేమో చెడు ఎక్కడ కనిపించినా, దహించాలన్నంత కోపం వస్తుంది తనకు. అందుకని తన హావభావాలను ఆసరా చేసుకుని ఇంత దారుణంగా మాట్లాడతాడా ! అభినయిస్తున్నా

## దర్శకుడు వినోద్‌మెహ్రా



నటుడు వినోద్ మెహ్రా దర్శకుడయ్యాడట. ఈ నిర్ణయం యిప్పటికిప్పుడు తీసుకున్నది కాదని నాలుగు సంవత్సరాల క్రితమే తీసుకున్నానని కాని అప్పుడు నటుడిగా తీరిక లేకపోవటంతో దర్శకత్వం చేపట్టలేక పోయానని అంటున్నాడు వినోద్.

"గురుదేవ్" చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న మెహ్రా ఈ చిత్రం పూర్తయ్యాక అనిల్‌కపూర్, శ్రీదేవి, రిషికపూర్‌లతో చిత్రం తీయాలని సంకల్పించాడట.

దర్శకుడు కాబోయే ముందు నటన అంటే ఏమిటో తెలిసి వుండాలంటున్నాడు. అప్పుడే పెద్ద హిట్ దర్శకుడై పోయానను కుంటున్న మెహ్రా.



## హేమంత్‌దా అస్తమయం

# "ప్రేయసీ ప్రియులంతా దిక్కుమాలినవాళ్ళైనారు!"

ప్రేయసీ ప్రియులందరికీ గుండెల్లో రగిలే "పాట" హేమంత్‌దాది-అది మూగబోయింది-విరహం ఇప్పుడు దిక్కుమాలిందైంది! ఏభైయేళ్ళు బరువుగా భారంగా మంద మంద్రంగా గుండెల్లోకి నేరుగా స్వరమాధురిని దింపేసిన గాత్రభూషణ్ ఛు చరిత్రలో కలిసిపోయాడు! హేమంత్ ముఖర్జీ-బొంబాయి హిందీ చిత్రరంగంలో రాజ్యమేలినా తనకు యిష్టమైన కలకత్తాలోనే కన్నుమూశాడు. (వయస్సు 69, భార్య, కుమారుడు, కుమార్తెతోపాటు అసంఖ్యాక హిందీ సంగీత ప్రియులు కూడా దుఃఖంలో పాలు పంచుకున్నారు.)

"హై అప్నాదిల్ తో ఆవారా! నజానే....కిసీపే ఆయేగా" పాటని కిశోర్ కుమార్ పాడేడనుకున్న వాళ్ళింకా వున్నారుకాని కిర్రెక్కించే యిలాంటి పాటలు కొన్ని-పంకజ్ మల్లిక్, సైగల్‌ల కాలంలోనే-తారాపథం చేరుకున్న-హేమంత్‌కుమార్ ముఖర్జీ పాడాడు! "అనార్కలీ" చిత్రంలో ఆయన పాడినపాట "జాగ్ జాగే దర్దే యిష్క్ జాగ్" అన్నపాట పల్లవి (విరహమా! లే! ప్రేమ బాధలో) ఒక రకంగా హేమంత్‌దా గాత్ర తత్వానికి ప్రతీక! అయితే "నాగిన్" "బీస్‌సాల్ బాద్" చిత్రాలు ప్రమోగించిన విజయఢంకా క్రెడిట్ అంతా ఆ చిత్రాల సంగీత దర్శకుడు అయిన హేమంత్‌కుమార్ ముఖర్జీదే! ఆయన పాడిన ఏపాట విన్నా ఒక "అలౌకిక భారం" శ్రోతల్ని క్రమ్ముకుంటుంది! అటువంటి సంగీత వేత్తకి "గానకళానిధి"కి పద్మభూషణ్‌తో సహా ఎన్నో అవార్డులు రావడం ఆశ్చర్యంకాదు-హేమంత్‌కుమార్ బాణీని ఈతరం గాయకులు అసలు అనుకరించ, అనుసరించ లేరు. సైగల్ బాణీలకుమల్లే అది అనితర సాధ్యం!-లతామంగేష్కర్‌కి ఇష్టమైన "ఏ జిందగీ ఉసీకాహై జో కిసీకా హోగయా" పాటకి స్వర కల్పన హేమంత్‌కుమార్‌దే! సాహిబ్ బీబీ అవుర్ గులామ్‌కి కూడా మ్యూజిక్ డైరెక్టర్ ఆయనే-

ఆయన "యిక లేర"న్న వార్త వినంగానే ఎన్నో ఎన్నో జ్ఞాపకాలు "మన్ డోలే మేరా తన్ డోలే" అంటూ ముప్పిరి గొంటున్నాయి!! ఏ గ్రేట్ మాస్టర్ యీజ్ నో మోర్!

27-9-89

- వీరాజీ

---

సంటాడా !

ద్రౌపది గుండె మండింది.

తలెత్తి ధర్మరాజు ముఖంలోకి చూస్తూ 'కంకుభట్టూ ! నువ్వన్నది నిజం. నేను నటినే. నా భర్తలయిదుగురూ కూడా నటులే. మొదటివాడు జూదరి కనుక మిగిలిన నలుగురూ అతని మూలంగా పిరికిపందలయ్యారు. మేము సమయానికి తగ్గట్టుగా నటిస్తూ పొట్టపోసుకుంటున్నాం. జూదరి అలికి గౌరవం ఎవరిస్తారులే' అంది. 'కంకుభట్టు' అని ద్రౌపది ఎప్పుడయితే పిలిచిందో ధర్మరాజు అప్పుడే అదిరిపడి ఆమె వంక చూశాడు. ద్రౌపది కూడా అతనిని ఎర్రగా చూసింది. అక్కడో క్షణం నిలవకుండా చరాచరా వెళ్ళిపోయింది.

* * * *

ద్రౌపదికి ఆరాత్రి ఓ పట్టాన గడుస్తుందనిపించలేదు. అంతఃపురం సద్దుమణిగి అందరూ నిద్రపోయాక రహస్యంగా భీముడి దగ్గరకు వెళ్ళి అతన్ని నిద్ర లేపింది. 'భీమా ! నీ భార్యకింత అవమానం జరిగాక కూడా నీకు నిద్ర పడుతోందా ? మీ అన్నలాగా నీ మనసు కూడా రాయై పోయిందా ? ఈ ద్రౌపది ఇలా దుఃఖిస్తూ, ఇంత నీచంగా, తుచ్ఛంగా అవమానపడుతూ ఉంటే నీకు నేనేమీ కానట్టు హాయిగా నిద్ర పోతున్నావా? అయ్యయ్యో ! ఎంత దుర్గతి పట్టింది నాకు. ద్రుపద మహారాజు కూతురు ఈ యాజ్ఞసేనికి ఎంతటి అధఃపతనం ! విక్రమంలో సాటిలేని అయిదుగురు భర్తలుండీ కూడా ఎవరూ ఆదుకోని నా బ్రతుకెందుకింకా...?' అంటూ జాలిగా ఏడ్చింది.

భీముడు లేచి కూర్చున్నాడు.

నిద్ర కాస్తా ఎగిరిపోయింది.

'...భీమా ! కీచకుడి పట్టు విడిపించుకోవాలని పారిపోయి నేను విరటుడి కొలువుకొస్తే యుధిష్ఠిరుడు ఏమన్నాడో విన్నావుగా. నేను ఇల్లాల్నే కాదట. ఛీ..ఛీ.. అతనామాట అన్నాక నేనింకా ఎందుకు బ్రతికున్నానా అనిపిస్తోంది నాకు. నువ్వు చెప్పు నా జన్మంతా అవమానాలు పడాల్సిందేనా?' అని పెద్దగా ఏడ్చింది.

భీముడు ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చాడు.

ద్రౌపది మనసు తేలికపడింది. అతని మెడచుట్టూ చేతులువేసి గాఢంగా గుండెలకు హత్తుకుని 'నా మాటను మన్నించేది నువ్వొక్కడివే భీమా ! నన్ను ప్రేమిస్తోంది కూడా నువ్వొక్కడివే. నువ్వే లేకపోతే ఈ ద్రౌపదికి ఎప్పుడో నూరేళ్లు నిండేవి' అని అతన్ని చుట్టేసుకుంది. అతనిలో తీయని అలజడి రేగింది. అది గ్రహించి 'నేను నిన్ను కాంక్షగా చూస్తానని సుధేష్ణ మందిరంలోని మిగిలిన పరిచారికలందరూ నన్ను రోజూ ఆటలు పట్టిస్తుంటారు తెలుసా?' అంది.

ఆ మాటలకు భీముడు పులకరించాడు.

'ఇంతకీ ఇప్పుడేం చెయ్యమంటావో చెప్పు ?' అని ఆమె ముఖాన్ని పైకెత్తి ముద్దాడబోయాడు.

ద్రౌపది దూరంగా జరిగి 'కీచకుణ్ణి నువ్వు చంపేవరకూ నేను సుఖంగా వుండలేను. ఆ రాక్షసుణ్ణి నువ్వు వధించేవరకు నాకు శాంతి లేదు. వాడు పోయాకే నాకు అన్నమయినా, నిద్రయినా...' అంది.

ద్రౌపదికెలా నచ్చచెప్పాలో తెలీలేదు భీముడికి.

'...కీచకుణ్ణి చంపలేక కాదు ద్రౌపదీ, వాడ్ని చంపిన మరుక్షణం నేనెవరో పదిమందికీ తెలిసిపోతుంది. మనం ఇన్నాళ్లూ

పడ్డ కష్టమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. కథంతా మళ్లీ మొదటికొస్తుంది. అజ్ఞాతవాసంలో ఉండగా బయటపడితే మనం మళ్లీ అడవులపాలు కావల్సి వస్తుంది' అని మెల్లగా హెచ్చరించాడు.

అయినా ద్రౌపది వినలేదు.

'నువ్వింత దయలేనివాడవనుకోలేదు. నువ్వు ఇన్నాళ్లూ నామీద చూపించిన ప్రేమంతా నిజమనుకున్నాను. నీ తేజాన్నీ, బలాన్నీ, శౌర్యాన్నీ మరుగున పడేసుకుని, వేషం మార్చుకుని మామూలు వంటలవాడిగా నటిస్తున్నావే, నీకు గుట్టు రచ్చకాకుండా కీచకుణ్ణి చంపడం చేతగాదంటే నమ్మమంటావా ?' అంది.

భీముడికేం చేయాలో తోచక అలానే నిలబడిపోయాడు.

'నాకెవరూ లేరు. నేను ఒంటరిని. కీచకుణ్ణి చూస్తూ, వాడి చూపులు భరిస్తూ బతికేకన్నా చావడం మేలు. నువ్వు కీచకుణ్ణి చంపకపోతే నేనా పనిచేసి తీరతాను' అంది ద్రౌపది.

ఆ మాట అంటున్నప్పుడు రోషంతో నిలువెల్లా వణికింది.

భీముడు బెదిరిపోయాడు.

పాంచాలపుత్రిని దగ్గరకు తీసుకుని ఆమె కన్నీళ్లు తుడిచాడు. 'మహారాణీ ! మానవతులైన స్త్రీలు కన్నీళ్లు పెట్టకూడదు. నా మాట విను. నీ మనసుకు ఊరట కలిగేలా నేను కీచకుణ్ణి చంపుతాను. రేపు వాడు నీకోసం సుధేష్ణమందిరానికి వచ్చినప్పుడు వాడికేమాత్రం అనుమానం రాకుండా అనునయంగా మాట్లాడు. చీకటి పడ్డాక నర్తనశాలకు వస్తే నీ ముద్దు చెల్లిస్తానని చెప్పు. మన సమాగమం మూడో కంటికి తెలియకూడదను. నీకోసం పడిచచ్చేవాడు నీ మాటలు కాదనలేడు. వచ్చి తీరతాడు. తరువాత సంగతి నేను చూసుకుంటా' అన్నాడు.

ద్రౌపదికి కొండంత బలం వచ్చినట్లనిపించింది.

భీముడ్ని పొగిడి, కదిపి, తనేడ్చి, అతడిని ఏడిపించి, మందలించి, బెదిరించి చివరికి ఎలాగయితేనేం అతణ్ణి కీచకుడి మీదకు ఉసికొల్పింది. పట్టిన పగ చల్లారబోతోందని ద్రౌపదికి సంతోషమైంది. అప్పటికి మూడొంతుల రాత్రి గడిచింది. తెల్లవారటానికీ, ప్రొద్దు పొడవటానికీ ఇంకా వ్యవధి ఉంది. ద్రౌపది మెల్లగా భీముడు పడుకున్న వంటశాల నుంచి బయటకొచ్చి చీకట్లో కలిసిపోయింది.

తన గదిలో పక్కమీద్న పడుకున్న ద్రౌపదికి ఎంతకీ తెల్లవారదేం అనిపించింది. పక్కమీద అటూ ఇటూ దొర్లింది. కిటికీ తలుపులు తెరిచి ఆకాశం వైపు చూసింది. కాలం ఆగిపోయినట్లనిపించింది.

తెల్లవారాలి. తను సైరంధ్రి మందిరానికి వెళ్లాలి. అక్కడికి తనకోసం కీచకుడు వస్తాడు. తను తెలివిగా వాడిలో ఆశలు రేపి, నమ్మకం కలిగించి వాడిని ఒంటరిగా, నిస్సహాయంగా రేపు రాత్రికి నర్తనశాలకు రప్పించాలి...

ద్రౌపది గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

ఆలోచనలమధ్యే తెల్లవారింది.

(ఇంకా ఉంది)

# సర్వరోగ నివారిణి దుంప



సర్వ రోగాలను నివారించి మనిషిని ఆరోగ్యవంతుడిగా చేసి నూతన జీవితాన్ని ప్రసాదించగల శక్తి 'గిన్సెంగ్' దుంపలో వుందట.

ప్రత్యామ్నాయ మందులపై జరిపే పరిశోధనలో భాగంగా ఈ గిన్సెంగ్ దుంప ఆరోగ్యానికి ఎంతో ఉపయుక్తమైనదిగా కనుగొనబడింది.

ఇంగ్లండ్ నుంచి ఆరేళ్ల క్రితం ఇజ్రేల్‌కు వచ్చిన వైద్య పరిశోధనా శాస్త్రవేత్త డాక్టర్ స్టెఫెన్‌ఫల్డర్ దీనిపై పరిశోధన ప్రారంభించారట.

చైనీయులు ఉపయోగించే మందులలో ఈ గిన్సెంగ్ ప్రధాన పాత్ర వహిస్తోంది. అన్ని కాలాలందు మొలిచే ఈ అడవి మొక్క దుంపని వేల సంవత్సరాలుగా టానిక్‌గా ఉపయోగిస్తున్నారట. ఇది మనిషిని ఆరోగ్యవంతుడుగా చేయటమే కాకుండా జీవన ప్రమాణాన్ని పెంచుతుందట కూడా.

గెలీలియన్ కొండ ప్రాంతంలో 20 కుటుంబాలవారు నివసిస్తున్న 'క్లిర్' అనే గ్రామంలో వుంటున్న ఈ శాస్త్రవేత్త వైద్యానికి పనికి వచ్చే మొక్కల పెంపకాన్ని ప్రారంభించారట. దానిలో ప్రత్యేకించి చైనీయులు వాడే మందులలో ప్రధాన పాత్ర వహిస్తున్న ఈ గిన్సెంగ మొక్కల పెంపకంపై ఆయన దృష్టిని కేంద్రీకరించారు.

ఇజ్రేల్‌లో ఏ వాతావరణ పరిస్థితులలో అది పెరుగుతుంది. ఆర్థికపరంగా అది సాధ్యమయ్యే పనేనా అన్న విషయమై అనేక ప్రయోగాలు జరిపినట్టు ఆ శాస్త్రవేత్త పేర్కొన్నారు.

ఏమాత్రం వెలుతురు చొరవదని 'షేడ్ హౌసెస్'లో పరిమితమైన వాతావరణ పరిస్థితులలో అత్యంత జాగ్రత్తగా వీటిని పెంచవలసి వుంటుందని, ఇవి పెరగటానికి కనీసం నాలుగు సంవత్సరాలు పడుతుందని ఆ శాస్త్రవేత్త తెలియజేశారు.

అనేకమైన వ్యాధుల నుంచి మనల్ని కాపాడే ఆకులు, అలములు మనకు తెలియనివి ఎన్నో వున్నాయని వాటిలో ఈ గిన్సెంగ్ దుంప ఒకటని దీనిపై పరిశోధనలో నిమగ్నమైన డాక్టర్ స్టెఫెన్ వెల్లడించారు.

జెనెటిక్స్‌లో డాక్టరేట్ పొందిన డా. స్టెఫెన్- దీనిపై జరిపిన పరిశోధన విజయవంతమైనట్టయితే వీటి పెంపకం దార్ల కోసం వెతుకులాట ప్రారంభిస్తామని తెలియజేశారు. ●

# బెస్ట్ కాదు రెస్ట్

పుడుతూ అనుకున్నాను
తల్లిపాలు దొరికితే బెస్ట్‌గా వుంటుందని
పెరుగుతూ అనుకున్నాను
తోబుట్టువులలో నేనేబెస్ట్‌గా వుండాలని
స్కూలుకెళుతూ అనుకున్నాను
మిత్రులకన్నా బెస్ట్‌మార్కులు కావాలని
ఉద్యోగాన్వేషణలో అనుకున్నాను
సహచరులకన్నా నాకే బెస్ట్‌జాబ్ కావాలని
కానీ,
అక్కడ తగిలింది నాకు అడ్డు
రాజకీయమనేదొకటుందట
దానికి పదవనేదొకటుందట
ఆ పదవికి పలుకుబడనే దొకటుందట
అదుంటేనే బెస్ట్ జాబట
అందుకే–



ఊరూ, వాడ గెలిచాను
మండలం, జిల్లా మనదనిపించి
రాష్ట్రం, దేశం, ప్రపంచంలోనే బెస్టనిపించా
మరెక్కడబెస్ట్‌రావాలా అని ఆలోచిస్తుంటే
ఆకాశంలోకనిపించాడు చందమామ
చంద్రమండలంపై జెండాపాతి
అక్కడా బెస్ట నిపించుకున్నా
ఇంకెక్కడ బెస్ట్‌రావాలా అని ఆలోచిస్తుంటే
నా వయసుని గుర్తుచేస్తూ
నరుని నాలుగోతనంలో
మంచినీళ్ళు తెచ్చింది మా ఆవిడ
గుటకేస్తూ గుటుక్కుమన్నా
  అప్తులు ఆర్తనాదాలు చేస్తుంటే
  కట్టెచుట్టూ తుమ్మకట్టెలు పేర్చుంటే
  ఆకాశవీధి అలల్లోతేలుతూ...నా
  ఆత్మారాముడన్నాడు
  "ఈ లోకంలో నువ్వెంత బెస్ట్‌గా వచ్చినా
  చివరకు కావలసింది రెస్టేనోయ్"అని.

–కర్నాటి అమరేశ్వరరావు

# పెద్ద బుష్కోటు

## శ్రీరంగం నారాయణబాబు

**గరివిడి మాంగనీసు గనుల్లో మా బావమరిది మేనేజరుగా పని చేస్తున్నాడు. సాధారణంగా బంధువుల యిళ్ళకంటూ వెళ్ళను, నేను ఎప్పుడూ.**

కాని మా చెల్లెలంటే నాకు మమకారం ఎక్కువ. అది పుట్టాక మా అమ్మ జబ్బు మనిషైపోయింది. నా చేతులతో నేను పెంచాను. అందుకే మా చెల్లెలంటే నాకు వల్లమాలిన అభిమానం.

వేసవికాలంలో మా ఊళ్ళో ఎండలు దారుణంగా వుంటవి. మా వూరికి అప్పటికింకా ఎలక్ట్రిసిటీ రాలేదు. పంకాలుకాని, దీపాలుకాని, సౌకర్యం కొంచెం కూడ లేదు. వేసవికి రమ్మనమని మా బావమరిది ఉత్తరం రాశాడు. కాస్త ఎత్తయిన జాగా, కొండమీదవడం చేత, అక్కడ ఎలక్ట్రిసిటీ ఉండడంనించీ, మా బావమరిది పెద్ద ఉద్యోగస్తుల్లో లెక్కవస్తాడు కాబట్టి, చిన్న బంగళాలో ఉంటున్నాడు. అక్కడ హాయిగా వుంటుందనీ, అంతే కాకుండా గనులకన్నిటికీ యజమాని– డైరెక్టర్ సింగ్– ఇంగ్లండు వెళ్ళి వచ్చిన వాడనీ, ఆయన దగ్గర ఎన్నో మంచి పుస్తకాలూ, చక్కని లైబ్రరీ వుంది, చదువుకోవచ్చును రమ్మనమనీ రాశాడు. బ్రతుకుజీవుడా అని పాముకాటులాంటి వేసవికాలాన్ని తప్పించుకుందుకుగాను మనకు నల్లమందులాంటి మంచి పుస్తకాలు కూడా అక్కడ లభ్య మవుతాయనీ, మూటాముల్లె సర్దుకుని బస్సుమీద గరివిడి చేరుకున్నాను.

ఆ రోజు సాయంకాలమే మా బావమరిది సింగ్ దగ్గరకు తీసుకువెళ్తాను రమ్మనమన్నాడు.

సింగ్ పంజాబీ. మనిషి అజానుబాహు. మంచి వర్చస్సు వున్నవాడు. ఇంగ్లండు వెళ్ళి వచ్చాడు. ఆ రోజుల్లో ఇంగ్లండు వెళ్ళడమంటే కాశీ వెళ్ళడంకంటె గొప్పమాట. సింగ్ ఇంగ్లండు వెళ్ళినా ఏ పరీక్షలూ పాస్ అవలేదు. ఇంగ్లండ్ వెళ్ళినందుకు ఆయనకు అలవాటైనవి రెండు గుణాలు. తాగితందనా లాడడం– అవకాశం వస్తే వ్యభిచరించడం. ఈ రెండు గుణాలు ఇంగ్లండులో సంపాదించాడు కాబట్టి, ఎంతటి గొప్ప ఉద్యోగానికైనా అర్హుడు. అంచేత ఆ మాంగనీస్ కంపెనీకి డైరెక్టరుగా వెయ్యిరూపాయల జీతం, కారూ, బంగళా అన్నీ సమకూరినై.

సింగ్ ఎప్పుడూ ఆఫీసుకు వెళ్ళట్ట. ఇంట్లోనే కూర్చుంటాడు తాగుతూ. సంతకాలు పెట్టవలసిన కాగితాలన్నీ సాయంత్రం ఐదుగంటలకి మా బావమరిది తీసుకెళ్ళి సంతకాలు పెట్టించాలి. ఐదు మొదలుకొని ఆరువరకే ఈ లోకానికి చెందిన వ్యవహారాలు, ఈ లోకంలో వుండడం. మళ్ళా ఆరు గంటలు కొట్టారంటే పీత్వా పీత్వా పునఃపీత్వా అని ఎన్ని గాజుబుడ్లు గొంతులోకి దిగుతాయో చెప్పడం కష్టసాధ్యం.

సింగ్‌కు ఒకభార్య, ఇద్దరు పిల్లలున్నారు. భార్య ముఖం చూస్తే పూర్వోత్తరపు మనిషి, సాధ్వీ అనిపించింది. ఒకకొడుకూ, ఒక కూతురు ఆయనకి. కొడుక్కి నాలుగేళ్ళు కూతురికి ఐదేళ్ళూ. ఇద్దరు పిల్లలూ అందంగా, దొరల పిల్లల్లా వుంటారు.

సాయంత్రం మా బావమరిది ఆఫీసు కాగితాలతో పాటు నన్ను కూడ తీసుకెళ్ళి సింగ్‌కు గొప్పగా పరిచయం చేశాడు– కవిననీ, విద్వాంసుడననీ. సింగ్ కూర్చున్న హాలులో అనేక పులిచర్మాలూ, తుపాకీలు అవీ వున్నాయి. సింగ్ ఒకప్పుడు గొప్ప వేటగాడట. ఇప్పటికి కూడా పట్నం నుంచి విదేశీసారా రావటం ఆలస్యమైతే– లేదా, సారాకు గ్రహణం పట్టిన రోజుల్లో వేటకని వెళ్ళిపోతాడు. కారువేసుకుని సారాబుడ్లు వచ్చాయని తెలిస్తేనే సందెవేళకో, అపరాత్రికో ఇల్లు చేరుకుంటాడు.

సింగు నాతో ముక్తసరిగా రెండు మాట్లాడి ఇక్కడకు అన్ని పుస్తకాలూ తేలేదు, కొన్ని పుస్తకాలే తెచ్చానని, ఆ వున్న పుస్తకాలు కావలిస్తే చూడొచ్చుని, చూపించమని భార్యకు ఆదేశించాడు. ఆవిడ సవినయంగా నమస్కరించి, పక్క గదిలోకి తీసుకెళ్ళింది. ఒకటి రెండు పెద్ద వరుస బీరువాల్లో నాకు కావలసిన పుస్తకాలన్నీ ఉన్నాయి. కొన్ని ఏరుకుని, అవి చదివి ఇచ్చేశాక, కొత్తవి పట్టుకెళ్తాను మళ్ళా అని సింగ్‌కు ధన్యవాదాలర్పించి, ఇంటిముఖం పట్టేవేళకి సింగ్

### కథల కాణాచి

శ్రీ శ్రీరంగం నారాయణబాబు మహా కవియేగాక గొప్ప కథకులు. వారు రాసిన చివరి రెండు కథలూ ఆంధ్ర సచిత్ర వారపత్రికలోనే పడ్డాయి. అక్టోబర్ 2 వారి వర్ధంతి సందర్భంగా యీ కథని యిక్కడ వేస్తున్నాము. దీని తరువాత వారు రాసిన కథ అచ్చుతెలుగు. (1961 లోనే యీ రెండూ అచ్చైనాయి. శ్రీ నారాయణబాబు 1962 అక్టోబర్ 2న అస్తమించారు.)

–ఎడిటర్



పిలిచి "నాతో మీకిక పనిలేదు. మీకు కావలసినప్పుడు వచ్చి, నా భార్యనడిగి పుస్తకాలు పట్టుకెళుతుండండి" నాతో గౌరవంగా చెప్పాడు. నేను బ్రతుకుజీవుడా అనుకున్నాను. ఆయన తాగుడికి ఆటంకం రాకుండా అనుకుంటాను అలా అన్నాడు.

త్రాగినవాడితో ఎలా మాట్లాడడమో, ఎంత తెలివైన వాడైనా, త్రాగనివాడైతే తెలియదు. వెర్రివాణ్ని వెర్రివాడే తెలుసుకున్నట్లుగా తాగేవాడే అర్థం చేసుకోగలడు.

మా బావమరిది ఆఫీసుపక్కా, నేను ఇంటిపక్కా నడుస్తున్నాము. సింగ్ బంగళాకు ఎదురుగుండా చింతచెట్టు కింద చిన్న పూరి గుడిసె ముందు, యౌవ్వనం సడలి, ప్రౌఢత్వం పరిఢవిల్లే ఒక అందాలు చిందే ఆడమనిషి మాసిన చీరెతో ఒక



# గోవింద దుష్ప్రచారం



నీలంపైన పనిగట్టుకుని ఈమధ్య దుష్ప్రచారం మొదలుపెట్టాడట గోవింద. అభిమానుల్లోను, బంధువుల్లోను ఆమెపై జుగుప్స కలిగే విధంగా ప్రచారం మొదలెట్టిన గోవిందను నీలం లెక్కలోకి తీసుకోవటం లేదట. మొదట్లో బాగానే వుండేవాడు. చివరికి చాలా అసహ్యంగా ప్రవర్తిస్తున్నాడని వాపోతోందట నీలమ్. మరి 'ఆ' వ్యవహారమేదన్నా చేడిందో... ఏమో?!

నాలుగేళ్ళ కుర్రాణ్ణి దగ్గర పెట్టుకుని కూచుంది. ఆవిడ ముఖం చూస్తే నాకెందుకో ఆవిడ పెద్దింటికి చెందింది. కర్మవశాత్తూ, కాలవైపరీత్యం నుంచి, కడగళ్ళపాలై ఈ దీనావస్థలో వుంది– ఒక ఉపశమించే మాటంటే ఆవిడకు ఊరట చేకూరుతుందేమో అనిపించింది.

దగ్గరవున్న కుర్రవాడు నాలుగేళ్ళవాడు. ఆ కుర్రవాడికి మానవత్వం పోలికలు లేవు. మృగంలా వున్నాడు. కాస్త చిన్న పిల్లలు చూస్తే దడుసుకుంటారు. ఆవిడ కొడుకు అవుతాడా? ఎంత మాత్రంకాదు. భర్త ఒకవేళ ఎంత అందవిహీనుడైనా, ఆమె వర్చస్విని కాబట్టి, కొంతైనా వీడికి రాకుండా వుంటుందా! ఏమో, ఏమని చెబుతాం. భార్యాభర్తలు అందంగా వుండొచ్చు– పిల్లలు వికృతంగా వుండొచ్చు! దంపతులు ఏమీ అందమైన వాళ్ళు కాకపోవచ్చును– పిల్లలు అందమైనవారు అవవచ్చును. చీకటిలోంచి కాంతిపుట్టలేదా, కాంతిని చీకటి కబళించలేదా– అంతే!

పలకరిస్తే ఏమనుకుంటుందో– చెడ్డవాణ్ణి అనుకుంటుందేమో! అనుకుంటూ నాలుగడుగులు వెళ్ళి మనస్సు వెనక్కి లాగితే ఆ పూరి గుడిసె దగ్గరికే వెళ్ళా. ఆమె భయంగా లేచి ఆ గుడిసెలోకి వెళ్ళింది. పైకి ముఖాన్ని పెట్టి "ఎవరు బాబూ, మీకు ఏం కావాలి?" అంది. నీ పేరేమిటన్నా. ఆవిడ పేరు చెప్పేందుకు జంకింది. నేను నా మనస్సులో అనుకున్నది చెప్పా.

"నా పేరు రంగమ్మ. మీరు అనుకున్న దానిలో యదార్థం ఉందండీ. మీరు గొప్ప యింటివారు కాబట్టి పోల్చగలిగారు. మరోపుడు నా బ్రతుకు మీకు మనవి చేసుకుంటాను. చీకటి పడుతున్నాది. ఎవరైనా చూస్తే ఏమైనా అనుకుంటారు. ఇంటికి వెళ్ళండి" అన్నది.

సింగ్ బంగళా, కనులకు విందుగొలిపే అందాల సోఫానన్నట్టే ఆకర్షించలేక పోయింది. పూరి గుడిసెలో రంగమ్మ ఎవరై వుంటుందీ. దగ్గరగా వున్న కుర్రవాడు ఏమౌతాడూ, అనే సంగతులు పదే పదే నా హృదయంలో పరిణితి పొందాయి.

రాత్రి భోజనం చేయడం, నా పుస్తకాల చదువు గొడవలో సద్యోఫలితమైన విద్యుద్దీపంపక్షిరెక్కల్లా చల్లని గాలి ఉయ్యాలలూపే ఎలక్ట్రిక్ పంకా, సౌఖ్యాన్ని చేకూర్చాయి. చదువుకంటే నిదురకే శరీరం, మనస్సు దోహదం చేస్తాయి.

ఉదయం నేను లేచేసరికి చాలా ఆలస్యమయింది. నేను సాధారణంగా చీకటి వుండగానే లేస్తాను. ఆ రోజు మాత్రం ఆలస్యమయింది. లేచిన వెంటనే కాఫీ లేకపోతే దుర్దినంగా తోస్తుంది. కాబట్టి వంట యింట్లోకి వెళ్ళేసరికి మా చెల్లెలు ఆప్యాయంగా ఫలహారం కాఫీ అందించింది. ఫలహారం చేస్తూ వుంటే–

"ఏమిరా, నిన్న సాయంత్రం సింగ్ ఇంటి నుంచి వస్తూ, రంగమ్మను పలకరించావుగా. అది నాతో వచ్చి చెప్పుకుంది. దాని గాథ విచిత్రమైంది– నాకు తెలుసు. అపుడపుడు మన ఇంట్లోకి వచ్చి పని సహాయం చేస్తూ వుంటుంది అని అంటూ–

"పెద్ద యింటికి చెందిందే పాపం– దాని ఖర్మం ఇలా కాలి అగచాట్లు పడుతున్నది. మన ఊరికి దగ్గరగా వున్న గుంకలాం కరణం కూతురు. తండ్రికి వల్లమాలిన ఆస్తి, పలుకుబడీ– అన్నిటినీ విసర్జించి, వారింటికి చెందిన ఒక పాలి కాపును ప్రేమించి, తండ్రి దండిస్తే, అతనితో లేచి పోయి నెల్లిమర్ల మిల్లులో ఇద్దరూ పని చేసుకుంటూ, తెచ్చుకున్నది తక్కువే ఐనా, సుఖంగా, కాలక్షేపం చేసి, సౌఖ్యంగా జీవితాన్ని గడుపుతూ వుండే రోజుల్లో రంగమ్మకు ఒక కుర్రవాడు పుట్టాడు. వాడే ఆ రంగమ్మ దగ్గర కూర్చున్నవాడు".

"వాడు వన్యమృగం కంటే అధ్వాన్నం. పశుబాలుడు. వాడికి వినిపించదు. మాటలు రావు. వాడు పుట్టిన రెండేళ్ళకి నెల్లిమర్లలో కలరా రావడం– ఎవరి కోసమైతే తాను త్యాగం చేసి, జీవితం స్వర్గంగా చేసుకుందో, వాణ్ణే తన చేతులతో పిడికెడు బుగ్గి వేసి, నది సముద్రంలో నావలో పిల్లాణ్ణి పెంచలేక, కూలి చేయలేక– సొంత ఊరు చేరుకుని, అపరాధం మన్నించమని తండ్రి కాళ్ళు పట్టుకుంది. బలవంతం మీద తండ్రి ఆ హీనుడికి పుట్టిన కొడుకును వదిలేసి తాను వచ్చి ఇంట్లో వుండొచ్చు అన్నాడు. తనకు మనస్కరించలేదు.

అనాకారులైనా, కురూపులైనా బిడ్డలను వల్లమాలిన మమకారంతో సాకుతుంది. అందుకే స్త్రీ పురుషుడి కంటే ఎపుడూ గొప్పదే".

"ఊళ్ళు తిరిగి, ఈ గరివిడి చేరుకుని, ఈ గనిలో పనిచేస్తే, రకరకాల మనుషులు వుండటమే కాకుండా, పిల్లాణ్ణి ఒంటరిగా విడవలసి వస్తుంది కాబట్టి, సింగ్ ఇంటి దగ్గర అంట్లు తోముతుంది. ఒక పూట భోజనం, నెలకు మూడు రూపాయలు ఇస్తారు. మానవతి, ఉత్తమ గుణాలు కలిగింది ఐతేనేం? దరిద్రం ఉన్నపుడు జీవితం రేవుకి రాదు..."

అని మా చెల్లెలు నాతో చెప్పేసరికల్లా, నా మనస్సు వికలమైంది. రంగమ్మ మీద ఒక విధమైన గౌరవం, రంగమ్మ కొడుకు మీద జాలీ కలిగాయి.

నేను పుస్తకాల కోసం అపుడపుడూ సింగ్ ఇంటికి వెళ్తున్నపుడు, రంగమ్మని పలకరించడం, కాస్త ఏదైనా చిల్లర డబ్బులు ఇవ్వడానికి ప్రయత్నిస్తే ఆమె ఎంత మాత్రం వద్దని వారించి పుచ్చుకునేది కాదు. ఎపుడూ రోదిస్తూ వుండేటువంటి ఆ కొడుకు చేతిలో కాస్త చిల్లర డబ్బులు పెట్టి ఇల్లు చేరుకొనేవాణ్ణి.

* * * * *

ఒకనాడు ఉదయాన్నే ఏదో వ్యాసం రాస్తూ, కొన్ని పుస్తకాలు అవసరం వచ్చి సింగ్ ఇంటికి హుటాహుటీ బయలుదేరి వెళ్తున్నాను. తోవలో రంగమ్మను పలకరించి పోదామని చింతచెట్టు దగ్గరకు చేరుకొనేసరికి, ఆ చింతచెట్టుకు వేసి రంగమ్మ కొడుకుని ఒక తాడుతో కట్టబడిన దృశ్యం కనిపించింది. విపరీతంగా ఏడుస్తున్నాడు రంగమ్మ కొడుకు. రంగమ్మని పిలిచి–

"ప్రకృతే వాడికి చేయవలసినంత అన్యాయం చేసింది. ఇంకా ఈ తాడుతో కూడా ఎందుకు బంధిస్తావు వాణ్ణి? నీవు అన్నది వాడికి వినిపించదు. మాట్లాడేందుకు ఉపయుక్తం కాక నోరు ఏడుపుకే పనికొస్తుంది. వాడి భాషంతా ఏడుపే– వదలి పెట్టు" అన్నాను.

రంగమ్మ గుడిసెలోంచి పైకి వచ్చి, కంట నీరు పెట్టుకుంటూ "ఏం చేయమన్నారు బాబూ– వాడి బాధ పడలేకుండా వున్నాను. ఈ మధ్య ఒక రోజు సింగు కొడుకు పుట్టిన దినం వచ్చింది. ఆ సింగు కొడుక్కి మంచి ముఖమల్ ఎర్ర బుష్‌కోటు తొడిగారు. అది వీని కంటబడింది. అప్పుణ్ణుంచీ అలాంటి కోటు కావాలని ప్రతి నిత్యం ఏడుస్తూ పొద్దున్న తెల్లవారే ముందు, సాయంత్రం సంధ్యలోను ఆకాశం వక్క చూపిస్తూ అరుస్తూ

# ఎఱ్ర బుష్‌కోటు

ఏడుస్తాడు. నాకా శక్తి ఎక్కడ వుంది కొనేందుకు అలాంటి కోటు! నెలకు ఇచ్చే మూడు రూపాయల జీతంలో ఒక రూపాయి మిగిల్చి, రెండు రూపాయలు ఖర్చు చేసుకుంటున్నాను. నాకెంత అభిమానం వుంటే మాత్రం, ఏం సాగుతుంది? జీతంలోది కష్టపడి మిగుల్చుకున్న మూడు రూపాయలతో ఓ ఒక ఎఱ్ర కోటు తెచ్చా, కొని- అది అక్కర్లేదంటాడు.

"ఆ సింగు కొడుకు వేసుకున్నలాంటి కోటే ఇమ్మంటాడు. అలాంటిది ఇరవై రూపాయల తక్కువ కివ్వనన్నారు. మా బ్రతుకేమిటి, నేనేమిటి? నా తల చేస్తుందా? కొనగలిగితే మాత్రం లోకం సహిస్తుందా? చిన్న పిల్లాడు. వాడికి ఇవన్నీ ఏం తెలుస్తవి బాబూ?"

"ఇవాళ సింగ్ కొడుకు పుట్టిన దినం. నా చేతుల్తో నేనే ఆ కోటు సింగ్ కొడుక్కి తొడిగాను. మా బాబుగాడు చూసి, సింగ్ కొడుకుమీద కెళ్ళి జులూం చేస్తే, సింగ్ కోపానికి హద్దులు లేవు. మా బాబుకి ప్రమాదమైనా రావచ్చు. నాకున్న ఈ నౌకరీ పోవచ్చు ఇపుడు మళ్లా పనిలోకి సింగ్ ఇంటికి వెళ్లాలి. అంచేత తాడేసి కట్టేస్తే మంచిదికదా అని కట్టేశాను అందుకలా మారాం చేస్తున్నాడు" అని చెప్పింది.

సింగ్ బంగళా గేటు కేసి ప్రవేశించేసరికల్లా సింగ్ భార్య చడీ చప్పుడూ లేకుండా నా వైపు కొచ్చి సద్దు చేయకుండా తనతో రమ్మంది. నేను విస్మయం చెందాను. ఆవిడ చెప్పినట్టుగానే ఆవిడ వెంట బంగళా వెనుక భాగానికి చప్పుడు చేయకుండా మెల్లగా నడుస్తూ వెళ్లాను. ఆవిడ మెల్లగా రహస్యం చెప్పినట్టుగా నాతో ఈవిధంగా చెప్పింది. ఈపొద్దునవేళ పదిదాటే లోపున వాళ్ల బంగ్లాకు ఎప్పుడూ రావొద్దు. వస్తే ప్రమాదం వుందని అంది. అంటే నాకు అర్థమవక–

"ఏమిటా ప్రమాదం?" అని అడిగాను.

"రాత్రల్లా తాగడంతో గడిపిన సింగ్ తెల్లవారుజామున కుర్చీలోనే కొంతసేపు నిద్రించి. ఎనిమిది గంటలన్నరయ్యేసరికల్లా, పడక గదిలో నుంచి పైకి వచ్చి హాలులో కూర్చుంటాడు. అపుడు అతనికంట ఎవరూ పడకూడదు. అతని చెవిని ఏ శబ్దం పడకూడదు. అతనికంట ఎవరైనా పడ్డా, ఏదైనా దారుణమైన శబ్దం ఆయన చెవిని పడ్డా, సహించలేక కోపం వస్తే ఎంత పనైనా చేస్తాడు."

ఒకమాటు ఆయనకు కావలసిన ఫలహారాలన్నీ ఆవిడ అమర్చి, అతనికంట బడకుండా ఆవిడ వంటింట్లోకి చేరుకుందట. ఎందుకో ఆవిడకి సింగ్ పిలిచినట్టుగాతోస్తే హాలులోకి వెళ్లబోయిందట. ఆవిణ్ణి చూసి సింగ్ తుపాకీ తీశాడట. ఆవిడ జడిసి పారిపోయిందట. అందుచేత "పుస్తకాలు కావలిస్తే సాయంత్రం రావచ్చును. ఇప్పటికి సద్దు చేయకుండా పెరటితో వంటే ఇంటికి పొండి" అంది. నేను బ్రతుకుజీవుడా అనుకుని, బయటపడి, నిషాకు జీవితం అమ్ముకున్న మనుష్యుల్లో రాక్షసత్వానికి చెందిన వింత గుణాలేవో బ్రహ్మజెముళ్లా పెరిగి, సన్నిహితులైన వాళ్ల నిహింసించడంలో కంటో మనకు తరచూ ద్యోతకమవుతుంటుంది. దీనికి హృదయ తత్వశాస్త్రం కూడా సరియైన జవాబు చెప్పలేదేమో!

నేను ఇల్లు చేరుకుని వ్యాసం రాసుకుంటున్నాను. కొంత సేపయాక తుపాకీ పేలిన శబ్దం వినిపించింది. గుండె గతుక్కుమంది. సింగ్ ఇంట్లోనించి ఆ ధ్వని వినిపించింది. నాకు కరచరణాలాడలేదు. వెళ్లి చూదామా అనుకున్నాను. వెళ్లడంవల్ల ఏం చిక్కులు వస్తాయో, నాకు కాకపోయినా నా బావమరిదికి- అని భయం వేసింది. వ్యాసం రాయలేకపోయి ఆలోచిస్తూ కూర్చున్నాను. సన్నెండు గంట లయింది. భోజనానికి లేద్దామనుకున్నాను.

రంగమ్మ కొడుకుని సింగ్ తుపాకీతో కాల్చి చంపేశాడని, గనిలో కెళ్ళే కూలీలనుకుంటున్నారు. నేను వుండలేకపోయాను. ఏ ఆపద సంభవించినా సంసిద్ధతతో రంగమ్మ పూరి గుడిసె దగ్గరకు తొందరగా వెళ్లాను.

రంగమ్మ గుడిసె ముందు కొద్దిమంది మనుష్యులు మూగివున్నారు. ఆ మనుష్యులను తోసుకుని లోపలికి వెళ్లాను. రక్తపు మడుగులో మృతించిన రంగమ్మ కొడుకున్నాడు. గుండు గుండెల్లోంచి దూసుకుపోయింది. రంగమ్మ ఇంట్లో లేదు. నే నాశ్చర్యపడ్డాను. అక్కడవున్న కూలీని "ఏం జరిగింది?" అని అడిగాను.

రంగమ్మ కొడుకు సింగ్ ఇంట్లో, పెరట్లో ఆడుకుంటున్న కొడుకు మీదికి గెంతుకుంటూ వెళ్లి ఆ కుర్రవాణ్ని గోళ్లతో రక్కి, పళ్లతో కోటు చీల్చి పారేశాడట. సింగ్ కొడుకు పెద్దగా ఏడ్చాడట. సింగ్ కిటికీలోనుంచి చూసి, తుపాకీ తెచ్చి రంగమ్మ కొడుకుని కాల్చేశాడట. ఇంట్లో పని చేస్తున్న రంగమ్మను పిలిచి ఇరవై రూపాయలు ఇచ్చాట్ట. ఈ విషయం ఎవరితోనైనా అంటే రంగమ్మను కాల్చి చంపుతానని అన్నాట్ట.

ఇంతలో రంగమ్మ ఏడుస్తూ వచ్చింది. రంగమ్మ చేతుల్లో ముఖమల్ బుష్‌కోటు వుంది. కొడుక్కి ముఖమల్ బుష్‌కోటు తొడిగింది. కన్నీళ్లలో మిలమిల కూడ ఏదో కొంత కనిపించింది. కొడుకు నెత్తుకుని ఊరి బయట స్మశానం పక్క నడిచి పోయింది. తరువాత మరి రంగమ్మ ఏమైందో ఎవరికీ కనుపించలేదు.

కొంతమంది కొడుక్కోసం చనిపోయిందన్నారు. మరికొంతమంది పుట్టింటికి వెళ్లి శుభ్రంగా వుందన్నారు. ఈ రెండిట్లో ఏదైనా అవడానికి అవకాశం కద్దు.

(8-3-1961 ఆంధ్ర సచిత్ర వారపత్రిక నుంచి)

## క్రీడారంగం క్విజ్

1) బ్యాడ్మింటన్‌లో భారత ఆటగాళ్లు సయ్యద్ మోడి, విమల్ కుమార్‌లు ఒక ప్రపంచ రికార్డు సృష్టించారు? ఆ రికార్డు ఏమిటి?
2) పురుషుల హైజంప్‌లో వరల్డ్ రికార్డు ఎవరిది ?
3) "జూనియర్ గ్రాండ్ స్లామ్" గెలుచుకున్న ఆటగాడెవరు?
4) క్రికెట్‌లో "త్రీ డబల్యూస్"అని ఎవరెవరిని అంటారు?
5) సునీల్‌గవాస్కర్ తన ఆఖరిటెస్ట్ మ్యాచ్ ఏ దేశం మీద, ఎక్కడ ఆడాడు? (100వ టెస్ట్ కూడా వారితోనే ఆడాడు.)
6) బిల్లీజీన్ కింగ్, బాబీరిగ్స్‌ని ఓడించినట్టే స్త్రీల డబుల్స్ టీమ్ ఒక పురుషుల డబుల్స్ టీమ్‌ని ఓడించింది. ఆ టీమ్స్ ఏమిటి?
7) తన మొదటి టెస్ట్‌లోనే సెంచరీ చేసి, అయిదు వికెట్లు సాధించిన (భారత్ పై) న్యూజిలాండ్ ఆల్ రౌండర్ ఎవరు?
8) "క్రికెట్ మై స్టయిల్", "బైగాడ్స్ డిక్రీ" పుస్తకాల రచయిత ఎవరు?
9) "జూడో"ని కనిపెట్టినదెవరు? 'జూడో' అంటే అర్థమేమిటి?
10) ఈ సంవత్సరం "ఆల్ ఇంగ్లాండ్ బ్యాడ్మింటన్" టైటిల్ పురుషుల విభాగంలో విజేత ఎవరు?

-వీరజై కిరణ్

(జవాబులు ఈ సంచికలోనే)

ప్రత్యేక వ్యాసం

# మర్మాంగాలు కూడా

## "ఆండ్రాలజీ" అంటే ఏమిటి ?

"నపుంసకత్వానికి కారణం 90 శాతం శారీరక సంబంధం, 10 శాతం మాత్రమే మానసిక సంబంధం. కాబట్టి ఈ 90 శాతం శారీరక లోపాన్ని సరిదిద్దగలిగితే నపుంసకత్వాన్ని చాలావరకు అరికట్టవచ్చు" అంటారు ప్రముఖ ఆండ్రాలజిస్ట్ డాక్టర్ సుధాకర కృష్ణమూర్తిగారు.

ఆడవాళ్ల మర్మావయవాలకు సంబంధించిన విభాగము గైనకాలజీ అయితే మగవాళ్ల మర్మావయవాలకు సంబంధించిన విభాగము ఆండ్రాలజీ. ఈ ఆండ్రాలజీలో విశేషానుభవాన్ని గడించిన వైద్య నిపుణులు డాక్టర్ సుధాకర కృష్ణమూర్తి.

ఈమధ్యే ప్రాచుర్యాన్ని పొందుతున్న ఈ సబ్జెక్టులో వెస్టర్న్ కంట్రీస్‌లో ఎక్కువగా పరిశోధనలు జరుగుతున్నాయి. అందుకని ప్రతి సంవత్సరం ఓ మూడు నెలల పాటు లండన్, బ్రెసెల్స్, జర్మనీ మొదలైన దేశాలు తిరిగి అక్కడ కనుగొన్న నూతన పరిశోధనలని క్షుణ్ణంగా గ్రహించి, తిరిగి మనదేశం వచ్చి, ఇక్కడి ప్రజలకు ఆ అనుభవాలతో అవసరమైన వైద్యాన్ని అందించడానికి కృషి సల్పుతున్నారాయన.

ఈమధ్య మూడు నెలల పాటు రకరకాల దేశాలని సందర్శించి, అక్కడ ఆండ్రాలజీలో జరుగుతున్న పరిశోధనలను తెలుసుకుని హైద్రాబాద్ చేరుకున్న డాక్టర్ సుధాకర్ కృష్ణమూర్తి గార్ని కలుసుకోవటం జరిగింది.

### మర్మావయవ లోపాలు

"పురుష మర్మావయవంలో వచ్చే శారీరక లోపాలు ముఖ్యంగా నాలుగు విధాలు. అవి ఆర్టీరియల్ గ్రూప్, వీనస్ గ్రూప్, న్యూరలాజికల్ గ్రూప్, ఎండోక్రైనల్ గ్రూప్" అన్నారు డాక్టర్ సుధాకర్ కృష్ణమూర్తి సంభాషణని ప్రారంభిస్తూ.

### పిల్లలు పుట్టకపోతే....?

ప్రశ్న: "ఆర్టీరియల్ గ్రూప్ అంటే ఏమిటండీ ?"

జవాబు: "ఎక్కువ బ్లడ్‌ప్రెషర్ ఉండేవాళ్లకు పినిస్‌లోని ఆర్టెరిస్ సన్నబడి, బ్లాక్ కావచ్చు. దీన్ని బైపాస్ సర్జరీ చేసి సరిదిద్దవచ్చు. మధుమేహం ఉన్న వాళ్లకి, ఎక్కువగా పొగ త్రాగే వారికి, మెటబాలిక్ డిజార్డర్స్ వున్నవాళ్లకి రక్తంలోపల డిసీజెస్ రావచ్చు. ఒక్కోసారి రక్తనాళాలు పెద్దవై, వెనక్కి వచ్చే రక్తప్రవాహం పెరుగుతుంది. అప్పుడు పురుష మర్మాంగంలో వచ్చే అనారోగ్యాన్ని వీనస్ గ్రూప్ అంటారు. ఆ తర్వాత 50 శాతం మధుమేహం ఉన్నవాళ్లు నపుంసకులవుతున్నారు. అందుక్కారణం నరాల బలహీనత. ఎక్కువగా పొగ త్రాగేవాళ్లకి, మత్తుమందుల్ని సేవించే వాళ్లకు కూడా పురుష మర్మావయవంలో న్యూరలాజికల్ గ్రూప్‌కి సంబంధించిన అనారోగ్యాలు రావచ్చు. నాడీ మండలమే పినిస్‌లో ప్రవహించే రక్తాన్ని ఒక పద్ధతి ప్రకారం ప్రవహింపచేట్లు చేసేది. అందుకని ఈ నరాలు దెబ్బతింటే రక్తప్రసరణ సరిగా జరగదు. వీటన్నింటినీ సరిదిద్దవచ్చు" అంటారు డాక్టర్ సుధాకర్ కృష్ణమూర్తి.



డా. సుధాకర్ కృష్ణమూర్తి
జనరల్ సర్జన్ అండ్ ఆండ్రాలజిస్ట్,
(హైదరాబాద్.)

ప్రశ్న :- "ఎండోక్రైనల్ గ్రూప్ లోపాల్ని గురించి చెప్పండి డాక్టరుగారూ."

జవాబు :- "కొన్ని హార్మోన్ల ఉత్పత్తి ఎక్కువైనా, తక్కువైనా కూడా నపుంసకత్వం రావచ్చు". ప్రొలాక్టిన్ ఎక్కువైనా ఇబ్బందే. టెస్టోస్టిరాన్ తగ్గితే సెక్స్ మీద కోరిక తగ్గుతూ రీనల్ ఫెయిల్యూర్ కావచ్చు... నపుంసకత్వం రావచ్చు. లివర్ ఫెయిల్యూర్ వాళ్లకి నపుంసకత్వం రావచ్చు".

### వి. డి. ల వల్ల...?

ప్రశ్న: "హస్తప్రయోగం వల్ల, వి.డి.ల వల్ల కూడా నపుంసకత్వం రావచ్చునంటారా?"

జవాబు: "హస్తప్రయోగం వల్ల షౌరపాటునకూడా రాదు. వి. డి. కూడా చాలా తీవ్రంగా వచ్చి ఆరాన్ లోపల నరాలు గాని, రక్తనాళాలు గాని దెబ్బతిం

# తయారుచేస్తున్నారు!

టే నపుంసకత్వం కలగటానికి అవకాశం ఉంది. మామూలు వి.డి.ల వల్ల నపుంసకత్వం రాదు."

## అవయవంలోపల అమరిక

ప్రశ్న: "వీర్య లోపం లేకుండా కేవలం మర్మావయవ లోపంవల్లే అంగస్థంభనం లేకుండా ఉంటే క్రొత్త ఇంప్లాంటేషన్ ఏదో చేస్తున్నారట కదండీ?"

జవాబు: "మర్మావయవాల లోపల శస్త్ర చికిత్స ద్వారా సైలాస్టిక్ లేక పాలియోరెతిన్‌తో చేసిన ఇంప్లాంట్‌ని అమరుస్తున్నారండీ... ఇలా ఇంప్లాంట్ చేయడం వల్ల అంగస్తంభన బాగా జరిగి రతి క్రియలో బాగా పాల్గొనగలుగుతారు. అంగాలు వివిధ పరిమాణాలలో వుంటాయి. అందుకని ఇంప్లాంట్స్ కూడా వివిధ పరిమాణాలలో లభిస్తాయి. ఇంప్లాంట్స్ రెండు రకాలు. ఒకటి సెమీ రిజిడ్, రెండోది ఇన్‌ఫ్లాటబుల్. సెమీ రిజిడ్‌లో అంగాన్ని అవసరమైనప్పుడు నిలపవచ్చు. మామూలు సమయంలో క్రిందికి తిన్నగా వుంచవచ్చు. దీనికి దాదాపు ఇరవై, ఇరవై రెండు వేలదాకా అవుతుంది. ఇన్‌ఫ్లాటబుల్ ఇంప్లాంట్‌లో మామూలు సమయాల్లో ముడుచుకుపోయి అవసరమైనప్పుడు టెస్టికిల్స్ దగ్గర నొక్కితే పెద్దదవుతుంది. తిరిగి టెస్టికిల్స్ దగ్గర నొక్కితే చిన్నదవుతుంది. ఇలా అవసరానికి తగ్గట్లు ఈ ఇంప్లాంట్‌ని మార్చుకోవచ్చు. దీని ఖరీదు చాలా ఎక్కువ. లక్ష దాకా అవుతుంది. ఇలా ఇంప్లాంట్ చేసే ఆపరేషన్‌ని ప్రోస్థసిస్ అంటారు."

ప్రశ్న :-"ఇలాంటి ఆపరేషన్లు ఇంత వరకు ఎన్ని చేశారండీ ?"

జవాబు :-"ఇక్కడ గాని, బొంబాయిలో గాని పన్నెండు దాకా చేశాను. ఎవరికీ ఎటువంటి కంప్లయింట్స్ లేవు.



ఇన్‌ఫ్లాటబుల్ ఇంప్లాంట్

ఈ ఆర్టికల్ ప్రచురితమయ్యే నాటికి ఈ సంఖ్య ఇంకా పెరగవచ్చు" అన్నారు కృష్ణమూర్తి నవ్వుతూ.

ప్రశ్న: "ఈ ఆపరేషన్ చేయడానికి ఎంత సమయం పడుతుందండీ?"

జవాబు: "రెండు గంటల దాకా పడుతుంది. ఆ తర్వాత ఓ వారం రోజులు ఆసుపత్రిలో ఉండాల్సి వస్తుంది. విదేశాలలో ఈ ఆపరేషన్‌కి అయ్యే ఖర్చులో మన దేశంలో మూడోవంతు మాత్రమే అవుతుంది. అందుకని గల్ఫ్ కంట్రీస్ నుంచి కొంతమంది మా దగ్గరికి వస్తున్నారు. మన దేశంలో ఇన్‌ఫ్లాటబుల్ ప్రోస్థసిస్ చేస్తున్నవాణ్ణి ప్రస్తుతానికి నేనొక్కడినే" అన్నారు సుధాకర్ కృష్ణమూర్తి.

## గొడ్రాలితనం

ఆ తర్వాత మా సంభాషణ వంధత్వం (ఇన్‌ఫెర్టిలిటీ)వైపు మళ్లింది.



సెమీ రిజిడ్ ఇంప్లాంట్

"దంపతులలో దాదాపు 20 శాతం మందికి పిల్లలు పుట్టడంలేదు. అందుక్కారణం 50 శాతం మగవాళ్ల లోపం! ఇటువంటివాళ్లందరూ పరీక్షలు చేయించుకుని, సరయిన చికిత్స పొందితే ఇన్‌ఫెర్టిలిటీని కూడా చాలా వరకు నివారించవచ్చు. మన దేహంలో మిగతా అవయవాల లాగానే మర్మావయవములు కూడా! మిగతా అవయవాలకిజబ్బులువచ్చినట్లుగానే మర్మావయవాలకి జబ్బులు రావచ్చు. అంత మాత్రాన ఏదో తప్పు చేసినట్లు ఎవరికీ



మర్మావయవ పరిమాణాన్నిబట్టి ఇంప్లాంట్ పరిమాణం మారుతుంది.

చెప్పకుండా చికిత్స పొందకుండా అనారోగ్యాన్ని ముదరపెట్టుకోకూడదు. అలాగని సెక్స్ స్పెషలిస్టులమని బూటకపు ప్రచారాలు చేసుకునే డిగ్రీలులేని డాక్టర్ల దగ్గరకి వెళ్లకూడదు. అది చాలా ప్రమాదం. ఆండ్రాలజీలో తర్ఫీదు పొందిన డాక్టర్లు వున్నారు. వాళ్ల దగ్గరకు వెళ్లి సరయిన చికిత్స పొందాలి. సకాలంలో సరయిన చికిత్స పొందితే మర్మావయవాలకి సంబంధించిన అన్ని అనారోగ్యాలను అరికట్టవచ్చు అంటున్నారు డాక్టర్ సుధాకర్ కృష్ణమూర్తి.

-వేదగిరి రాంబాబు

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**చల్లా వెంకటరావు- విజయవాడ**

అదృష్టవంతుడిని అన్నీ వరిస్తాయంటారు ఎంతవరకు నిజం?

* చాలా వరకు. అదృష్టం కలిసొస్తే- తెలివైన వాడిగా చెలామణీ అయిపోవచ్చు కూడా.

**శీలం నరసింగరావు- అలమండ సంత.**

నేటి సినిమాలకి వాటి పేర్లకి అసలు పోలికలు వుండడం లేదు. కారణం?

* అవసరం లేదంటున్నారు. షేరు చూసి టిక్కెట్టుకొని హాల్లోకి వెడతారా? వెళ్లాక తిరిగివచ్చేస్తే డబ్బు దండగై పోతుందని వచ్చినట్టు కూర్చుంటారా? ఇంకెందుకు- కథకీ పేరుకీ పొంతన?!

**కె. శ్యామల- కలకత్తా**

నేను మీకు రాస్తున్న విషయం అందరికీ తెలిసిందే. అయినా మీకు రాస్తున్నాను ఎందుకని. కొందరితో ముచ్చటించుకోవడం మనస్సుకు తేలికగా వుంటుంది కనుక. ఆకాశాన్నంటే కట్టడాల దగ్గిర నుంచి అందరికీ పనికివచ్చే పిన్ను దాకా... మన్నిక ఒకలాగే వున్నాయి... ఈ కల్తీ కట్టడాలు, కల్తీ సామానులు.... నెత్తిమీద నీడను చూసి కూడా భయపడి పోతున్నాం- ఈ రోజుల్లో ఈ సంపాదనతో ఏం బావు కుంటారో ఎవరైనా చెప్పకలరా?

*నిజమే సోదరీ, అత్యాశ మనిషినిలా- నైతికంగా దిగజార్చేస్తుంది.... వినియోగదారులు- ఎవరికి వారే కదా- అన్న ధీమాతో బరితెగించి కల్తీలు చేస్తున్నారు. సోషల్ లిటిగేషన్- వినియోగదారులు- నిత్యచర్యగా చేపట్టనన్నాళ్ళు- యీ గతి మనకి తప్పదు. బాగా చదువుకున్న వాళ్లు, సాంఘిక బాధ్యతల పట్ల - సామాన్యునిపట్ల మంచి భావం కలవాళ్లు అయిన- యువతరం లాయర్లు- కంపెనీలుగా ఏర్పడి ప్రతి చిన్న తప్పిదాన్ని, మోసాన్ని కోర్టుకి లాగితే తప్ప ఓ దారి ఏర్పడదు. (ఈ దేశంలో యిది సాధ్యమా? ఏమో. చెప్పలేను. ఈ మధ్య ఓ కథ విన్నాక- సాధ్యం కాదని నిర్ణయం చేసుకున్నాను- ఓ మానవతా వాది సామాజిక స్పృహో అంటూ కప్పెక్కి కూసే ఓ మహానుభావుడు- ఓ భార్య 'అమ్మకం' కేసులో భర్త తరపున వాదించాడట!) ఆశ చావక యీ చెప్పకోడమేగాని- ఈ దేశంలో మోసం కల్తీ పెద్ద వ్యాపారం.... దాని కున్న అండదండలు- సామాన్యులకి వుండవు.

**వేసారపు మాధవయ్య- పుత్తూరు**

మన రాష్ట్రంలో పోస్టు ఉమెన్ ఉద్యోగాలు మహిళలకి ఎందుచేత యివ్వడం లేదు?

*స్టేట్‌లో స్త్రీల మానమర్యాదలకన్నలు విలువలు పోయాయి. అంచేతనై వుండవచ్చు. మా రాష్ట్రంలో మెజారిటీ స్త్రీలే పోస్టు విమెన్. కరెక్టు ఎడ్రసుకి కరెక్టు ఉత్తరాలు పడేస్తున్నారు.

ఆదర్శ వివాహం అంటే అర్థం చెప్పండి.

*ఇద్దరూ ఒకే గమ్యం వైపు చూడకల్గాలి. ఇద్దరికీ ఒకరిపై ఒకరికి గౌరవం, నమ్మకం వుండాలి. ఇద్దరికీ జీవితంపట్ల అవగాహన వుండాలి. అలాంటప్పుడు విభిన్న మనస్తత్వాలు కలవారు పెళ్లి చేసుకున్నా- అదొక ఆదర్శ వివాహంగా నిలబడుతుంది.

తెలుగు లిపి తెలుగుభాష కనుగొన్న వారి పేర్లు చెప్పండి.

*నెక్స్ట్ అనవచ్చు మీరు- నాకిలాంటివి తెలియవు మీరీ విషయాలు ఏ తిరుమల రామచంద్రగారికో, చేరాగారికో రాయాలి. వారు సశాస్త్రీయంగా చెప్పకల్గుతారు.

**టి. శ్రీనివాసరావు, తుని**

మీరు ఆంధ్రపత్రికలో సమాధానాలు యిస్తున్నారు కదా? ఇంకే పత్రిక లోనైనా యిచ్చారా?

*లేదు. నాకు కొన్ని ప్రిన్సిపల్సు వున్నాయి. ఒక వారపత్రికలో ఒక ఫీచరు రాస్తున్నప్పుడు యింకోవార పత్రిక వారు అడిగినా ఫీచరు రాయను. అలాగే దినపత్రికలో రాస్తే యింకో దినపత్రికలో రాయను. మనం ఎంత కాదనుకున్నా పత్రికల మధ్య పోటీ వుంటుంది. మనకి లాయలిటీ వుండాలి.

**కొత్తపల్లి శేషు- ఖమ్మం**

నేటి చిత్ర కారులకు వ్యాపార దృక్పథమే తప్ప మరెటువంటి ఆలోచనా లేదంటాను- మీరే మంటారు?

*నిరక్షరాస్యులను సహితం ఆకర్షించడం ముందు ముఖ్యం. బొమ్మ చూసి 'మైంగి' పోయి ఎవరి చేతేనా మేటర్ చదివించుకుంటారని వ్యాపార నీతి!

కాలమహిమ గూర్చి చెప్పతారా?

*ఏమి చెప్పను? క్షణం జారితే తిరిగిరాదు. గబగబ దాన్ని ఖర్చు చెయ్ అనేవాడు మా పెదమామయ్య. అంతే తెలుసు నాకిదివరకు. ఇప్పుడు కాస్త తెలివి పెరుగుతున్నట్టుంది- కాలానికి తగ్గట్టు- అన్ని రంగాలూ మారడం కాలమహిమ అనుకుంటున్నాను!

అన్నిటికీ జవాబులిస్తారు కాని మీ విద్యార్హత లేమిటో చెప్పటం లేదు. కారణం?

*చదువుకోకపోవడమే- అంటే నమ్మరా?!

గాయకులలో ప్రస్తుతం మీకెవరంటే యిష్టం?

*బాలమురళి, ఎస్. కొన్ని తమిళ పాటలు ఒళ్లు పులకరించేలా పాడేరు. తెలుగులో 'డైలాగు పాటలు పాడి మా వంటివారిని మోసం చేస్తున్నారనిపిస్తుంది నాకు!'

**ఐ.వి.కె. రావు- విశాఖపట్నం**

నేషనలిజమ్-జాతీయతాభావం అంటూ గోలపెట్టేస్తున్నారు వీటికి అర్థం తెలుసా చాలా మందికి?

*తెలిసే వుంటుంది సార్. నాకుమటుకు- ఇదో కుర్రకారు రోగం, మానవజాతికి ఎప్పుడో ఒకప్పుడు వచ్చి తీరే పొంగు అనిపిస్తుంది.

**కె. శ్రీనివాసరావు, ఒంగోలు**

రచయిత్రిగారూ, మనసుని మరిపించే మాటలు, హృదయాన్ని హత్తుకొనే పాటలు రాసే ఆచార్య ఆత్రేయగారిపై మీ అభిప్రాయం.

* పాపం మంచి మనిషి. అందుకే కష్టపడుతూంటారు. మాలాంటి వారికి 'నాటకం' రాస్తాను రాస్తానంటూ బాధ పెడుతుంటారు. ఐ లైక్ హిమ్. ●



# అతి త్వరలో, మీ బిడ్డ అవసరాలు మరియు మీ ఖర్చులు పెరగడం ప్రారంభమవుతుంది.

## అదృష్టవశాత్తూ, యుటిఐ వారి బాలల కానుక వృద్ధి నిధి వుంది.

మీ బిడ్డకి సాధ్యమైన అత్యుత్తమ కానుక యివ్వండి. యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధిలో* కనీసం రూ. 500/- డిపాజిట్ చేయండి.

నిశ్చింతగా వుండండి.

ప్రతి సంవత్సరమూ 12.5% డివిడెండ్ తప్పక లభిస్తుంది. ప్రతి 5 సంవత్సరాలకి ఆకర్షణీయమైన బోనసు డివిడెండ్ కూడా లభిస్తుంది.

మీ బిడ్డకి 21 సంవత్సరాలు వచ్చేసరికి, మీ 'చిన్న' కానుక చెప్పుకోదగినంత మొత్తంగా పెరుగుతుంది.

మీ బిడ్డ పెరుగుతున్న అవసరాలు మరియు మీ పెరుగుతున్న ఖర్చులు తీరడానికి సరిపోయేటట్లు సిద్ధంగా వుంటుంది.

ఇంకా వివరాలకు యుటిఐ కార్యాలయాలలో ఎక్కడయినా కాని, ఏజంట్లని లేక ముఖ్య ప్రతినిధులని లేక స్పెన్సర్ & కంపెనీ లిమిటెడ్ ఏ బ్రాంచినయినా కాని సంప్రదించండి. లేకపోతే ఈ కూపన్‌ని మీ సమీపంలో వున్న యుటిఐ బ్రాంచి ఆఫీసుకి పోస్టు చేయండి.

*గమనిక : CGGF (బాలల కానుక వృద్ధి నిధి)ని 15 సంవత్సరాల లోపున వున్న పిల్లలకి కానుకగా యివ్వవచ్చు. కాలపరిమితి అయిన తర్వాత చెల్లించే మొత్తం మొదట కట్టిన కానుక మొత్తం మరియు స్వీకరించేవారి వయసుని అనుసరించి మారుతూ వుంటుంది.





**UNIT TRUST OF INDIA** H.O. Bombay
(A Public Sector Financial Institution)

**Regional Office:**
45, Second Line Beach, Madras 600 001.
Phone: 587433/580938

**Branch Office:**
29-3-12, Venkateswara Rao Street,
West of Rehman Park, Governorpet,
Vijayawada – 520 002. Phone: 63964

203/204, Moghul Court Complex, Basheer Bagh,
Hyderabad – 500 001. Phone: 240030

**Our Chief Representatives in Andhra Pradesh**

☐ GUNTUR • **K.B. Tilak**, Ph: 24964, 31839 ☐ WEST GODAVARI & KHAMMAM • **Y. Somasundara Rao**, Ph: 2440 (Tanuku) ☐ VIZAG & VIZIANAGARAM • **C. Narayanaswamy**, Ph: 63116 (Vizag) ☐ CUDDAPAH • **A.R. Krishna Reddy**, Ph: 2701 ☐ CHITTOOR • **K.V. Kotiveeraiah**, Ph: 22322 (Tirupati) ☐ EAST GODAVARI • **P. Venkataramana**, Ph: 76047 (Kakinada) ☐ NELLORE • **A. Sathyanarayana**, Ph: 2002 ☐ WARANGAL • **B.S.N. Murthy**, Ph: 8631 (Hanamkonda) ☐ MEDAK • **P.V. Krishna Reddy**, Ph: 2820 (Siddipet) ☐ KARIMNAGAR • **T. Ahalya Srinivas**, Ph: 2674 (Fertilizer City) ☐ ADILABAD • **Sanwal Ram Sah**, Ph: 91 (PP) ☐ SRIKAKULAM • **Visweswara Rao Chabolo**, Ph: 794, 393 (PP) ☐ MEHABUBANAGAR • **N. Venkatanarayana**, 10-87, BR Compound, Jadcherla ☐ KURNOOL • **T. Seetharamaiah Setty**, Ph: 22335 (PP) ☐ PRAKASAM • **M.V. Ramanaiah**, Ph: 3337, 3244 (Ongole) ☐ RANGAREDDY • **S. Veeraraghavalu**, 11-9-485-6-1, Plot-13, Lalitha Nagar, Hyderabad.

Sista's – UTI.1188.89.TE

సీరియల్

# శత్రుసంహారం

లల్లాదేవి

ఇంతవరకూ సాగిన కథ-*16:* వైమానికదళ పైలెట్ రాహుల్ తల్లి, భార్య కారు ప్రమాదంలో మరణిస్తారు. కుమార్తె సుషుమ్న దగ్గరవున్న ఎలక్ట్రానిక్ ఇండికేటర్ వంటి పరికరం వల్లనే సంపత్ మాస్టారి కుటుంబం విచ్ఛిన్నమైందని తెలుసుకున్న రాహుల్ తన కుటుంబ సభ్యుల మరణానికి సంబంధించిన వివరాలను సేకరిస్తుంటాడు. ఈ లోగా కారవెల్లి విమాన ప్రమాదానికి సంబంధించిన క్రూ బాక్స్‌లోని ఇండికేటర్‌ను దొంగిలించిన దుండగుల కోసం ఒకవైపు పోలీసులు దర్యాప్తు జరుపుతుండగా, మరొక వైపు రాహుల్ కుమార్తె సుషుమ్నను అలయన్స్ సంస్థ అధినేత దేవీ ప్రసాద్ ముఠా కిడ్నాప్ చేస్తుంది. ఇండికేటర్ గురించి వివరం చెప్పని సుషుమ్నను దేవీ ప్రసాద్ చంపబోగా పీయూష అడ్డుపడి వేరే ప్లాను చెప్తుంది. గోరీల దొడ్డిలో దాచిన సుషుమ్నను రాహుల్‌కు అప్పగించేందుకు పీయూష నిరాకరిస్తుంది.

(గత సంచిక తరువాయి)

పోలీసులు ముఖం మీద నీళ్ళు చిలకరించారు. కళ్ళు తెరిచాడు చెన్నుడు. ఒళ్ళంతా పచ్చి పుండులా అయిపోయింది. తమని మోసగించి కారులోంచి దించి మరొకరు కారు తీసుకుపోయేలా చేసినందుకు వారు ఇద్దరూ కలిసి అతన్ని బాగా మర్దించారు. ఒళ్ళు హూనం అయింది.

పిడి గుద్దులతో జరిగిన సన్మానానికి తెలివి తప్పిపోయినట్టుగా కళ్ళు మూసుకున్నాడు చెన్నుడు వారు పిడిగుద్దుల దంపుడు కార్యక్రమం ఆపేశారని సురక్షితమయిన చోటుకి తెచ్చారని అర్థమయాక కళ్ళు విప్పి చూచాడు. చుట్టూ పోలీసులు. వెనుక ఆ యిద్దరూ ఉన్నారు.

"కళ్ళు తెరిచాడు భాయ్. తెలివొచ్చింది" అన్నాడు ఓ పి. సి.

"లేచి కూర్చోమనండి. ఏదేదో పెద్ద ముఠా తాలూకు మనిషిలా ఉన్నాడు. మంచి పథకం వేసి కారుని దొంగిలించారు. మర్యాదగా నిజం చెప్పాడా సరే! లేకపోతే ఎలా చెప్పాలో అలా చెప్పించండి" అన్నాడు ఓ హెడ్ కానిస్టేబుల్!

ఆ మాటలు విని గతుక్కుమన్నాడు చెన్నుడు. ఇందాక జరిగింది సివిలియన్ సన్మానం. ఇప్పుడు జరగబోతున్నది పోలీసు ఆచారం. దానికన్నా యిది ఘాటుగా ధాటిగా ఉంటుంది.

అందాకా రానివ్వకూడదు. వస్తే ఒళ్ళు చట్నీ అయిపోతుంది. హెడ్డుగారి మాటలు విని ఇద్దరు పి. సి. లు సిద్ధం అయారు.

"చెప్పరా! ఎవరి ముఠా నువ్వు" ఒక పి. సి. గర్జించాడు.

"నాకేమీ తెలియదు బాబోయ్. ముఠాలు నేనెరుగను" రెండు చేతులు జోడించి వారి వంక జాలి కలిగేలా చూశాడు.

"ఒహో మాటలతో చెప్పడు కాబోలు" అన్నాడు హెడ్డు. అతని నోటి నించి ఆ మాట రావడం పూర్తి కాకుండానే వెన్ను మీద పిడిగుద్దు పడింది. కీచుమంటూ అరిచాడు చెన్నుడు.

"ఈ ముఠాల నా కొడుకులు కత్తులుతో పొడిచినా నిజం చెప్పరు. అది వాళ్ళ ట్రైనింగ్! ఇలాంటి చిన్న దెబ్బలు అసలు శరీరం మీద అంటుకోవు. గట్టిగా తగిలించు" అన్నాడు హెడ్డు.

"పోలీసు బాబులూ నన్నపార్థం చేసుకోకండి బాబులూ! నాకేమీ తెలియదంటే తెలియదు. ముఠాలతో నాకు సంబంధం లేదు"

"నువ్వు 'చాకూ'గాడి ముఠాలో వాడివి అవునా?"

"నువ్వు 'లడ్డూ'గాడి ముఠాలో వాడివి కాదా?"

"కాదురా 'తెంపె' గాడి ముఠా అనుకుంటాను"

"ముఠా ఎవరిదయినా ఘటికుడే! నోరు విప్పుతాడేమో చూడు"

'ఒరే నువ్వు కరీందాదా ముఠాలో వాడివా?"

"బాబ్బాబు! నేను అసలా పేర్లు కూడా ఎప్పుడూ వినలేదు ఖాబూ! నన్ను వొదిలెయ్యండి పోలీసుబాబులూ!" అంటూ రెండు చేతులూ జోడించి ప్రార్థించాడు చెన్నుడు.

"వొదిలేస్తాంలే! ముందు ముఠా పేరు చెప్పు" గర్జించాడు హెడ్డు.

"ముఠా అంటూ ఏదీ లేదు. నన్ను నమ్మండి".

"నిన్ను కాకపోతే ఈ దేశంలో యింకెవర్ని నమ్మాలి. కారు దొంగిలించిన ఘనుడివి కదా! పోనీ ఆ రెండో మనిషి ఎవరో చెప్పు" హెడ్ కానిస్టేబుల్ లాఠీతో పొడిచేందుకు అతని గుండెల మీదికి గురిపెట్టాడు. దాంతో హడలిపోయాడు చెన్నుడు.

నగరంలో నానా అల్లరి జరిగి ఉంది. ఎన్నో ఘోరమైన నేరాలు జరిగాయి. అడ్రసే తెలియని మనుషులు కొందరు లూటీలు సాగించి దోపిడీలు సాగించి లక్షాధికారులుగా మారారు.

ప్రజ, ప్రభుత్వం పోలీసుల సామర్థ్యాన్ని శంకిస్తోంది.

ఈ స్థితిలో దొరికిన అతని మీద కసి అంతా తీర్చుకునేందుకు డిపార్ట్‌మెంట్ మనుషులందరూ సంసిద్ధం అవుతున్నారు. అతను చాల పెద్ద వూబిలోకి దిగిపోయే లక్షణాలు, దింపివేయబడే లక్షణాలు కన్పించటంతో హడలిపోతున్నాడు.

"నాతో వచ్చిన మనిషి నా మిత్రుడే! చాలా పెద్దమనిషి" అన్నాడు.

హమ్మయ్య చెప్పడం ప్రారంభించాడు అన్నట్టుగా వారు ముఖాలు చూచుకున్నారు. సంతోష రేఖలు కన్పిస్తున్నాయి.

"మీరిద్దరూ పెద్దమనుషులే అని అర్థమయింది కదా! పెద్దమనుషులు కాకపోతే కారు ఎందుకు దొంగిలిస్తారు. ఇంతకూ అతను ఎవరు? పేరేమిటి? వివరాలేమిటి? ఇప్పుడతను కారు తీసుకుని ఎక్కడకు పారిపోయాడు?" హెడ్డు మళ్ళీ లాఠీ

గురిపెట్టాడు.

చెన్నుడు మెదడులో ఒక మెరుపులాంటి ఆలోచన మెరిసింది. కళ్ళు తళ తళలాడాయి. ముఖం వికసించింది.

"ఒక పెద్ద దొంగల ముఠాని పట్టుకునేందుకు పోయాడు" అన్నాడు.

"మళ్ళా యిదో నాటకం ప్రారంభించావా?"

"నాటకం కాదు హెడ్డుగారూ! నిజం మీ మీద ఒట్టు" అన్నాడు చెన్నుడు.

"అసలు నువ్వెవరో చెప్పు ముందు. నీ పేరేమిటి? ఏం చేస్తుంటావు?"

"నా పేరు చెన్నకేశవులు. స్కైలైన్ ఎదురుగా ఓ పాన్‌షాపు".

"మరి ఈ ముఠాలతో ఎందుకు తిరుగుతున్నావు? అవకాశం వున్నవాడివి గౌరవంగా వ్యాపారం చేసుకోవచ్చు కదా!'

"నాకు ఏ ముఠాలతో సంబంధంలేదు హెడ్డుగారూ!"

"మరి నీతో వచ్చిన వ్యక్తి ఎవరు? ఎక్కడుంటాడు" అని ప్రశ్నించాడు హెడ్ కానిస్టేబుల్ అవకాశం దొరగ్గానే లేచి కూర్చున్నాడు చెన్ను! కాలర్ సవరించుకున్నాడు. గొంతు సవరించుకున్నాడు.

"హెడ్‌గారూ! ఆయన మామూలు మనిషి కాదండీ!"

"మామూలు మనిషి కాదా? మరి దయ్యమా? భూతమా?"

"ఐ. ఎ. ఎఫ్. లో వింగ్ కమాండర్"

"ఓ అలాగా! అయితే ఇలాంటి పని ఎందుకు చేశారు?" హెడ్ కానిస్టేబిల్ ఫోర్స్ తగ్గించి అడిగాడు. తన మాటలకు అలాంటి రెస్పాన్స్ కన్పించగానే రెచ్చిపోయి చెప్పటం ప్రారంభించాడు చెన్ను.

"ఆయన ఫాదర్ మహేష్‌చంద్ర ఆర్టిలరీ ఫ్రొంటియర్. మహావీరచక్ర అవార్డు పొందినవారు" అన్నాడు ఉత్సాహవంతంగా.

మహావీరచక్ర పేరు వింటూనే పి. సి. లు అందరూ స్టిఫ్‌గా అయిపోయి సెల్యూట్ కొట్టారు. హెడ్ కానిస్టేబుల్ గుండెలు దిగజారాయి.

"సారీ గురూగారు! లేచి కుర్చీలో కూర్చోండి"





అన్నాడు. చెన్ను ముఖంలోకి తీవి దర్పా వచ్చేశాయి. కుర్చీలో కూర్చుని కాలు మీద కాలు వేసుకున్నాడు. ఒక పి.సి పరుగునపోయి కూలర్ వాటర్ తెచ్చి అందించాడు. అది చూచి కారు పోగొట్టుకున్న యిద్దరూ దిగాలు పడిపోయారు.

"ఆయన నాన్నగారో తాతగారో మహావీరచక్ర అయితే మాకేంటి? మా కారు మాకు యిమ్మనండి" అందులో ఒకవ్యక్తి.

"మీ కారు ఎక్కడికి పోదు. తిరిగి వస్తుంది క్షేమంగా. భయపడకండి" అంటూ విష్ణుమూర్తిలా అభయ హస్తం చూపించాడు చెన్ను. మరొక పి. సి. వెళ్ళి కూల్‌డ్రింక్ తెచ్చి అందించాడు. మీరు సిగరెట్ కాలుస్తారా అంటూ పెట్టి అందించాడు హెడ్డు. ఏదీ కాదనకుండా మర్యాదలన్నీ జరిపించుకుంటున్నాడు చెన్నకేశవులు.

"మహావీరచక్ర అవార్డు అంటే మిలిటరీ కమాండర్లే కాదు, మా డిపార్టుమెంటు డిజి గారు కూడ సెల్యూట్ ఇస్తారు కదా? అంత గొప్పాయన కొడుకు ఈ దొంగతనం ఎందుకు చేశారు?" అని అడిగాడు హెడ్డు.

"అది దొంగతనం కాదు సార్ అవుసరం. విమానాలు నడిపే పైలట్‌కి ఓ కారు దొంగిలించే అవుసరం ఉంటుందంటారా?"

"ఉండదు. ఉండదు" పి. సిలతో సహా అందరు కోరస్ పాడుతున్నారు.

"ఆయన పాపని దొంగిలించిన వాళ్ళు కారులో పారిపోతున్నారు. వాళ్ళని వెన్నాడేందుకు ఆటోలు లేవు. టాక్సీలు లేవు. ఏం చెయ్యాలి? అందుకే తప్పు చెయ్యాల్సి వచ్చింది" అంటూ వివరించాడు చెన్ను. కారు పోగొట్టుకున్న వాళ్ళతో సహా అందరూ సమాధాన పడ్డారు.

"అయన ఎంత సేపటికి వస్తారు?" కారు పోగొట్టుకున్నాయన అడిగాడు.

"అసలా విషయం చెప్తే మేమే యిచ్చి పంపేవాళ్ళం" అన్నాడు రెండో వ్యక్తి.

"ఆయన ఆపదలో చిక్కుకుంటారేమో!" ఒక పి. సి. సందేహం.

"మీ రిచ్చిన స్టేట్‌మెంటుని రిపోర్టుగా తీసుకుని అయనకు సాయంగా మేము వెడతాం" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

"ఆ ముఠా చాల పెద్దది. చాల భయంకరమయింది. వారిని ఎదిరించేందుకు ఈ కొద్దిపాటి బలగం చాలదనుకుంటాను" అన్నాడు చెన్ను.

"పెద్ద ముఠా అంటే ఎవరు?"

"అదే ఇంకా తెలియలేదు".

"పోనీ అయన వెళ్ళింది ఎక్కడికో చెప్పండి. మేం తెలుసుకుంటాం".

"తారనాక గోరీల దగ్గరకు". ఈ సమాధానం విని హెడ్డు కాసేపు ఆలోచించాడు. తమతో సంబంధం [illegible] వేరే పని మీద తిరుగుతు[illegible] పిలిచాడు.

"తారనాక ఏరియా ఎవరిది భాయ్?"

"ఆ గొడవ మీకెందుకు? ఆ ఏరియా యిబ్రహీం దాదా స్వంతం" ఆ పేరు వింటూనే శ్రోతలు గడగడలాడారు.

"మీరు చెప్పింది నిజమే! అక్కడకు పోవాలంటే మాకున్న బలగం చాలదు" అంటూ కంట్రోల్ రూంకి ఫోన్ చేశాడు హెడ్డు! విషయం పైకి వెళ్ళింది.

"ఒక మహావీర చక్రకి వారసుడు, స్వయంగా ఐ.ఎ.ఎఫ్. లో ఫ్లెయిట్ లెఫ్టినెంట్ భయంకరమయిన ముఠానే ఛేజ్ చేస్తూ వెళ్ళాడంటే అది అసాధారణ విషయంగా తీసుకున్నారు.

కమిషనర్ స్వయంగా వచ్చేశారు క్షణాల్లో! చెన్నుడుతో మాట్లాడి ఏరియా వివరాలు వ్రాయించారు.

ఆ లొకేషన్‌కి పోలీసువారి నగర దళాలు పోవటంకన్నా స్పెషల్ దళాలు పోవటం మంచిది అని అప్పటి కప్పుడు నిర్ణయించారు. చాల పెద్ద గాంగుకి సంబంధించిన రైడింగ్! ఏ క్లాస్ ఆర్మ్ ఫోర్స్‌ని కూడ వెంటపెట్టుకున్నారు. స్క్వాడ్స్ వ్యాన్‌లలో



కదిలాయి. చూస్తుండగానే వామనుడు త్రివిక్రముడు అయిన విధంగా సమస్యపెరిగి పోవటం చూచారు కారు పోగొట్టుకున్న వ్యక్తులు! కారు దొంగిలించబడలేదని అవసరార్థం తీసుకోబడిందని వారికి పూర్తిగా విశ్వాసం కుదిరింది.

ఇంత పెద్ద రైడింగ్ జరిగితే ఫలితం ఎలా ఉంటుందో చూడాలన్న ఉబలాటంతో చెన్నుడితోపాటు వారు కూడ బయలు దేరారు. ముందుగాతయారు చేసుకున్న మాప్‌ని అనుసరించి స్పెషల్ పోలీసు దళాలు నాలుగు విభాగాలుగా చీలిపోయాయి.

ఒకే సమయానికి నాలుగు దిక్కులనించి గోరీల దొడ్డిని, మసీదుని ఆక్రమించి చుట్టు ముట్టారు. అసాధారణమయిన పద్ధతిలో ఇంత భారీ ఎత్తున దాడి జరుగుతుందని ఆ ప్రాంతవాసులు ఎవరూ ఊహించలేదు. అన్ని సైరన్లు విన్పించగానే బెంబేలు పడిపోయారు.

దాదాలు రహస్యంగా రెడ్ అలర్ట్ సిగ్నల్స్ అందించుకున్నారు. కాని అప్పటికే సమయం చాల మించిపోయింది. గోరీల దొడ్డికి అల్లంత దూరంలో ఉన్న కారుని యజమానులు గుర్తించారు,

దాంతో కమిషనర్‌కి నమ్మకం చిక్కింది. అయన తన వీరుల్ని మంచి వ్యూహంలో నడిపించారు. డిపార్టుమెంటు అంతటికి కడుపు రగిలి కన్నీరు తెప్పించిన సంఘటన ఎ. ఎస్. పి. కారంత్ హత్య!

దాన్ని దాచుకునేందుకు నగరాన్ని విధ్వంసంపాలు చేశారు. ప్రజల కన్నీళ్ళతో కడుపు నింపుకున్నారు సైతానులు!

దీనికంతటికి ప్రతీకారం తీర్చుకునే సమయం అసన్నమయింది. ఇది మంచి అవకాశంగాకూడ అయనకు అన్పించింది. దాంతో విజృంభించారు. ఆ ముఠాకి చెందిన ఏ ఒక్కరు దొరికినా అదొక విజయమే!

ప్రజలలో తిరిగి ఆత్మవిశ్వాసం నెలకొనేలా చేయటానికి ఇది తాను జరుపుతున్న తుది సమరం!!

ఆ సమయంలో పీయూష గురించి ఆలోచిస్తూ కూర్చుని ఉన్నాడు రాహుల్! అప్పటికే లాఠీ కర్రల ఝుళిపింపులు విన్పిస్తున్నాయి. దొడ్డిలో ఓ మూల గదిలో కట్టిన సమాధినించి ప్రాణ భయంతో పరుగున వచ్చింది పీయూష!

మసీదుని దళాలు చుట్టు ముడుతున్నాయి. నాలుగు ప్రక్కల దారులు మూసివేయించాడు కమిషనర్! ఒక వ్యూహంతో నడుపుతున్నాడు. పీయూష వెనుక

"ఆంటీ! ఆంటీ!" అని అరుస్తూ అనుసరిస్తోంది బేబి!

రాహుల్ ముందుకి పరుగు తీశాడు. బేబిని బాహువుల్లోకి తీసుకున్నాడు. గుండెలకు హత్తుకున్నాడు. కన్నీరు ధారగా కారుతోంది.

## ఎన్నికల్లో రాజ్ బబ్బర్

సూపర్ హీరోగా అమితాబ్ రోజులు పోయాయనీ, ఈ సమయం లోనే తన ప్రతిష్టను యినుమడింపచేసుకోవాలని కలలుకంటున్నాడట రాజ్ బబ్బర్.

'అంధాయుద్ధ్' తర్వాత అశోక్ త్యాగి తీస్తున్న 'అంధేర్ గర్ది'లో ఉగ్రనరసింహం పాత్రను ధరిస్తున్నాడు. ప్రివ్యూ చూసిన వాళ్లు అచ్చు అమితాబ్ లాగే డైలాగ్స్ చెప్పావని అనటంతో యింకేముంది తాను బచ్చన్ స్థానాన్ని ఆక్రమించేసానన్న ఆనందాన్ని పొందుతున్నాడట. ఈ చిత్రంలో కిమికట్కార్, శక్తికపూర్‌లు కూడా వున్నారట. నటనలోనే అనుకరించటం కాకుండా బచ్చన్ అడుగుజాడల్లో నడవాలనుకున్నాడు కాబోలు వచ్చే ఎన్నికల్లో 'ఆగ్రా' నుంచి పోటీచేయాలని కూడా ప్లానేస్తున్నాడట. ఎన్నికలు వస్తున్నందున తాను నటించిన 'అంధేర్ గర్ది' యిప్పుడు విడుదల చేయటం మంచిదికాదని సలహాయిస్తున్నారట పెద్దలు. మరి ఏంచేస్తారో ?

"బేబి! నీకు భయంగాఉందా అమ్మా!" అన్నాడు చుట్టూ చూస్తూ.

"లేదుపా! మీరు వచ్చేశారుకదా! నాకు భయం లేదు."

"నీకేమయినా దెబ్బలు తగిలాయా బేబి?" ఒళ్ళంతా తడిమి చూచాడు.

"లేదు పపా! ఆంటి చాల మంచివారు. నన్ను కొట్టలేదు."

వారి ప్రేమ బంధాన్ని తనవితీరా చూస్తోంది పీయూష? అన్న రోహిత్‌ని చంపివేశారన్న ద్వేషంతో పగ తీర్చుకునేందుకు వారితోనే చేతులు కలిపిందామె. జీవితం డిజర్బెడ్‌గా అయింది.

ప్రేమ, ఆప్యాయత, అనురాగం అనే తీయని భావాలకు దూరంగానే ఉండిపోతూ వచ్చింది. ఇప్పుడీ మమతా బంధాలకు నిర్వచనంలాంటి దృశ్యం కన్నులబడటంతో హృదయం ద్రవించింది.

కన్నీరు చారికలు కట్టినాయి చెంపలమీద. పయ్యెదతో చెంపలు ఒత్తుకుని అలా చూస్తూ నిలిచిపోయింది.

రాహుల్ తలఎత్తి ఆమెను చూచాడు. ఆమె మనఃస్థితి ఏమిటో గమనించాడు. ఆఖరుక్షణంలో అయినా అనివార్య పరిస్థితులలో అయినా తన బిడ్డను తనకు అప్పగించిన వ్యక్తి ఆమె.

ఆ రాత్రి నర్సులను కాపాడేందుకు సాయం చేసింది.

కృతజ్ఞతాభావంతో ఆమెను చూచాడు.

సరిగ్గా ఆ సమయంలో కమీషనర్ కొందరు వ్యక్తులను వెంట పెట్టుకుని ఆ గోరీ దొడ్డిలోకి ప్రవేశించాడు. కమీషనర్ స్వయంగా నరసింహ మూర్తిలా అయాడు. ఒక చేతిలో లాఠీ! మరో చేతిలో రివాల్వర్.

చాల వేగంగా వారి వైపు దూసుకు వచ్చాడు.

రివాల్వర్‌ని పీయూష వైపు గురి పెట్టి స్థిరంగా నిలబడి పోయాడు. మిగిలిన స్పెషల్ బెటాలియన్ పోలీసు జవానులు గోరీల దొడ్డి నాలుగు మూలలకు పరుచుకుపోయి గాలిస్తున్నారు.

"డోంట్‌మూవ్! కదలకు. రెప్పవాల్చినా కాల్చేస్తాను. ఖబడ్దార్!

ఎవరు నువ్వు? ఇక్కడెందుకున్నావ్?" పీయూషని ఉద్దేశించి పెను రంకె వేసినట్టుగా ప్రశ్నించాడు కమీషనర్.

ఆమె నిలువెల్లా వొణికిపోతోంది.

"చెప్పు! కమాన్ స్పీకవుట్?" ఉగ్ర నరసింహ మూర్తిలా గర్జించాడు.

ఒక డిపార్టుమెంట్ అధికారిని దుండగులు వధిస్తే ఆ డిపార్టుమెంటువారికి ఎంతగా కడుపు రగులుతుందో ఆయనను అప్పుడు చూస్తే తెలుస్తుంది.

వారి మనసులో ఎన్ని సముద్రాలు ఘూర్ణిల్లుతాయో, ఎన్నెన్ని అగ్ని పర్వతాలు బ్రద్దలవుతాయో ఆయన కన్నుల్లో కన్పిస్తోంది.

మరుక్షణంలో ట్రిగ్గర్ నొక్కేందుకు సిద్ధంగా వున్నాడు. పీయూష నోరు పెగిల్చి మాటాడలేని స్థితిలో ఉంది.

"సర్! ఈమె మా సంపత్‌మాస్టారి డాటర్! మా గురువు గారమ్మాయి" మధ్యలో కల్పించుకుని చెప్పాడు రాహుల్.

ఆ మాటలు విని రివాల్వర్ దింపేశారు కమీషనర్. కాని ఆ ఉగ్రరూపం ఇంకా రవంతయినా సడలిపోలేదు.

"అయితే మీరందరూ వెళ్ళి కారులో కూర్చోండి"

"సర్ నేను కూడా మీతో ఫాలో అవుతాను."

"డోంతాక్ ఐసే! వాళ్ళు ఎంత దుర్మార్గులో మీకు తెలియదు. పెద్ద వార్ జరగబోతూంది. మా ఆఫీసర్‌ని చంపించిన ఆ బాస్టర్డ్ యిబ్రహీంని వదలిపెట్టను. నేను చెప్పినట్టు చేయండి.

వెళ్ళి కారులో కూర్చోండి. దూయాజ్ ఐసే!" సింహంలా గర్జించి సమాధానం కోసం చూడకుండా తన పటాలంతో ముందుకు సాగిపోతున్నాడు కమీషనర్.

సమాధుల చివర మసీదు దగ్గరలో ఒక డాబాలాంటి యిల్లు! దాని ముందు తెల్లని

నెలవంకతో పచ్చని జెండా ఉంది. చెమ్కి అంచులు మెరుస్తున్నాయి.

"మన డిపార్ట్‌మెంట్ అధికారి ఎ. ఎస్. పి.ని చంపినవారే ఈ పాపని దొంగిలించారు. ఆ దుర్మార్గులు ఈ ప్రాంతాల్లో ఉన్నారు. ఈ యింటిలో ఎవరయినా ఉండవచ్చు. వెనుక ముందు చూడకండి.

మన డిపార్ట్‌మెంట్‌కి తూటాకులు కట్టాలని ప్రయత్నించిన ఈ దుర్మార్గుల్ని పట్టిపల్లార్చండి. మీరంతా ప్రజలకు మిత్రులు అని నిరూపించుకోండి. పౌరుషం చూపించండి.

కమాన్ బాయిస్! ఛార్జ్! ఛార్జ్!!" అంటూ సింహనాదం చేశారు కమీషనర్! పటాలం సముద్ర కెరటంలా విరుచుకుపడింది.

గోలీలదొడ్డి ఘోర రణరంగంగా మారిపోయింది. మరణవేదనలు ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనించినాయి. మనుషులు పాపం పండిన పండుల్లా నేలకురాలి పడుతున్నారు. కొందర్ని స్వాధీనం చేసుకున్నారు.

కమీషనర్ నేరుగా వెళ్ళి మసీదును చుట్టివచ్చాడు పటాలంతో! అక్కడ ఉండవలసిన వారంతా అదృశ్యమయ్యారు.

పరిసరాలలో నివాసముంటున్న కుటుంబీకులు ఒకవంక భయం కలుగుతున్నా - మరోవంక ఆనందంతో ఉన్నారు. ఆ ఏరియాలో కొనసాగుతున్న పిశాచనర్తనం ఇకమీదటయినా ఆగిపోగలదని ఆశిస్తున్నారు. మసీదుకి దొడ్డికీ మధ్యలో ఉన్న యింటిలో ఎవరున్నారో కమీషనర్‌కి అర్థం కాలేదు.

ఇంటిని పటాలంతో చుట్టుముట్టాడు.

కాని తలుపులు అన్నీ లోపలవైపు బిగించి ఉన్నాయి. ఒక చేతిలో లాఠీని మరో చేతిలో రివాల్వర్‌ని సిద్ధంగా పట్టుకుని తలుపులు తట్టాడు. లోపల కాస్సేపు మాటలు విన్పించాయి.

ఆ తరువాత నెమ్మదిగా తలుపులు తెరచుకున్నాయి. సాంప్రదాయకమయిన దుస్తులు ధరించిన వ్యక్తి కన్పించాడు. అతనికి మీసాలులేవు కాని క్రమమయిన ఆకారంలో గడ్డం పెరిగిపోయి వుంది.

ముందు రెండు పళ్ళు ఊడిపోయినాయి. తలమీద టోపి వుంది.

"ఏమిటిసాబ్? ఏమైనా జరిగిందా? ఏమిటా జులుం?" చాల ప్రశాంతమయిన కంఠస్వరంతో అడిగాడు.

"చాలానే జరిగింది. అంతా చెప్తాను. ఎవరున్నారు యింటిలో?" కమీషనర్ తనే స్వయంగా ముందుగా లోపల కాలుపెడుతూ అడిగాడు.

"ఎవరూ లేరు. నేను ఒంటరిగానే ఉన్నాను"

"ఏం చేస్తారు మీరు?"

"ఈ మసజిత్‌లో ముల్లాసాహబ్‌ని*"

"ఓ అలాగా! సలామ్– ఆ–లేకుం"

"వాలేకుం సలామ్. కూర్చుంటారా?"

"ఈ ఇంటిలో ఇంకా ఎవరున్నారో వివరాలు కావాలి నాకు"

"ఎవరూ లేరంటున్నాను కదా? నా మాటలు నమ్మలేరా?"

"నమ్ముతాను" అంటూ ప్రక్కనున్న డోర్ కర్టెన్ అవతలి కదలికల్ని గమనించాడు కమీషనర్.

"మీరు ఒక్కరే ఉన్నారు అంటున్నారు. లోపల ఎవరో ఉన్నారు కదా!"

"వాళ్ళందరూ ఆడవాళ్ళు సాహబ్"

డోర్ కర్టెన్ తొలగించి చూచేందుకు చేయివేసి మళ్ళా వెనక్కి తీసేసుకున్నాడు కమీషనర్.

"ఎందరున్నారు?" అని ప్రశ్నించాడు కఠినంగా!

"నలుగురున్నారు. మీరు చూడనక్కరలేదు. నమ్మాలి."

"నమ్ముతాను. ఎవరు వాళ్ళు మీ భార్యలా?"

"కాదు. నా సోదరుని భార్యలు వాళ్ళంతా"

"మీ సోదరుడు ఎక్కడున్నాడు. ఒకసారి చూడాలి"

"చూడలేరు సాహబ్! అతను అల్లా కొలువులో ఉన్నాడు. చనిపోయి సంవత్సరం దాటిపోయింది. కాన్సర్‌తో పోయాడు."

"ఓ అలాగా! ఒకసారి వారిని ప్రశ్నించాలనుకుంటున్నాను"

"మీరు అడగండి. నేను సమాధానాలు తెలుసుకుని వస్తాను"

"ఒకసారి నేను వారిని చూచేందుకు వీలు

## అంతరిక్షంలో జంతు ప్రదర్శనశాల

సెప్టెంబరు నెల 8వ తేదిన తొమ్మిదవ సోవియట్ జీవయుక్త ఉపగ్రహం 14 రోజుల అంతరిక్ష యానానికై ప్రయోగించబడింది. గతంలో జరిగిన యిట్టి ప్రయోగాలలో 6 కోతులు, 202 ఎలుకలు, తాబేళ్ళు, చేపలు, పక్షిగుడ్లు, పురుగులు, మొక్కలు, విత్తనాలు అనేకం ఉండినాయి. శూన్య గురుత్వాకర్షణ, అంతరిక్ష యానానంతర పరిస్థితుల ఎడ యీ జీవుల ప్రతిస్పందనపై జరిపిన అధ్యయనాలు అనేక కీలకమైన నిర్ధారణలకు దారితీశాయి. వారసత్వ లక్షణాల సంక్రమణంతోబాటు, జీవకణాలకు సంబంధించిన వివిధ ప్రక్రియలకు శూన్యగురుత్వాకర్షణవల్ల ప్రత్యక్షనష్టం. వాటిల్లదని, యీ ప్రయోగాలవల్ల తేలింది. జంతుకణ సముదాయాలలో తిరుగులేని, వ్యాధికారక మార్పులు పుట్టవని రుజువయింది. దీర్ఘకాల అంతరిక్షయాత్రలకై మనుషులను పంపడంలో యీ నిర్ధారణ ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది.

సెప్టెంబరు 8వ పంపిన ఉపగ్రహంలో ఇందుకు ముందు ప్రయోగించిన ఏ ఒక్క ఉపగ్రహంలోకన్నా ఎక్కువ జీవులు, పరిశోధనా పరికరాలున్నాయి. ఈ ప్రయోగంలో హంగరీ, జి.డి.ఆర్., పోలెండ్, కెనడా, సోవియట్ యూనియన్, అమెరికా, ఫ్రాన్సు, జెకోస్లొవేకియా, యూరప్ అంతరిక్ష పరిశోధనా సంస్థలు పాలుపంచుకున్నాయి. ఈ ఉపగ్రహంలో రెండున్నరేళ్ల వయస్సుగల రెండు కోతులున్నాయి. చలితవ్యాధి ప్రక్రియ, శూన్య గురుత్వాకర్షణ స్థితిలో పని చేయుగల శక్తి, వగైరాలపై నాడీమండల అధ్యయన ప్రక్రియల ద్వారా పరిశోధన జరుపుతారు.

అంతరిక్షంలో పరిభ్రమిస్తున్నప్పుడు అనివార్యంగా తగ్గిపోయే ఎముకల బలాన్ని గురించి ఎలుకలపై ప్రయోగాలు జరుపుతారు. గురుత్వాకర్షణకు అలవాటుపడే క్రమంలో తొలివారంలోను, మలివారంలోను ఎలుకలలో వ్యక్తమయ్యే శరీర ధర్మ సంబంధమైన ప్రక్రియలను నమోదుచేస్తారు. న్యూరో ఎండోక్రిన్ రెగ్యులేటరీ వ్యవస్థపైన, స్వయంచలనం, గుండె-రక్తనాళ వ్యవస్థ, అన్నవాహికలపై అంతరిక్ష భ్రమణం కలిగించే ప్రభావాలను గురించి జీవశాస్త్రవేత్తలు, వైద్యులు అధ్యయం చేస్తారు.

సౌరమండలంలో మానవ విహార అవకాశాలు నానాట పెరుగుతున్న దృష్ట్యా కాస్మిక్ రేడియేషన్ నుండి అంతరిక్ష యాత్రికులకు రక్షణ కల్పించే పద్ధతులను గురించి శాస్త్రవేత్తలు తీవ్రంగా అధ్యయం చేస్తున్నారు. నక్షత్రమండలం నుండి ఉద్భవించే భారయుతకణాలు జీవరాసులపై- ముఖ్యంగా మొక్కలు, పెరిగే కణాలపై కలిగించే ప్రభావాన్ని, అందలి విశిష్ట అంశాలను యీ ఉపగ్రహ ప్రయోగం ప్రత్యేకించి అధ్యయనం చేస్తుంది.

పడదంటారా?''

"మీకు తెలియనిదేముంది. ఘోషా స్త్రీలు. గౌరవించాలి. పోనీ ఒక పని చేయండి. మీరు తెర యివతల ఉండి అడగండి. వారు తెరఅవతల ఉండి సమాధానాలు చెప్తారు.''

"మీరు చెప్పినట్టే చేస్తాను" కర్టెన్ దగ్గరకు పోయాడు.

"కమీషనర్ ఏదో అడగాలనుకుంటున్నారు. సమాధానాలు చెప్పండి" లోపలి వైపుకి తిరిగి మాటలు అందించాడు.

"అలాగే' అంటూ తీయని కంఠస్వరం విన్పించింది.

"మీరు నలుగురు కాక లోపల ఎవరయినా ఉన్నారా మేడమ్."

"అల్లా దయవల్ల మేం నలుగురం ఉన్నాం. మరెవ్వరూ లేరు" మొదటిసారి విన్న కంఠ మాధుర్యంలో కొద్దిపాటి మార్పు కన్పించింది.

కమిషనర్‌కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

"ముల్లాసాహబ్! మీరు ఒకసారి బయటకు వెళ్లి మా డి.ఎస్. పి.ని పిలిచిరండి" అన్నాడు కమిషనర్. ముల్లా వాకిలి దగ్గరకు వచ్చి డి.ఎస్.పి.ని చేయి ఊపి పిలిచాడు.

అతని దృష్టి మరలిపోగానే ఆ క్షణాన్ని వృధా పోనివ్వలేదు కమిషనర్. తన దగ్గిర దాచి ఉంచిన స్మోక్ షెల్‌ని చిన్న గోలికాయ ఆకారంలో ఉన్నదాన్ని పళ్ళతో ఓపెన్ చేసి కర్టెన్ క్రిందుగా గది లోపలకు దొర్లించాడు.

"లోపల ఎవరయినా ఉంటే చెప్పటం మీ బాధ్యత.''

"ఆ విషయం మాకు తెలు... తెలు...'' స్మోక్ అవతలి కంఠస్వరానికి అడ్డు పడింది. మాట పూర్తి చేసేందుకు వీలు కాకుండా దగ్గు ప్రారంభ మయింది. ఎంత అదుపు చేసినా ఆగకుండా ఖ ఖేల్లుమని దగ్గటం విన్పించింది.

మిమిక్రీ చేస్తున్న మగ కంఠస్వరం పూర్తిగా బయట పడింది. ఆ వెనుక నాలుగు కాదు అనేక మగ కంఠస్వరాలు విన్పించాయి. కర్టెన్‌ని పర్రున పట్టి లాగేశాడు కమీషనర్.

"కమాన్ బాయిస్! ఛార్జ్... ఛార్జ్! క్యాచ్ అలాఫ్ ఎంపైర్ ఇఫ్ ఇట్ ఈజ్ వాంటెడ్" అంటూ ముందు తనే లోపలకు లంఘించాడు. ఆ వెనుక అయిదారు చీకటి గదులున్నాయి.

లాఠీ దెబ్బల మ్రోతలు... ఢెళ్... ఢెళ్... మంటూ బులెట్స్ రిలీజ్ అవుతున్న శబ్దాలు, అరుపులు, ఆర్తనాదాలు! ఆ యిల్లు కొద్ది నిముషాలు కురుక్షేత్రంగా మారిపోయింది.

శత్రువులు నాటు రకం ఆయుధాలు ప్రయో గించారు. అవమాన భారంతో కడుపు మంటతో విజృంభించారు పోలీసు దళంవారు.

కమిషనర్ వీర విక్రమ నరసింహమే అయాడు. అయిదు నిముషాల అనంతరం దాదాల మూలు గులు తప్ప ఏమీ విన్పించలేదు.

వారిని బహిరంగ ప్రదేశానికి యీడ్చుకు వస్తున్న పోలీసు పటాలాల బూట్లు కర కరలు కూడ విన్పించాయి.

ఈ సందడిలో ఆ యింటి సరిహద్దులు దాటిపోతున్న ముల్లాని వెంటపడి అనుసరించాడు కమీషనర్. అది తెలియని అతను మసీదు లోపలకుపోయి కొన్ని బ్యాగ్‌లు తీసుకుని తిరిగి వచ్చాడు.

"కర్ఫ్యూ విధించిన కాళరాత్రి దోచుకున్న సొమ్ము యిది. దీన్ని మా బాయిస్‌కి అప్పగించి లొంగిపో!" రివాల్వర్ గురిపెట్టి తీవ్రంగా హెచ్చరించాడు కమిషనర్.

అతను లొంగిపోయాడు.

"ఇదేమిటి?" ఒక నల్లని సంచి చూపుతూ అరిచాడు కమిషనర్.

"షివాల్యంలో దొంగిలించిన నగలు" చివరి క్షణంలో వాస్తవం చెప్పి తలను వంచుకున్నాడు ముల్లాసాహబ్.

(ఇంకా ఉంది)

నరి "కొత్త" శీర్షిక

# హలో! డాక్టర్ నేనేం చెయ్యాలి?

డా. కొత్త రవీంద్రబాబు

సుప్రసిద్ధ రచయిత, వైద్యనిపుణులు డా. కొత్త రవీంద్రబాబు ఎం.బి.బి.ఎస్., పాఠకుల భౌతిక, మానసిక, సెక్సు సమస్యలకు, సందేహాలకు సమాధానాలు ఆంధ్రసచిత్రవార పత్రిక ద్వారా యిస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాం. మీ ప్రశ్నలు సూటిగా, సంక్షిప్తంగా, నిస్సంకోచంగా యిన్‌లాండ్ కవర్ లేదా కార్డుమీద రాసి పూర్తి పేరు, చిరునామాతో-

"హలో! డాక్టర్! నేనేం చెయ్యాలి" శీర్షిక
ఆంధ్రసచిత్రవార పత్రిక
గాంధీనగర్, విజయవాడ-3
చిరునామాకి పంపాలి.

అవసరమైనచోట మీ పేరుకి బదులు డాక్టర్‌గారే పొడి అక్షరాలు వాడ తారు (కొంచెం "యిదైన" డెలికేట్ సమస్యలయితే) అంతేకాని మీరు మాత్రం పూర్తి పేరు, చిరునామా రాసి తీరాలి.

ఎడిటర్‌దే తుది నిర్ణయం

- ఎడిటర్

# వేట

పి. చంద్రశేఖర అజాద్

"నువ్వెప్పుడైనా కుందేలు మాంసం తిన్నావా?" అడిగాడు రాజు.

"ఒక్కసారి మాత్రం తిన్నాను. అది కూడా ముందు తెలిసికాదు. తిన్నాక చెప్పారు." అన్నాడు మధు.

"బహుశా అది పెంపుడు కుందేలయి ఉంటుంది."

"అవును. అదే."

"అడవి కుందేళ్ళు బావుంటాయి."

"నిజమేననుకో. అవి మనకెలా దొరుకుతాయి?"

"వేటకెళ్తే."

"వేటా? వద్దులే బాబు. కుందేలు లేకపోతే అదే పోయింది! వాటి కోసం అడవుల్లోకి ఎవడుపోతాడు."

"మాంసం కోసం నేను చెప్పటంలేదు. వేటలో థ్రిల్ ఉంది. మా చిన్నప్పుడు మా ఊరి జమీందారు గురించి చెబుతుండేవారు. ఆయనెప్పుడూ చిరుతపులినో, సింహంగుల్నో తప్పితే చిన్నవాటిని ముట్టుకోడు. అసలాయన దగ్గర వేట కుక్కలుండేవట."

"అవికూడా వేటాడుతాయా?"

'మరి... ఇలాంటి కుందేళ్ళను పట్టి తెస్తాయి. ఎంత వేగమనుకున్నావ్!".

"ఇంతకూ మనం వేట కెళ్లాలంటే ఇక్కడ అడవులెక్కడ ఉన్నాయి? రెండోది మనకు తుపాకులు కావాలి. వాటికి లైసెన్సులు కావాలి. అయినా ఇదివరకటిలా కాదుగదా. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వారు ఊరుకుంటారా?"

"మనది అంత పెద్ద వేట కాదు మిత్రమా. తుపాకుల్తో పనిలేదు. అయినా మనం అంత భయంకరమైన అడవుల్లోకి వెళ్ళటం లేదు. మనకు కావలసింది టార్చ్ లైట్లు."

"అంతేనా?"

"అంతేమరి. కుందేళ్ళకు అవి చాలు. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ గురించి నీకు తెలియందేముంది? దేశంలో అడవులన్నీ ఎందుకు తరిగిపోతున్నాయి? జంతువులు ఎందుకు



నాశనం అవుతున్నాయి?"

"అది నిజమే అనుకో. మనం ఓ పని చేసేటప్పుడు అన్ని ఆలోచించాలి కదా. "ఏం ఫర్వాలేదు. మనం రాత్రిపూట కదా వేటకు వెళ్ళేది."

"రాత్రి పూటా?"

"అవును. కుందేళ్ళను రాత్రిపూట వేటాడుతారు. మనం టార్చిలైట్లతో అడవిలోకి వెళ్తాం. రాత్రిపూట కుందేళ్ళు తిరుగుతుంటాయి. ఆ లైట్ వాటికళ్లలో పడగానే ఎటూ కదలకుండా నిలబడిపోతాయి. అప్పుడు కర్రతో కొట్టడమే. సింపుల్."

"అయినా రాత్రి పూట పురుగూ, పుట్రా ఉంటాయి కదా?"

"ఉంటాయి బాబూ. రాత్రి పూటేం కర్మ. ఎప్పుడూ ఉంటాయి. జీవితంలో మనిషికి కావలసింది సాహసం. థ్రిల్. ఇలాంటివన్నీ మన-జీవితాంతం గుర్తుంచుకునే అనుభవాలు. అయినా మన చేతుల్లో లైట్లుంటాయి. కర్రలుంటాయి. పురుగూ, పుట్రా ఏం చేస్తుంది?"

"ఏమో బాబూ పగలయితే ఫర్వాలేదు గానీ రాత్రి పూటంటే కొంచెం ఇబ్బందిగానే ఉంది."

"ఏం ఫర్వాలేదు. మొత్తం అయిదుగురం వెళ్తున్నాం. విస్సుగాడింట్లో బ్రహ్మాండమైన పార్టీ ఏర్పాటు చేస్తున్నాడు. మనం వేటాడి తెచ్చే కుందేళ్ళేకాదు. వాళ్ళ దొడ్లో పెరిగే నాటుకోళ్ళు... చేపలూ... మందూ..."

"సరే. మీ అందరితోపాటు నేనూ" అన్నాడు మధు.

★ ★ ★

విస్సు వాళ్ళ ఊరికి దగ్గరగా చిట్టడవులున్నాయి. వాటికి సమీపంలో సముద్రం కూడా ఉంది. వారంతా డబ్బున్న కుటుంబాలకు చెందినవారే. ఏదైనా కొత్త ఇంగ్లీష్ సినిమా వచ్చిందన్నా, ఎక్కడికైనా వెళ్ళాలన్నా అందరూ కలిసే చేస్తారు. వారంతా కలిసి జూదం ఆడతారు. కలిసి మధువు సేవిస్తారు. కలిసే ఆడపిల్లల్ని ఏడిపిస్తారు.

వారంతా ఇంకా చదువుకుంటున్న యువకులే. కాలేజీలో వారి వంక కొందరు అసహ్యంగానూ, మరి కొందరు భయంతోనూ చూస్తారు.

బజారుకెళ్ళి కావల్సిన సామాన్లు తీసుకున్నారు. సాయంకాలానికి విస్సు వాళ్ళింటికి చేరుకున్నారు. వేడివేడి నీటితో స్నానం... ఆ తర్వాత భోజనాలూ పూర్తయ్యాయి.

మూడు స్కూటర్లమీద ప్రయాణం ఆరంభమైంది.

ఓ చోట వాటిని పార్క్ చేసి నడవటం

## పెరిగిన 'జాకీ' అభిమానులు



జాకీ ష్రాఫ్‌కు రోజు రోజుకి అభిమానుల సంఖ్య పెరిగిపోతోందట. రామ్‌లఖన్, త్రిదేవ్ చిత్రాలు అంతగా జాకీకి ప్రయోజనం కలుగజేయనప్పటికీ అభిమానులు మాత్రం పెరిగిపోతున్నారట.

ఎక్కడైనా జాకీ కారు కనబడటంఆలస్యం జనానికి అంతుండటంలేదట. ఆటోగ్రాఫ్ కోసం ఎగబడేవాళ్లు కొందరైతే, చేతులిచ్చే వాళ్లు కొందరట.

హస్తసాముద్రికం అంటే చాలా నమ్మకమున్న జాకీ అప్పుడప్పుడు చెయ్యి చూసుకొంటుంటాడట తన అదృష్టం ఎక్కడకు చేరిందోనని!

ఆరంభించారు. కొంతదూరం పోయాక అడవిలోకి ప్రవేశించారు.

"అడవంటే పెద్ద పెద్ద చెట్లుంటాయనుకున్నాను" అన్నాడు మధు.

"అడవి కాదురా. చిట్టడవి. పెద్దగా చెట్లుండవు. తుప్పలూ, పొదలూ ఉంటాయి. ఓ మోస్తరు చెట్లుంటాయి."

"ఇక్కడేం ఉంటాయిరా? ఒక్క పులి కూడా ఉండదా?"

"పులా పాడా. దానికి ఇక్కడేం దొరుకుతుంది. ఇంక ఊరుమీదపడి జనాన్ని తినాలి".

"మరేం ఉంటాయి. ఒక్క కుందేళ్లేనా?"

"జింకలు ఏమైనా ఉంటాయేమో".

"ఈ చుట్టుపక్కల వారంతా సూడిగేదెల్ని, ఆవుల్ని అడవిలోకి తోలేస్తారు".

"ఎందుకలా చేయటం?"

"వాటిని మేపటం దండగని. అవే అడవంతా తిరిగి మేస్తాయి. ఈనేటప్పటికి తీసుకుపోతారు".

"ఎవరైనా తీసుకుపోరూ".

"ఎవరివి వారే తీసుకువెళ్తారు. ఎవరి పశువో అందరికీ తెలుస్తుంది."

"తమాషాగా ఉందే."

"ఇంకో విశేషం ఉంది. ఈ అడవుల్లో తిరిగే ఆవులు శాంతంగా ఉండవు. అవికూడా ఏగ్రెసివ్‌గా ఉంటాయి."

"ఇంకేం ఉంటాయి?"

"పాములుంటాయి."

"కోబ్రాలా?"

"కోబ్రాలా? అవి ఆఫ్రికన్ అడవుల్లో ఉంటాయి. త్రాచుపాములుండొచ్చు"

"త్రాచులే...ఇంకా?"

"మా ప్రాంతంలో ఓ విచిత్రమైన పాము కనబడుతుంటుంది. దానికి రెండు తలలుంటాయి. దాన్ని ఎంత కొట్టినా చావదు. కొట్టి కొట్టి ఆఖరికి తగలబెడతారు."

"విషం ఉంటుందా?"

"పెద్దగా విషం కాదనుకుంటాను."

"ఇంకేం ఉంటాయి?"

"ఇంక ఈ తుప్పల్లో ఏముంటాయి తేళ్లుంటాయి. మండ్రగబ్బలుంటాయి."

"మండ్రగబ్బా... నేనెప్పుడూ చూడలేదే."

"అదికూడా పెద్ద తేలులానే ఉంటుంది. కుట్టిందా ఇంక చూడు చచ్చావే."

"చచ్చిపోతారా?"

"ఛస్తారు. అన్నిటికంటే తాచుపాము బెస్ట్. పదినిముషాల్లో పోవచ్చు. ఈ మండ్రగబ్బ కాటు మన సుబ్బిగాడికికూడా వద్దు" అన్నాడు విస్సు.

అందరూ నవ్వారు సుబ్బిగాడు గుర్తొచ్చి. సుబ్బిగాడనే సుబ్బారావు. విస్సుగాడి దుష్మన్.

"అది సరేరా... వీడు హాయిగా తాచు పాముతో కాటేయించుకొని చచ్చిపోవాలంటాడేమిటి?"

తిరిగి అందరూ నవ్వారు.

"మండ్రగబ్బ కాటు అంత భయంకరమైందిరా."

"మరందుకేనా ఈ అర్ధరాత్రి పూట ఇక్కడకు బయలుదేరారు. ఈ కుందేళ్లు లేకపోతే ఏం బాబూ."

వారంతా నడుస్తున్నారు. అందరి చేతుల్లోనూ టార్చిలైట్లున్నాయి. కాళ్ల క్రింద ఇసక.... అందరి కాళ్లకు బూట్లున్నాయి. చేతుల్లో కర్రలున్నాయి.

"వేటంటే ఓ మజారా... నువ్వు పెద్ద అడవులు చూడలేదనుకుంటా.... అక్కడ పెద్ద జంతువులుంటాయి. అప్పుడప్పుడు అవి దేశంమీద కొస్తాయి. మొన్న విమానం కూలిపోయి రెండొందలమంది పోయారు. అలాగని ప్రయాణాలు ఆపేస్తామా" అన్నాడు విస్సు.

"అమ్మో" అరిచాడు మధు.

"ఏమయిందిరా?"

ఒక్కసారిగా టార్చిలైట్లు మధు మొఖం మీద.... కాళ్లదగ్గరపడ్డాయి. విస్సు బిగ్గరగా నవ్వాడు.

"ఓరి నీ కంగారు తగలెయ్యా... అది

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**FIRST & FOREMOST CHOICE OF TELUGU READERS FOR OVER 81 YEARS NOW.**

Presents

# సూపర్ హీరో

By

## మన్నెం శారద





తెరపై అతను యావదాంధ్రుల హృదయ విజేత. కానీ తెర వెనుక అతను జీవితంలో పడ్డ ఘర్షణలూ, పోరాటాలూ తెలుసుకోవాలంటే...

"సూపర్ హీరో" అంతరంగాన్ని చదవండి!

20-10-'89 సంచికలో ప్రారంభం!

# నా మదిలో నీ పద చప్పుడు

## కొడూరు శ్రీ వేంకటేశ్వరస్వామి

పద్మరాగ మణులు కుప్ప పోసినా అన్నట్లుగ తూర్పున భాను బింబం పైకెగస్తోంది. పక్షుల కిలకిలా రావములతో ప్రకృతి పులకిస్తూ, గరికలపై నిలచిన మంచు ముత్యాలతో ధరణిని అభిషిక్తం చేసి విలసిల్లుతున్న ప్రకృతి పుష్య మాస ఆగమనాన్ని సూచిస్తోంది.

అప్పుడే కన్నెలు పెడుతున్న ముగ్గులు, బాలికలు అలంకరిస్తున్న గొబ్బెమ్మలు ముంగిళ్ళ నలంకరిస్తూ, చూపరుల నలరిస్తున్నాయి. ఆ ముగ్గుల్లో కలిసి చూపరుల నాకర్షిస్తున్న ఒక మానిని మాలిని.

* * * * * *

మాలినీ!

ఇదే నీ పేరని మొన్నీ మధ్యే తెలిసింది. నా మదిలో పుష్యంలో మెదిలిన నీ తలపులు ప్రణయమై, నిర్ణయమైన ప్రేమ భావాల్ని నీతో చెప్పటానికి చైత్రం వరకూ పట్టింది. ఇంత కాలం నీ కదలిక నా మదిలో మెదిలి, వేణునాదమై, నాట్యకత్తె అభినయమై, పర్వతాగ్రాలకి రూపుదించిన శిల్ప కళామతి వేలార్చిన రసరమ్య శిల్పమై, గాయకుని ఆలాపనై, కవి మలిచిన కవితై, వీణా తంత్రుల శబ్దమై, నిశ్శబ్దమై, విశ్వనాధుని కిన్నెరసాని మాదిరి, మరో మందాకినిలా కదలి వచ్చినా అంతరంగం మీద నుంచి నీ ముంగిట నర్తించింది. ఈ మధ్యలో నిన్నెన్నడైనా కలిసిందా?

ఇన్నాళ్ళ కాల గమనంలో నీ గురించి పూర్తిగ తెలుసుకున్నాను. నీ అలవాట్లు, తత్వం, వ్యక్తిత్వం అన్నీనాకు నచ్చాయి. అందుకే నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ ప్రతిస్పందనని ప్రత్యక్షం చేసే ప్రత్యుత్తరం కోసం సహస్ర నయన విలసితుడ నవుతూ,

నీ
భరద్వాజ

* * * * * *

భరద్వాజా!

పుష్యంలో నే చూసిన చూపు నీ చేత చైత్రంలో తెల్పదగిన సుమధుర భావనికి కారణమైనదంటే, నా చూపు నీలో కలగాల్సిన భావననే కల్గించింది. నా చూపుకుసార్థకత ఏర్పడింది. పుష్యంలో కలిగిననా అనుభూతికి, చైత్రంలో తెలిపిన నీ భావనకి మధ్య మన మదిలో కదిలిన భావనా వీచికలే మన ప్రేమకి నిదర్శనం. ప్రేమంటే తెలియని మూర్ఖులకి మనప్రేమ గుణపాఠం కావాలి. అన్ని విషయాలు వివరంగా మాట్లాడు కుందాము. రేపు కలుసుకో. ప్రతిప్రేమ ఒక కలయిక కోసమే.

నీ
మాలిని.

* * * * * *

ప్రతి ప్రేమికులు తొలి పరిచయాన్ని గడిపిన విధానానికి భిన్నంగా గడిచింది. ఆనంద రసరాగ డోలికల్లో ఊయలూగడం మినహాయిస్తే, భూత, వర్తమానాల సంయమనంతో భవిష్యత్తుకి అవసరమైన ప్రణాళికలతో, పరస్పర ప్రేమానురాగాలు జీవితాంతం పంచుకునే ఆశతో,. ఆశయంతో, అవగాహనతో జీవిత భాగస్వాములు కావటానికి నిర్ణయించుకున్నారు.

ఆ క్షణం వారి ప్రేమ వారికి దేవదాసు పార్వతిల ప్రేమకన్న, లైలామజ్నుల ప్రేమ కన్న రమ్య రేవంత్‌ల ప్రేమకన్న, .... ఉన్నతంగ అనిపించింది. అలా అనిపించటం తప్పుకాదు. ప్రతి వారు తమదంత గొప్ప ప్రేమ మరోటి లేదని, తమంత గొప్పగా ప్రేమించేవారు లేరనే అహంభావంలో ఉంటారు. అసలు ప్రేమలోన్నే ఆ అహంభావం ఇమిడి ఉందేమో అన్పిస్తుంటుంది. అసలు నా ఉద్దేశ్యం ప్రతివాడు ప్రేమిస్తున్నానన్న భావనని ముందు ప్రేమిస్తూ ప్రేమలోకి దిగుతాడని నా అనుమానం. ఆ విషయం తర్వాత గానీ తెలియదేమో. తెలిసినా దానికంత ప్రాధాన్యత ఉండదేమో. ఉన్నా చాలా తక్కువగా ఉంటుందేమో! ఏది ఏమైతేనేం, వారిరువురి ప్రేమ, వివాహానికి దారితీసింది.

* * * *

చాలా అన్యోన్యంగ కొంతకాలం సాగింది. ఒకరి అభిప్రాయాన్ని మరొకరు గౌరవించుకోవటంలో ఒకరికొకరు తీసిపోలేదు. ఆమె మాటని అతడెన్నడూ కాదనలేదు. అతడి అభిప్రాయాన్ని ఆమె త్రోసిపుచ్చనూలేదు. ఆమె ఆశయం అతనికి ఆచరణయోగ్యమైంది. అతని అభిప్రాయం ఆమెకి ఆమోదయోగ్యమైంది. మొత్తం మీద అంతా సమతుల్యంగా గడిచింది.

* * * *

"నువు నమ్ము నమ్మకపో నే చెప్పేది వాస్తవం". అన్నాడు భాను.

"నీ మీద అపనమ్మకం కాదు కాని, ఎందుకో నమ్మబుద్ధి కావటంలేదు".

"నేను చెప్పింది నీ సంసారాన్ని పాడు చెయ్యటానికి కాదు. బాగు చేసుకుంటావనే ఆశతో .... ఎందుకంటే...."

"నాకు తెలుసు అది నా పరువుకి సంబంధించిన విషయం".

"పైగా.... పబ్లిక్‌గా...."

"అవును... ఆలోచించాల్సిన విషయమే. కానీ... నా మాలిని మధువు సేవిస్తుందంటే.... ఆ ఆలోచనే భయంకరంగా ఉంది"

"మాలిని, మందాకిని అనే పేరున్న వాళ్ళు అలా చేయకూడదని రూలేం లేదు కదా. నేను చెప్పేది అక్షరాల నిజం".

"సరే. చూస్తాను.... నీ సహాయానికి నా కృతజ్ఞతలు".

* * * *

"మాలినీ!!... నిజమేనా" ప్రేమపూరితంగా, అనునయంగా అడిగాడు భరద్వాజ.

"అవును.... ఈ విషయం మీకు చెబుదామనే అనుకున్నాను. మీరు.... కాదనరనే ఉద్దేశ్యంతో చెప్పలేదు."

"అసలిదెలా సంభవం. నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది".

"నా స్నేహితురాలు ఒకామె అమెరికాలో స్థిరపడింది. అక్కడి వాతావరణానికి ఆమెకి అలవాటైంది. అందువల్ల ఆమె ఇక్కడికి వచ్చినపుడు ఆమెతో పాటు కంపెనీ కోసం నేనూ తీసుకుంటాను. అందులో తప్పులేదని నా ఉద్దేశ్యం. మీరు కాదనరనే ధైర్యం".

"నీవు ఈ విధంగా ప్రవర్తించటం సమాజంలో నా గౌరవమర్యాదలకి భంగకరమే కాక, నా మనసుకి వ్యతిరేకమైంది కూడ. నీవు ఇది మానుకోవటం మంచిది".

"బహుశ అది కుదరదేమో. నా మనసుకు అతి దగ్గరగ వచ్చిన స్నేహితురాలు ఆమె ఒక్కతే. ఆమె తృప్తి కోసం నేనా పని చెయ్యక తప్పదు. మిమ్మల్ని, మీ మాటని కాదనాలని కాదు. ఈ ఒక్క విషయంలో ...."

"మాలినీ! ఎంత గాఢంగా ప్రేమించుకున్న వ్యక్తులకైనా ఒకర్నొకరు పూర్తిగా అర్థం చేసికొన్న వారి మధ్యనైనా ఈ అనవగాహన ఎక్కడో అక్కడ తప్పదేమో. మనిషి అభిప్రాయాన్ని కూర్చుకోగలడు గాని సిద్ధాంతాల్ని కూర్చుకోలేడని నా అభిప్రాయం. స్నేహితురాలితో నీ స్నేహం సిద్ధాంతపరమైంది. నా సిద్ధాంతం నా కెంత గొప్పో, నీ సిద్ధాంతం నీకూ అంత గొప్పే. ఇంత సున్నితమైన విషయంలో విభేదించిన మనం కలిసి బతకటం... బహుశ కష్టం కావచ్చు."

ప్రేమ ఎంత గాఢమైనదైనా ఎన్నో కొన్ని విషయాలలో నైనా విభేదం లేకుండా ఉండదు. అలాటి సంఘటనలలో ఎవరో ఒకరు రాజీకి రాకపోతే అది తప్పక విభేదానికి దారి తీస్తుంది. మొదట్లో అభిప్రాయభేదాలని ప్రేమ కవర్ చేస్తుంది.రాజీ పడటం అనేది లేకపోతే ఎంత అన్యోన్యమైన ప్రేమైనా బ్రేక్ అవక తప్పదు. ప్రతి కలయికా విడిపోవడానికి నాంది అన్నాడో రచయిత.

"ఈ విషయంలో ఇద్దరి అభిప్రాయాలు ఒకటే నండి. నాదారి నేను చూసుకొంటాను.... క్షమించండి."

"ఇందులో క్షమించే ప్రసక్తి లేదు. ఒక సిద్ధాంతపరమైన విభేదంతో మనం విడిపోతున్నాము... గుడ్‌బై... మళ్ళీ మరో జన్మలో వీలుంటే కలుద్దాం..."

ఆమె అతడిమది గడప దాటింది.

* * * * * * *

కళ్ళు తెరవగానే తన కిష్టమైన భంగిమలో కనబడిన మాలినిని చూశాక తెలిసింది తను కలగన్నానని. ఆ రోజంతా అతడు ఆలోచిస్తూనే గడిపాడు. అతనికేమాత్రం అర్థం కావటంలేదు తనకా విధమైన కల ఎళ్లా వచ్చిందో తన కలలో మాదిరిగా పూర్తిగా అవగాహనకి వచ్చిన ప్రేమికులు ఒక సిద్ధాంతం కోసం విడిపోవటం ఎంతవరకు సాధ్యం? అంతా అయోమయంగా తోచింది.

తన కలని రచయిత, మిత్రుడు అయిన శంభుని అడిగాడు. అతడు శరత్‌ని పూర్తిగ చదివాడు. అందుచేత అతడు ఎక్కువ . మనస్తత్వాలని పసిగట్టగలడు. అతడు చెప్పటం పెద్ద కష్టం కాకపోవచ్చని అతడ్ని అడిగాడు.




అతడు అంతా విని,

"నీ ఈ కలకి నేను వివరణ ఇవ్వలేను" అన్నాడు సాలోచనగా.

"ఏం? ఎందుకని... ఇది నిజ జీవితంలో పూర్తిగా అవాస్తవమే కావచ్చు. అయినా నీకు తోచింది వివరించు" అని అడిగాడు.

"ఎందుకంటే... నీ ఈ మాలిని కలే... నా మందాకిని కథ... నాకు తెలిసిన మరో మాలిని వాస్తవం".

"అంటే"

"ఇది వాస్తవానికి దూరమేమీ కాదు. ఒక వాస్తవాన్ని దృష్టిలో నుంచుకొని ఇదే ఇతివృత్తంతో నేను వ్రాసిన కథకి పాఠకులనుండి మంచి రెస్పాన్స్ వచ్చింది. నిజ జీవితానికి ఏమాత్రం దర్పణం పట్టని కథని ఏ పాఠకుడూ గౌరవించడు. ప్రతి ప్రేమికుడూ ఇలాంటి కల కంటాడని నేను చెప్పలేను కానీ... ఇది మాత్రం నిశ్చయంగా నీ మదిలో ఆమె ఎద చప్పుడు.

"అంటే?"

"నీ ప్రేమ గూడు చెదురుతుందేమోనని నీలో అంతర్గతంగా ఉన్న భయం... అని నా అభిప్రాయం."

"ఖచ్చితంగా అంతే" అన్న మాలిని మాటలకి వెనుదిరిగి చూశాడు. ఆమె మొఖంలో చిరునవ్వు. తన సంభాషణలని పూర్తిగా విన్నట్టుంది. ●




## 70. ఎం. ఎం., స్టీరియోఫోనిక్ సౌండ్ చిత్రం "శాంతి – క్రాంతి"

'తెలుగే కాక తమిళం, కన్నడం, హిందీ బాషల్లో అయిదు కోట్ల రూపాయల వ్యయంతో తయారౌతున్న భారీ చిత్రం కుద్రేముఖ్, మంగళూరులలో ఔట్‌డోర్ షూటింగ్ ఉంటుంది సెప్టెంబర్, అక్టోబర్‌లలో వరుసగా 30 రోజుల షూటింగ్ మార్చిలో షూటింగ్ ముగుస్తుంది, అన్నారు ప్రముఖ కన్నడ హీరో రవిచంద్రన్ ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ ఎస్ వీరాస్వామి నిర్మించే అనుపమ ఆర్ట్స్ శాంతి – క్రాంతి 70 ఎం ఎం, స్టీరియో ఫోనిక్ చిత్రంలో ప్రేమ, హాస్యం యాక్షన్ అన్ని మసాలాలూ ఉంటాయి నాగార్జున రవిచంద్రన్, జూహీచావ్లా, కుష్బూ సత్యనారాయణ, సాక్షి రంగారావు బ్రహ్మానందం అన్నపూర్ణ వై విజయ వగైరా నటవర్గం సాయినాధ్ మాటలు, హంసలేఖ సంగీతం, మధుసూధన్ ఛాయ రమేష్ శిల్పం సురేఖ – ప్రకాష్ నృత్యాలు హార్స్‌మన్‌బాబు సాహసాలు, కె నానాజీ సహకార దర్శకత్వం, మంజునాధ్‌బాబు – మహాబల ప్రొడక్షన్ బాలు కూర్పు నిర్వహిస్తున్నారు ఈశ్వరి ప్రొడక్షన్ **వారి ఆదే** చిత్రం కన్నడంలో రవిచంద్రన్, తమిళ **హిందీ - భాష**లలో రజనీకాంత్ హీరోలు నిర్మాణ **సారధ్యం**: సాంబశివరావు

## వాసూ ప్రొడక్షన్స్ 5 చిత్రాలు

"కొత్తదనం గల కథలతో 20 లక్షల బడ్జెట్ మించకుండా జనరంజకమైన, సామాజిక ప్రయోజనం గల చిత్రాలతో పాటు భక్తి పారవశ్యం కల్గించే చిత్రాలను కూడా నిర్మించాలని మా **ఆశయం** ఒక వంతు సీనియర్ తారలు, మూడొంతుల నవ కళాకారులతో **అత్యున్నత** ప్రమాణాలతో రూపొందించడమే మాధ్యేయం శ్రీ **శివ**రానందనాద్ వారి ఆశీస్సులతో నెలకొల్పే **అ**మరావతి ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్ సంస్థ ద్వారానే పంపిణీ చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం, **అ**న్నారు గతంలో 'ప్రజాతీర్పు' వంటి చక్కని చిత్రాన్ని **అం**దించిన బి. భాస్కరరాజా

మహాకవి పావయారాధ్య అనే చారిత్రాత్మక భక్తిరస ప్రధాన చిత్రానికి సెప్టెంబర్ 20న తొలిగీతం ధ్వని ముద్రిక చేయబడుతుంది. కె వి మహదేవన్ సంగీతం, సుదాకరరెడ్డి ఛాయతో భాస్కరరాజా దర్శకుడు అక్టోబర్, నవంబర్లలో చిత్రీకరణ జరుగుతుంది

రచయిత మరుదూరి రాజా దర్శకత్వంలో రేపటి భారతం చిత్రం షూటింగ్ అక్టోబర్ 2 నుంచి ఒకే షెడ్యూల్‌లో ఒంగోలులో పూర్తవుతుంది. సంగీతం మధుర రాజా

నవంబర్‌లో మోహనరాజాని దర్శకుడిగా, రుద్రమూర్తిని సంగీత దర్శకుడుగా పరిచయం చేసే 'చెలీ ఓ చెలీ' చిత్రం మొదలవుతుంది

వచ్చే సంవత్సరం ఫిబ్రవరిలో ఏడుకొండలవాడా', ఏప్రిల్‌లో చక్రవర్తి సంగీతం, సుదాకరరెడ్డి ఛాయతో న్యాయపోరాటం చిత్రాలు ప్రారంభమవుతాయి సి వి ఎస్ రామారావు ప్రొడక్షన్ కంట్రోలర్

'ఆంధ్రసచిత్రవారపత్రిక'

## సినిమా... సినిమా...

"ఖైదీ దాదా"లో సుమన్, రాధ

"సాక్షి"లో జయసుధ, రాజేంద్రప్రసాద్, చంద్రమోహన్.



# శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్‌లో బాలకృష్ణ, మోహనగాంధీ

'వచ్చే ఏడు ఆరంభంలో షూటింగ్ మొదలవుతుంది.' అన్నారు ప్రముఖ నటుడు మోహన్‌బాబు ఈయన నిర్మించే శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్ చిత్రంలో బాలకృష్ణ హీరో ఎ. మోహనగాంధీ దర్శకుడు ●

సీరియల్

# వజ్రసంకల్పం

## సాతవాహన

(గత సంచిక తరువాయి)

ఆ షాపు యజమాని పేరు సుందర్‌దాస్. కాలు నేల మీద మోపి నడిచే అలవాటు కూడా అతనికి లేదు. రోజుకి ఇరవైనాలుగ్గంటలూ కూర్చునో పడుకొనో వుండడం వల్ల పొట్ట బానలా పెరిగిపోయింది. ఎర్రగా టమేటాపండులా వుంటాడు. తలకు జరీపాగా చుట్టుకుని మెత్తటి పరుపుల మీద కూర్చుని జర్దాపాన్ నములుతూ లావుపాటి అకౌంట్ బుక్స్ ముందేసుకుని లెక్కలు చూసుకుంటున్నాడు.

లోపలికి వెళ్తూనే కస్టమర్లిద్దర్నీ మర్యాదగా ఓ దివాన్‌మీద కూర్చోబెట్టి సుందర్‌దాస్‌తో వాళ్ళొచ్చిన పని చెప్పాడు గుమస్తా. సుందర్‌దాస్ వెంటనే తన లాల్చీ జేబులోంచి ఐరన్‌సేఫ్ తాళాలు తీసిచ్చాడు.

"ముందు మేడమ్‌కీ అయ్యగారికీ కూల్‌డ్రింక్స్ పంపించు." అన్నాడు సుందర్‌దాస్ తెలుగు చాలా బాగా మాట్లాడతాడు.

గుమాస్తా తలూపి వెళ్ళిపోగానే తన కస్టమర్లవైపు నవ్వుతూ చూశాడతను.

"పాన్ ఖాయేంగే ఆప్?" పాన్‌దాన్ వాళ్ళవైపు వుంచుతూ అన్నాడు.

ప్రభు తల అడ్డంగా వూపేడు.

"జీనహీ! ముందు వుంగరాలు చూపించండి!" పొడిగా అన్నాడు.

"చూపిస్తాం సాబ్, చూపిస్తాం! ముందు మీరు రిలాక్సవ్వండి" మెత్తటి దిండ్లలోకి వాలుతూ ఒళ్ళోని అకౌంట్ పుస్తకం తీసి పక్కన పెట్టాడు సుందర్‌దాస్. "ఉంగరానికి పేమెంట్ ఎలా చేస్తారు? క్యాష్ ఇస్తారా?" ఫక్తు వ్యాపారస్తుడిగా మాట్లాడుతూ అడిగాడు.

ప్రభు నవ్వుతూ తల అడ్డంగా వూపేడు.

"చెక్ రాసిస్తాను!" అన్నాడు.

సుందర్‌దాస్ ఇబ్బందిగా మొహం పెట్టాడు.

"ఇష్టం లేకపోతే చెప్పండి. మేము వేరే షాపుకు వెళ్తాం!" అన్నాడు ప్రభు.

"అహహ, అలా అనికాదు!" గబగబా అన్నాడు సుందర్‌దాస్. "ఇటీవల ఓ చెక్కు మార్చుకునే విషయంలో పేచీ వచ్చింది. ఓ కస్టమర్ చెక్కురూపేణా పేమెంటిచ్చి వెళ్ళాడు. బ్యాంకులో చెక్కు డిసానర్ చేశారు."

ప్రభు మొహం ఎర్రబడింది.

"అంటే మేము కూడా అలా చేస్తామనా?" కాస్త కోపంగా అడిగాడు.

సుందర్‌దాస్ తల అడ్డంగా వూపేడు.

"ఎంత మాట ఎంత మాట! అలాగని నేననలేదు. చెక్కిచ్చి వెళ్ళేటప్పుడు మీ అడ్రస్‌తో పాటు చెక్కు డిసానర్ అయిన పక్షంలో క్యాష్

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్, నెం 3
న్యూ డిల్లీ 110008



Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

రూపంలో పేమెంటిస్తామని మీరు హామీ రాసిచ్చి వెళ్తే చాలు. దయ చేసి కోపగించుకోవద్దు. యాభై వేల రూపాయల ట్రాన్సాక్షన్లో ఈ మాత్రం సహకారం కోరడం తప్పు[illegible] అన్నాడు.

"సహకారం కాదు ఇది అవమానం!" ప్రభు లేవబోయాడు.

పింకీ అతనివైపు ప్లీజింగ్‌గా చూసింది.

"డార్లింగ్! ఆయన చెబుతున్న దాంట్లో తప్పేంలేదు. బిజినెస్‌లో ఆయనామాత్రం జాగ్రత్త పడకపోతే ఎలా? నువ్వలా అఫెండ్ కావడం ఏమీ బాగా లేదు! నీ చెక్ డిసానర్ అయితేకదా!" మృదువుగా అంది.

ప్రభు సర్దుక్కూర్చున్నాడు.

"ఆల్‌రైట్! అలాగే కానివ్వండి!" అన్నాడు ఉక్రోషంగా.

"దయచేసి అఫెండ్ కావద్దు," నొచ్చుకుంటున్నట్టుగా అన్నాడు సుందర్‌దాస్. "చెక్ రూపంలో పేమెంట్ యాక్సెప్ట్ చేసేటప్పుడు మేము తీసుకుంటున్న కనీసపు జాగ్రత్త ఇది. మీ ఒక్కరిదగ్గరే కాదు. మా ఎస్టీమ్డ్ కస్టమర్స్ అందరిదగ్గరా ఈ పద్ధతే పాటిస్తున్నాం!"

"ఫర్గెటిట్!" ఛీర్‌ఫుల్‌గా అన్నాడు ప్రభు. "ఉంగరాలు చూపించండి!"

అంతలో కూల్‌డ్రింక్స్ వచ్చాయి. కూల్‌డ్రింక్స్ తెచ్చిన కుర్రాడి దగ్గర్నుంచి ట్రే అందుకుని స్వయంగా తనే వాళ్ళకు సీసాలు అందించాడు సుందర్‌దాస్.

"లీజియే సాబ్! పహెలే ఠండాపీజియే!"

ప్రభు కూల్‌డ్రింకుని కొద్దిగా తాగి సీసా పక్కన పెట్టేశాడు. పింకీ నాజూగ్గా స్ట్రా పెదవుల మధ్య పెట్టుకుని నెమ్మది నెమ్మదిగా డ్రింక్ పీలుస్తోంది. ఆమె అందమైన పెదవులు సున్నితంగా స్ట్రా పీలుస్తుంటే చూడ్డానికి చాలా ఆకర్షణీయంగా వున్నాయి.

ఈ లోపల గుమస్తా వుంగరాల పెట్టెలు పట్టుకొచ్చాడు.

"ప్యూర్ డైమండ్ రింగ్స్. మీ హోదాకివి సరిగ్గా సరిపోతాయి. మాదగ్గరున్న వుంగరాలన్నింట్లోకి బెస్ట్ రింగ్స్ ఇవే. మీ క్కావల్సింది సెలెక్ట్ చేసుకోండి," అన్నాడు సుందర్‌దాస్.

ఆ వుంగరాలు చూస్తూనే పింకీ మొహం వికసించింది.

"డార్లింగ్! హౌ లవ్లీ!" ఓ ఉంగరం చేతిలోకి తీసుకుంది.

"బ్యూటిఫుల్!" ప్రభు సుందర్‌దాస్ వైపు తిరిగాడు.



"ఖరీదు చెప్పండి!" అన్నాడు చెక్‌బుక్ తీస్తూ.

"యాభై ఆరువేలు!"

ప్రభు చెక్‌బుక్ తెరిచి చకచకా ఆ ఎమౌంట్ రాసి సంతకం చేశాడు.

"థాంక్యూ థాంక్యూ! చెక్కందుకుంటూ అన్నాడు సుందర్‌దాస్.

"డార్లింగ్! ఇప్పుడు నీకీ వుంగరం నచ్చిందా?" పింకీ వైపు ప్రేమగా చూస్తూ అడిగాడు ప్రభు.

"ఓహ్ డార్లింగ్! ఇట్స్ బ్యూటిఫుల్ రింగ్!బ్యూటిఫుల్ రింగ్!" బ్యూటిఫుల్ అన్నమాట రెండుసార్లూ వత్తి పలుకుతూ అంది పింకీ.

ప్రభు సుందర్‌దాస్ వైపు వుత్సాహంగా చూశాడు.

"యువార్ లక్కీ! మమ్మల్ని శాటిస్ఫై చేసి భవిష్యత్తులో లక్షల రూపాయల బిజినెస్ కొట్టేశారు." అన్నాడు.

సుందర్‌దాస్ కూడా నవ్వేడు.

"మీ సేవయే మా కర్తవ్యము!" ఓ గవర్నమెంటు కార్పొరేషన్ వారి స్లోగన్ చెబుతూ ఇంకా గట్టిగా నవ్వి రసీదు రాసిచ్చాడు.

సుందర్‌దాస్‌కు చాలా సంతోషంగా వుంది.

ఈ ట్రాన్సాక్షన్లో కష్టమర్కి ఆరువేల రూపాయలు టోపీ వేయగలిగాడు తను. ఆ వుంగరం అసలు ఖరీదు యాభైవేలు మాత్రమే.

బాక్స్‌తో సహా వుంగరాన్ని నిర్లక్ష్యంగా కోటు జేబులో వడేసుకుని పింకీ చెయ్యందుకుని లేచి నిలబడ్డాడు ప్రభు.

"గుడ్‌బై సేట్‌జీ!"

వాళ్ళిద్దరూ చేతిలో చెయ్యేసుకుని బయటికి నడిచారు.

ఎక్జిట్ డోర్ దగ్గర వినయంగా నిలబడున్న ఇందాకటి దర్వాన్‌కి దర్పంగా జేబులోంచి నోటొకటి తీసి టిప్పిచ్చాడు ప్రభు.

"కీపిట్!"

ఆ నోటు చూస్తూనే దర్వాన్ కళ్ళు జిగేలుమన్నాయి.

వందరూపాయల నోటది.

తన కృతజ్ఞత తెల్పియజేస్తూ అతను వాళ్ళ కారు దగ్గరికి వెళ్ళి డోర్ తెరిచి పట్టుకున్నాడు.

ప్రభు డ్రైవింగ్ సీట్లోకి ఎగబాకాడు.

పింకీ అతని పక్కనే కూర్చుంది.

దర్వాన్ డోరువేసి సెల్యూట్ చేశాడు.

కారు స్పార్కయ్యి ముందుకు దూసుకెళ్ళింది.

కారు మెయిన్ రోడ్డు మీదికి మలుపు తిరుగుతూనే వాళ్ళిద్దరూ ఒక్కసారిగా పగలబడి నవ్వుకుంటూ ఒకళ్ళకొకళ్ళు షేక్‌హాండిచ్చుకున్నారు.

* * * * * *

డేవిడ్ పరిగెత్తుకుంటూ వచ్చి కారెక్కడంతోనే అప్పటికే కారు స్టార్ట్ చేసి రెడీగా వున్న జూడా ఒక్కసారిగా కారు ముందుకు దూకించాడు.

మరోసారి ఆ కారు పింకీ వెళ్తున్న కారుని ఫాలో కాసాగింది.

"ఏం జరిగింది డేవిడ్?" అడిగాడు జూడా.

"కొద్ది దూరంలో నిలబడి వాళ్ళు చేసే వనంతా జాగ్రత్తగా గమనిస్తున్నాను జూడా! యాభైవేల రూపాయలు ఖరీదు చేసే వుంగరం కొన్నారు!"

జూడా కనుబొమలు ముడివడ్డాయి.

"క్యాష్ పేమెంటిచ్చారా?"

"లేదు, చెక్కు రాసిచ్చారు. ఐ బెట్ జూడా! వందకి వెయ్యి రూపాయలిస్తాను. ఆ చెక్కు చెల్లదు. ఇట్స్ ఫ్రాడ్!"

జూడా కనుబొమలు మరింతగా ముడుచుకున్నాయి.

"మరీ అంత ఖచ్చితంగా వూహించుకోవద్దు డేవిడ్! పింకీ విషయంలో అలా చేశావంటే పప్పులో కాలేశావన్న మాటే!"

"అంటే?"

"షీ ఈజ్ నెంబర్ వన్ ఫ్రాడ్! కానీ, ఆ మోసం ఎలా చేస్తుందంటే మోసపోయిన వ్యక్తి అరిచి గీపెట్టినా ఎవరూ అది మోసమంటే నమ్మరు. ఒక్కోసారి మోసపోయిన వ్యక్తి కూడా తాను మోసపోయాడని తెలుసుకోలేడు. షీ ఈజ్ జీనియస్! ఆ షాపు యజమాని సుందర్‌దాస్ నాకు తెలుసు. అన్ని జాగ్రత్తలూ తీసుకోకుండా చెక్కు యాక్సెప్ట్ చేసివుండడు. అలాంటి వ్యక్తికి చెల్లని చెక్కిచ్చి వాళ్ళు డైరెక్టుగా చిక్కుల్లో ఇరుక్కుంటారంటే నేను నమ్మను."

"అయితే ఏమంటావు జూడా?"

"ఇప్పుడు నేనేమీ అనదల్చుకోలేదు!" ఎదురుగా వెళ్తున్న కారుని జాగ్రత్తగా ఫాలో చేస్తూ అన్నాడు జూడా. "పింకీ విషయంలో ముందుగా ఎవరూ ఏమీ చెప్పలేరు. కానీ, ఒక్కటి మాత్రం చెప్పగలను. పింకీ ఏదో ప్లానేసింది – ఏదో తిరుగులేని ప్లానేసింది! ఆ ప్లానేమిటో తెలిస్తే గానీ అసలు విషయం బోధపడదు. ఒక్క విషయం చెప్పు డేవిడ్! ఆ చెక్కు చెల్లించుకోవడానికి ఎంత టైం పడుతుంది?

"రెండు రోజులు!"

జూడా కళ్ళలో హఠాత్తుగా ఇంట్రెస్టు కనిపించింది.

"అంతాలస్యం దేనికి?" అడిగాడు.

## వజ్ర సంకల్పం

విలువయిన ముత్యాలు చాలా వరకు సముద్రంలోనే ఉద్భవిస్తాయి. ప్రకృతి వరప్రసాదమయిన ఈ సౌందర్య రూపాల ముత్యాలు 'ఆయిస్టర్' అనే సముద్రపు చేపవల్ల ఉద్భవిస్తాయి. సహజసిద్ధంగా తయారయిన ఈ ముత్యాలలోనే వర్ణించనలవికాని కళ, కాంతి ఆకర్షణ ఉంది, మనలను సమ్మోహితులను చేసి మానవ హృదయాలను తనలో బంధించుకునే శక్తిని కలిగి ఉంటాయి. వజ్రాలతో కలిపినా, బంగారు ఆభరణాలలో పొదిగినా, ఏ హంగులు లేకుండా వాటిని మాత్రమే ధరించినా ముత్యాల సౌందర్యం ముత్యాలదే.

సముద్ర గర్భంలో ఉండే ఆయిస్టర్ అనే చిన్న చేపలను ఇసుక రేణువులవంటి బాహ్య పదార్థాలు తాకినపుడు వాటినుండి రక్షణగా ఈ చేపలు తన చుట్టూ 'నెయికర్' అనే పదార్థాన్ని తన శరీరం నుండి స్రవింప చేసుకుంటాయి. ఈ నెయికర్ సున్నితంగా ఉండి గట్టిగా తయారవుతుంది. ఈ నెయికర్ పొరలు పొరలుగా చేపచుట్టూ తయారయిన కొన్ని సంవత్సరాల తరువాత ముత్యాలుగా రూపొందుతాయి. నెయికర్‌లో పలు స్ఫటికాలుండి ఒకదానికొకటి అంటి పెట్టుకొని ఉండడంతో వీటిలోకి కాంతి ప్రసరించినప్పుడు ఇంద్రధనుసు రంగులు కనిపిస్తాయి. ఈ స్ఫటికాలు ఒక వరుసక్రమంలో ఉండకపోతే ముత్యాలు ప్రకాశవంతంగా ఉండవు.

ఐతే, ఈ ముత్యాలను కృత్రిమ పద్ధతుల ద్వారా కూడా తయారు చేస్తారు. ఆయిస్టర్‌లపైకి ఇసుకరేణువుల వంటి బాహ్య పదార్థాలు సహజసిద్ధంగా చేరనపుడు కృత్రిమంగా వీటిని చేపల శరీరంపైకి పంపిస్తారు. సాధారణంగా వీటి తయారీకి 'అకోయా' అనే ఆయిస్టర్ చేపలను ఉపయోగిస్తారు. ఈ అకోయా చేపలు జపానుకు దక్షిణంగా, పశ్చిమంగానున్న సముద్ర భాగంలో ఎక్కువగా కనిపిస్తాయి. స్ఫటికాలు ఏర్పడిన తరువాత ఆయిస్టర్ చేపలను కాల్చి ముత్యాలను పొందుతారు. శుద్ధనీటిలో తయారయిన ముత్యాలకు బీవా ముత్యాలని పేరు. ఇవి జపాన్‌లోని

ఇంతవరకూ సాగిన కథ-15: విశ్వధరవర్మకు తండ్రి అనంతరం మిగిలిన బీడు భూమిలో బావి త్రవ్వుతుండగా దొరికిన అపురూపమైన వజ్రాన్ని అతని దాయాది అయిన వజ్రపాణి చేజిక్కించుకుంటాడు. ఈ సందర్భంగా విశ్వధరవర్మ పెద్ద కొడుకు రాజేంద్రవర్మ, అతని కుటుంబం వజ్రపాణి కత్తికి ఎర అవుతారు. విశ్వధరవర్మ చిన్న కొడుకు నరేంద్రవర్మకు ఉరిశిక్ష పడుతుంది. నరేంద్రవర్మ భార్య మగబిడ్డను ప్రసవిస్తుంది. ఇద్దరు ప్రేమికులను విడదీయబోయిన గూడెం పెద్దలను అడ్డుకొని వజ్రకాయుడు వారిని రక్షిస్తాడు. మళ్లీ తన తొలి రాత్రి వజ్రపాణి హవేలీలో బంది అవుతుంది. తన అందంతో అందర్నీ బురిడీ కొట్టించే పింకీ-ప్రభుతో కలిసి ఒక ఉంగరాల షాపుకు వెళ్తుంది.

# నేపథ్యంలో ....

సరసులలో ఎక్కువగా తయారవుతుంటాయి.

కృత్రిమంగా తయారయిన ముత్యాలపై కూడా ప్రకృతి ప్రభావం ఎక్కువగా ఉంటుంది. అందుకే ముత్యాలన్నీ ఒకేరకంగా ఉండవు. ఆకారం, పరిమాణం, రంగు, కాంతి, ఉపరితలం అనే ఐదు ముఖ్యాంశాలు ముత్యం యొక్క విలువను నిర్ణయిస్తాయి. ఏ ఒక్క ముత్యమూ మరొక ముత్యంలా ఉండదు. రెండు ముత్యాలు ఎన్నిరకాలుగా ఒకేలక్షణాలను కలిగిఉన్నా రెండిటికీ ఒక్క లక్షణంలోనయినా తేడా ఉంటుంది. కొన్ని మంచి ఆకారంలో ఉండి వాటి కళా, కాంతులలో తేడా ఉండవచ్చు. లేదా ఉపరితలంలో తేడా ఉండవచ్చు. ఈ ఐదులక్షణాలు అత్యుత్తమంగా



# ముగ్ధులను చేసే సముద్ర సంపద ముత్యాలు

ఉన్నవే అన్నింటికంటే విలువయిన ముత్యాలు ఎంత గుండ్రంగా ముత్యం ఉంటే విలువయిన వజ్రంగా దానిని పిలుస్తారు.

ముత్యం విలువ నిర్ణయించేటప్పుడు ప్రధానంగా పరిగణలోకి తీసుకునే విషయం ముత్యంలోని కళ, కాంతి, ఈ కాంతివల్లే ముత్యం విలువ పెరుగుతుంది. మంచి కళ, కాంతులున్న ముత్యానికి గుండ్రని ఆకారం లేకపోయినా విలువయిన ముత్యమే. ఐతే, కళ, కాంతిని పరిశీలించేటపుడు ముత్యం యొక్క ప్రతిఫలించే శక్తిని చూసి, దాని ఉపరితలం కాంతిని చూసి మోసపోకూడదు. ముత్యాలు లోపలనున్న కాంతిని, తేజస్సును పరిగణలోకి తీసుకోవాలి. ముత్యం నీడను పరిశీలిస్తే దీనిని చక్కగా నిర్ధారించవచ్చు.

మిగతా విషయాలకొస్తే ముత్యం రంగు స్వచ్ఛంగా, స్పష్టంగా ఉండాలి. మన ఆర్థిక శక్తినిబట్టి ముత్యం ఆకారానికి, రంగుకు ప్రాధాన్యత ఇవ్వచ్చు, ఇవ్వకపోవచ్చు. ముత్యం ఎంతపెద్దదయితే విలువ అంతగా పెరుగుతుంది.

ఈ విషయాలను దృష్టిలో పెట్టుకుని ముత్యాలు కొనేటపుడు జాగ్రత్త వహించాలి. మనకు శక్తి ఉన్నంత మేరకు అతి సుందరమయిన ముత్యాలను జాగ్రత్తగా ఎన్నుకోవలసి ఉంటుంది.

## ముత్యాల విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు

(1) అమ్మకందారు గులాబీ రంగు కాగితంలో ముత్యాలను అందంగా కట్టి ఇస్తారు. కానీ మనం ఆ కాగితంలో ముత్యాలను ఉంచకూడదు. పొరపాటున కాగితం తడిస్తే కాగితం రంగు ముత్యాలకు అంటుకోవచ్చు.

(2)ముత్యాలను కాస్మటిక్స్‌కు దూరంగా ఉంచాలి. దుమ్ము, ధూళి పడకుండా చూడాలి. ముత్యాలు ఒంటిపై, తలలో ధరించేటప్పుడు పౌడర్ వేసుకోవాలి. జుట్టును పొడిగా ఉంచుకోవాలి.

(3) ముత్యాలను ఉపయోగించిన తరువాత మెత్తని వస్త్రంతో శుభ్రంగా తుడవాలి.

(4) నెక్లెస్‌కున్న దారాన్ని సంవత్సరాని కొకసారయినా మార్చాలి.

(5) ముత్యాల దండకు సిల్కుదారాన్ని ఉపయోగించాలి గానీ నైలాన్ దారాన్ని వాడకూడదు. పొరపాటున దారం తెగినా సిల్కుదారం వాడితే ఎక్కువ ముత్యాలు రాలిపడవు.

(6)ముత్యాలను ఇంటివద్ద శుభ్రపరచకూడదు.

(7)ముత్యాలను బంగారం, వెండి వైర్లలో అలంకరించినప్పుడు ముత్యాల విలువ తగ్గుతుంది. ముత్యాలకు నూనెను పీల్చుకునే శక్తి ఉంది. అంతేకాక ముత్యాలకు పెట్టిన రంధ్రాలు పెద్దవయ్యే అవకాశం చాలా ఉంది.

(8) ముత్యాలను ఉపయోగించినపుడు పట్టుబట్టలో చుట్టి పెట్టెలో పెట్టాలి.

(9) ముత్యాల విలువ పెరిగిన కొలదీ వాటిని నెక్లెస్‌గా మార్చే విధానంలో జాగ్రత్త ఎక్కువగా తీసుకోవాలి. వజ్రానికి వజ్రానికీ మధ్య దూరం ఉండాలి. వాటి మధ్య దారం ముడివేయాలి. దీనివల్ల ఒకదాని కొకటి ఒరుసుకోడానికి వీలుండదు. అంతేకాక దారం తెగితే ముత్యాలన్నీ రాలిపోకుండా ఉంటాయి. ●

---

"రేపు బ్యాంక్ హాలిడే!" చెప్పాడు డేవిడ్. "ఎల్లుండి ఆదివారం. ఆ చెక్కు మారాలంటే సోమవారం దాకా ఆగక తప్పదు."

"ఐ...... సీ....!" నెమ్మదిగా అన్నాడు జూడా.

"ఏమైనా అర్థమైందా?" ఆసక్తిగా అడిగాడు డేవిడ్.

జూడా తల అడ్డంగా వూపేడు.

"పింకీ కావాలనే ఈ రోజు ఎన్నుకుంది. ఆ రెండురోజుల ఆలస్యానికి ఏదో కారణం వుండి వుండాలి!"

"ఎలా చెప్పగలవు?" అడిగాడు డేవిడ్.

జూడా అతని కళ్ళలోకి సూటిగా చూశాడు.

"కారణం లేకుండా పింకీ ఏ పనీ చెయ్యదు!" అన్నాడతను.

సరిగ్గా అదే సమయంలో పింకీ కారు ఆమె అపార్ట్‌మెంటు ముందాగింది.

జూడా తన కారక్కడ ఆపకుండా స్పీడుగా ముందుకెళ్ళిపోయాడు.

"గుంటనక్క ప్రస్తుతానికి విశ్రమించింది!" అన్నాడతను రియర్‌వ్యూ మిర్రర్లో పింకీని చూస్తూ.

(ఇంకా వుంది)

హాస్యనవలిక!

# ఆషాఢపట్టి

'క్రోక్విల్' నరసింహా



"సార్ టెలిగ్రాం....!"

అన్న పిలుపుతో వంట యింట్లో ఉల్లిపాయలు తరుగుతున్న రాజేంద్ర ఒక్కసారిగా ఉలిక్కిపడి ఆదరాబాదరా బయటకు పరిగెత్తుకొని వచ్చాడు.

అతని అవతారం చూసిన పోస్టుమ్యాన్ చికాకుగా ఫీల్ అవుతూ, "నీక్కాదు నాయనా వచ్చింది మీ అయ్యగార్ని పిలువు సంతకం పెట్టాలి!" అని కసురుకున్నాడు.

అప్పుడు చూసుకున్నాడు రాజేంద్ర తన అవతారం వంక. మాసిపోయిన లుంగి, దానికి తగ్గట్టు బనీను, తలకు చుట్టుకున్న టవల్. "ఓహో అందుకా నన్ను పనిమనిషిగా భావించాడు" అని అనుకుంటూ–

"నేనే నయ్యా మగడా! ఆ రాజేంద్రబాబుని. నాకే టెలిగ్రాం వచ్చింది" అని అన్నాడు. జరిగిన పొరపాటు గ్రహించి వచ్చే పండక్కి ఎక్కువ మామూలు యివ్వడేమోనని కంగారుపడుతూ, "సారీసార్ మీ అవతారం చూసి అలా అన్నాను." అని అంటు సంతకం పెట్టించుకొని టెలిగ్రాం యిచ్చాడు పోస్టుమ్యాన్. తను ఎదురుగా వుంటే ప్రమాదం అని గ్రహించిన అతను దొక్కు సైకిలెక్కి దౌడు తీశాడు.

తన భార్యను వెంట బెట్టుకుని మామ రేపు వస్తున్నట్టు యిచ్చిన టెలిగ్రాం చదువుకున్న రాజేంద్ర ఆనందంతో పిచ్చిగంతులు వేశాడు.

అది చూసిన ఎదురింటి బ్రహ్మానందం తన యింట్లోకి రయ్యిన వెళ్ళి పంచాంగం చూశాడు "ఈ రోజు అమావాస్య కాదుకదా" అన్న అనుమానంతో!

* * * * * *

భార్య వస్తుందన్న వార్త తెలియటంతో నే ఊహాలోకంలోకి వెళ్ళిపోయాడు రాజేంద్ర. రెండు నెలల క్రితం జరిగిన తన పెళ్ళి, వారం రోజులు గడవకుండానే వచ్చిన ఆషాఢమాసం.

వంట యింట్లోంచి ఏదో పొగలు రావటం గమనించిన రాజేంద్ర పరిగెత్తుకొని వంట యింట్లోకి వెళ్ళాడు.

అక్కడ పొయ్యి మీద వున్న అన్నం గిన్నె తన రూపం మార్చుకొని వెక్కిరిస్తు దర్శనం యిచ్చింది. టైం పది గంటలు కావస్తుంది. తిరిగి అన్నం వండుకునే టైం లేదు. ఆఫీసుకు వెళ్ళాలి. యింతవరకు ఏ పని పూర్తి కాలేదు. ఈ రోజుకు హోటలు కూడు తప్పదు అని గొణుక్కుంటూ బాత్‌రూం వైపు దారి తీశాడు రాజేంద్ర!

* * * * *

తెల్లవారింది.....

దానికి గుర్తుగా యింటి ప్రక్క వీధిపంపు దగ్గర తెలుగు సినిమా పాటల బాణీలో ఆడవాళ్ళ గలాట వినిపించ సాగింది.

అది సుప్రభాతంగా భావించిన రాజేంద్ర లేచి టైం చూసుకున్నాడు. అప్పుడే ఏడు గంటలు కావస్తుంది. అంతే ఒక్కసారిగా నిద్రమత్తు దిగిపోయింది. గబగబా స్నానం పూర్తి చేసి ట్రింగా తయారు అయ్యాడు. ఒక్కసారి తన యింటిని పరిశీలించి చూసుకొన్నాడు.

యిన్ని రోజులు తను ఒంటరి వాడు. ఈ రోజు నుండి భార్యతో కలిసి కాపురం చేయబోతున్న భర్త. ఆలోచన వచ్చిందే తడువు యింట్లో ఎక్కడెక్కడ ఏ సామాను వుండాలో ఆలోచించి నీట్‌గా సర్దాడు. టైం తొమ్మిది గంటలు కావస్తుంది. నిన్న ముందుగానే ఆఫీస్‌లో శలవు పెట్టాడు. బయటకు వచ్చి యింటికి తాళం వేస్తు మరోసారి తనకు మామ యిచ్చిన టెలిగ్రాం చదువుకున్నాడు. తాము బయలుదేరి వస్తున్నట్టు యిచ్చాడే కాని, వచ్చేది రైల్లో, బస్లో తెలిపి ఛావలేదు. "ఛీ... ఛీ పల్లెటూరి మూకకి బుర్రలేదు". యిప్పుడు తను ఎక్కడకు వెళ్ళాలో రాజేంద్రకు అర్థం కాలేదు. తను బస్టాండ్‌కి వెడితే.... వాళ్ళు రైలుకి వస్తే. మరోసారి ఆలోచించాడు. ఏం చేయాలీ అని.

"దేనికి బయలుదేరి వచ్చినా తిన్నగా యింటికి వస్తారు. మామగారికి యింటి అడ్రస్ తెలుసు కాబట్టి ఏం ఫర్వాలేదు" అని అనుకుని "సినిమారంజని" తీసుకుని చదువుకో సాగాడు.

ఎప్పుడు నిద్ర పట్టిందో అతనికే తెలియదు!

* * * * * *

మధ్యాహ్నం 12 గంటలు.

టక్...టక్...మని తలుపు కొట్టిన శబ్దం వినిపించింది. ఆ శబ్దానికి మెలుకువ వచ్చిన రాజేంద్ర కంగారుగా వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా సూట్‌కేసు పట్టుకొని నిల్చున్న భార్య రజనీని "ఏమిటి నీవు ఒంటరిగా వచ్చావా, మీ నాన్న నీ వెంట రాలేదా" అని కంగారుగా అడిగాడు రాజేంద్ర.

దానికి సమాధానంగా రజని "వచ్చారు. లక్ష్మిని లారీ నుండి క్రిందకు దింపిస్తున్నారు" అని చెప్పింది.

ఆ మాటలు ఏమి రాజేంద్రకు అర్థం కాలేదు.

"లక్ష్మిని దింపటమేమిటి కొంపదీసి మీ పని మనిషి కాలుగాని విరిగిందా" అని అంటూ బయటకు పరిగెత్తాడు.

బయట రోడ్‌మీద లారీ ఆగివున్నది.

లారీ వెనుక వున్న బాడీ నుండి క్రిందకు వేసిన చెక్కమీద నుండి వయ్యారంగా క్రిందకు దిగుతూ కనిపించింది ఒక ఆవు.

దాన్ని ఎందుకు వెంట తెచ్చారో అర్థం కాక–

"ఆవుని ఎందుకు యిక్కడకు తీసుకుని వచ్చారు మామగారు" అని వినయంగా అడిగాడు.

అల్లుడు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పక జీతగాడిని "ఆవుని యింట్లోకి జాగ్రత్తగా తీస్కొని వెళ్ళమని" ఆదేశాలు యివ్వసాగాడు.

మామగారు తనను పట్టించుకోకపోయేసరికి వళ్ళు మండిన రాజేంద్ర తన యింటిమీద అరుస్తున్న కాకిని రాయితో యీడ్చి కొట్టాడు?

* * * * * *

భార్య రజనీకి వంట యింట్లో ఏ సామాను ఎక్కడ వుందో చూపిస్తూ వంటలో సాయం చేయసాగాడు రాజేంద్ర.

యిలాంటి అనుభవం అతనికి యిదే మొదటిసారి.

రజనీకి కూడా భర్తతో ఒంటరిగా గడపటం ఒక థ్రిల్‌గా వుంది. పాపం ఈ దంపతు లిద్దరికి పెళ్ళి

అయిన దగ్గరనుండి అన్నీ కష్టాలే. పెళ్ళి జరిగిన రెండో రోజునే ముహూర్తం బాగుంది అంటు శోభనం వేడుకని మూడు రోజులపాటు ఘనంగా జరిపించారు.

నాలుగో రోజు తెల్లవారు జామునే నిద్ర లేపి ప్రయాణం అవమని తొందర చేశాడు రాజేంద్ర మామగారు.

కారణం?

ఏంటో తెలియని రాజేంద్ర తన వెంట భార్య కూడా వస్తుందని సంబర పడ్డాడు.

కాని అతని ఆశలు పగటి కలలు అయ్యాయి.

రేపటినుండి ఆషాఢమాసం వస్తుంది.

అల్లుడు అత్తగారి గడప త్రొక్కకూడదని తెలిసేసరికి తలమీద ఐస్ దిమ్మ పెట్టినట్లు అయ్యింది రాజేంద్రకి.

నెల రోజులపాటు తిరిగి బ్రహ్మచారిగా కాలం గడపాలని తెలిసేసరికి పిచ్చి ఎక్కినట్లు అయ్యింది.

దానితో కోపం వచ్చి గబగబా సూట్‌కేస్ సర్దుకొని






హిందీ చలన చిత్ర రంగంలో ప్లేబాక్ గాయకులుగా మంచి పేరు సంపాదించిన మహమ్మద్ రఫీ, కిశోర్‌కుమార్, ముఖేష్‌ల మరణంతో చిత్ర రంగానికి ఏర్పడిన లోటును ఎవ్వరూ భర్తీ చేయలేక పోయారు. కొత్త గాయకులు వారిని అనుకరించాలని శతవిధాలా ప్రయత్నాలు చేస్తున్నారు.



ఇటీవల అమితాబ్, రేఖ, శ్రీదేవి మరికొంత మంది ఫ్యాన్సీగా సినిమాల్లో స్వంతంగా పాడటం ప్రారంభించిన విషయం పాఠకులకు తెలిసినదే. ఇప్పుడు వీళ్ల కోవలోకి చేరిపోయాడట నటుడు సురేష్ ఒబెరాయ్. "యాదోంకీ మౌసమ్" అనే చిత్రంలో అనూరాధ పౌడ్వాల్‌తో కలసి ఒకపాట పాడాడట. ఈమె 1988 సంవత్సరానికి నేషనల్ సిటిజెన్స్ అవార్డు స్వీకరించిందట కూడా సంగీతంలో విశేష కృషి జరిపినందుకు.

నటీనటులు ఎవరికి వారే యిక పాటలు పాడుకుంటుంటే ప్లేబాక్ గాయనీ, గాయకులతో పనేం వుంటుంది. ఇదీ ఒకందుకు నిర్మాతలకు మేలేనేమో!

అత్తగారియింట్లో ఎవరితో చెప్పా పెట్టకుండా బస్ ఎక్కి తన వూరు వచ్చి పడ్డాడు రాజేంద్ర.

అతని వాలకం కనిపెట్టిన మామ ముసిముసి నవ్వులు నవ్వుకొన్నాడు. తను కూడా అదే విధంగా చేసింది గుర్తు తెచ్చుకుంటు!

* * * * * *

"ఆఁ! ఏంటి అల్లుడుగారు! విశేషాలు చెప్పండి." అని మామగారు గ్లాస్‌లోని కాఫీ జుర్రుతు అడిగేసరికి రాజేంద్రకి చుర్రుమని మండి "ఏం లేదండి. కాపురానికి మీ వెంట యిద్దరమ్మాయిల్ని తీసుకొని వచ్చారే" అని వ్యంగ్యంగా అనేసరికి మామగారికి విషయం అర్థం అయ్యింది.

"అవుని వెంట తెచ్చామని అల్లుడుగారికి కోపం వచ్చినట్లు వుంది. మీరు ఎగతాళి చేసినా నిజంగానే ఆ అవుని కన్నబిడ్డలానే పెంచాను అల్లుడుగారు. మా రజనికి చిన్నతనంనుండి అదంటే ప్రాణం. మా యింట్లో ఒక మనిషిగా దాన్ని కంటికి రెప్పలా కాపాడుకుంటు వచ్చాం" అని మామ అనేసరికి రాజేంద్ర తను మామగారిని బాధ పెట్టినందుకు సిగ్గు పడ్డాడు.

"అల్లుడుగారు మీకీ విషయం తెల్సా? ఈ అవుని మీకు అషాఢపట్టి బహుమతిగా మీ అత్తగారు దీన్ని పంపించారు" అని మామగారు అనేసరికి రాజేంద్ర ఉలిక్కిపడ్డాడు. అతనికి మతి పోయినంత పనయింది.

"అషాఢ పట్టిగా స్కూటరిస్తారు, టి. వి. యిస్తారు. కాని యిదెక్కడి బహుమతిరా బాబు" అని మనసులో అనుకుంటు తలపట్టుకొని కూర్చున్నాడు.

రేపటినుండి ఈ పట్నంలో అవుని ఏవిధంగా సాకాలో, ఎన్ని యిబ్బందులు పడాలో పాపం రాజేంద్ర!

* * * * * *

రాజేంద్ర తల్లిదండ్రులు చిన్నతనంలోనే చనిపోవటంతో మేనమామ దగ్గర పెరిగాడు.

హాస్టల్‌లో వుండి చదువుకుంటు డిగ్రీ పూర్తి చేశాడు. పైసా లంచం యివ్వకుండా, ఎవరి రికమండేషన్ లేకుండా గవర్నమెంట్ ఉద్యోగం సంపాదించుకున్నాడు.

ఉద్యోగంలో చేరిన రెండు సంవత్సరాల్లో ప్రమోషన్‌పై పైస్థాయికి చేరుకున్నాడు.

తను పనిచేసే డిపార్ట్‌మెంట్‌వాళ్ళు ఉద్యోగులకు కాలనీ కట్టిస్తే అందులో తనకు ఒక క్వార్టర్ తీసుకొన్నాడు. అది తీసుకొన్న ఆరు నెలలకే రజనీతో వివాహం అయ్యింది. ఆదిలోనే హంసపాదు అన్నట్లుగా పెళ్ళి అయిన వారం రోజులలోపే అషాఢమాసం రావటంతో అల్లుడ్ని బలవంతానా వంటరివాడ్ని చేయటం జరిగింది. నెల రోజులు వరకు అష్టకష్టాలు పడి కాలం వెళ్ళదీస్తే తీరా కాపురానికి వస్తు భార్య "అషాఢ పట్టి బహుమతి" అంటూ తనకిష్టమైన అవుని వెంట బెట్టుకొని వచ్చింది. మంచి నీళ్ళు దొరకని పట్నంలో పిచ్చికగూడులాంటి క్వార్టర్‌లో తామిద్దరే చిలకా గోరింకల్లా హాయిగా కాపురం చేద్దాం అనుకొన్న రాజేంద్రకి లేనిపోని కష్టాలు వచ్చి పడ్డాయి అవు రూపంలో.

* * * * * *

సమయం రాత్రి పది గంటలు దాటింది.

బెడ్‌రూంలో రాజేంద్ర కునికిపాట్లు పడుతున్నాడు. ముందు గదిలో పడుకొన్న మామగారి గురక జోలపాటలా వినిపిస్తున్నది.

గదిలోకి వచ్చిన రజనీ పాల గ్లాస్‌తో నిలబడి వున్నది.

భర్త రాజేంద్ర తను వచ్చింది గమనించాడో లేదోనని చేతి గాజులు ఒకసారి గలగలలాడించింది.

ఆ శబ్దానికి తపోభంగం అయిన విశ్వామిత్రుడిలా చూశాడు.

ఎదురుగా పాల గ్లాసుతో నిలబడివున్న రజని కనిపించింది.

అంతే నిద్రమత్తు ఒక్కసారి దిగిపోయింది.

పాల గ్లాసు పట్టుకొని శోభనం గదిలో నిలబడిన రజనీ చేసిన చిలిపి చేష్టలు గుర్తుకు వచ్చిన రాజేంద్ర నెల రోజుల తరువాత వచ్చిన అవకాశాన్ని ఏమాత్రం జారవిడుచుకోలేదు.

తెల్లని చీర...

తలలో మల్లెపూలు...

ఒంటరి ఏకాంతం...

వారిద్దరి మదిలో కోటి కోర్కెలను నిద్ర లేపాయి.

మంచంమీద చేరిన దంపతు లిద్దరు ఒకరిని ఓడించాలని మరొకరు పోటీ పడసాగారు.

పడకింటి సమరంలో ఎవరు ఓడినా... ఎవరు గెలిచినా యిద్దరికి ఆనందమే...

కొన్ని నిముషాలు ఆ గదిలో గాలి స్తంభించిపోయింది.

అలసట చెందిన రెండు శరీరాలు విశ్రాంతిని కోరుకున్నాయి.

"ఏమండి నాదో చిన్న కోరిక" అని రాజేంద్ర గుండెలపై తన తల పెట్టుకొని గోముగా అడిగింది రజనీ.

"ఏమిటో ఆ కోరిక! దేవిగారు శలవియ్యండి".

"నేను మీ దగ్గరకు వస్తూ వెంట "అవుని" తెచ్చానని కోపంగా వుంది కదూ"

"వుండదా మరి పట్నంలో మనకు బ్రతకటం కష్టమవుతున్న ఈ రోజుల్లో దాని పోషణ మరింత భారం అవుతుంది తెలుసా".

"పాపం దాని చిన్నతనం నుండి నా దగ్గరే పెరిగింది. అందుకే మావాళ్లు దాన్ని నా వెంట వుండాలని అషాఢపట్టిగా మీకు యిచ్చారు".

"అయితే ఒక కండిషన్".

"ఏంటో అది తమరే చెప్పండి".

"ఆవు వలన ఏవన్న తలనొప్పి వ్యవహారాలు జరుగుతే మాత్రం దాన్ని వెంటనే సంతకు పంపించి వేస్తాను. దానికి యిష్టమైతే ఒప్పుకుంటా".

"సరే".

"మీకు దానికి ఎలాంటి లోటు రానీకుండా చూసుకుంటా సరేనా".

"ఆఁ! నన్ను దాన్ని ఒక గుంజకు కట్టి వేశావే".

"ఛీ!... పోండి". అని అంటూ రాజేంద్రను చుట్టేసింది రజనీ.

తిరిగి ఆ గదిలో మరోసారి గాలి స్తంభించిపోయింది.

ఆకాశంలోని చంద్రుడు వీరిని చూసి చలించిపోయి మబ్బు చాటుకుపోయి తార కోసం వెతకసాగాడు.

* * * * *

తెల్లారి ఏడు గంటలు కావస్తూంది.

ప్రొద్దున్న లేచి చేయవల్సిన పనులు ఏం లేకపోవటంతో ముసుగుతన్ని పడుకున్నాడు రాజేంద్ర.

వంట యింట్లో కాఫీ తయారు చేయసాగింది రజనీ.

యింతలో రాజేంద్ర పడుకొని వున్న గదిలోకి దట్టమైన పొగ చుట్టుముట్టింది.

మగతనిద్ర పోతున్న రాజేంద్రకు ఊపిరాడక గాబరాగా లేచి కూర్చున్నాడు.

పొగ ఎక్కడ నుండి వస్తుందో తెల్సుకుందామని వెళ్ళిన రాజేంద్రకు యింటి ముందు అరుగు మీద కూర్చుని తీరిగ్గా లంక పొగాకు చుట్ట కాలుస్తున్న మామగారు దర్శనం యిచ్చాడు. వెంటనే వంటింట్లోకి కోపంగా వెళ్లాడు.

"రజనీ.... రజనీ.... నేను నిద్ర లేవలేదని దోమలకు పెట్టినట్టు పొగ పెట్టిస్తావా" అని అన్నాడు.

విషయం ఏంటో తెల్సుకున్న రజనీ చిన్నగా నవ్వుతూ "ప్రొద్దున్న అది కాల్చకపోతే మా నాన్న కార్యక్రమాలు ఏవి సాగవు". అని చెప్పింది.

విషయం అర్థం చేసుకున్న రాజేంద్ర చిన్నగా నవ్వుకున్నాడు.

"అయ్యా స్వామీ! తమకు ఏ ఫలహారం చేయమంటారో-శలవియ్యండి".

"నిన్నటి వరకు జీవిద్దామనే ఆశతో నా మీద నేను ఏం ప్రయోగాలు చేసుకోలేదు. ఈ రోజు నుండి ఈ బాడీ మొత్తం నీ హస్తగతం చేశాను. నీ యిష్టం. ఏం చేసినా తింటాను". అని అంటూ బాత్రూం వైపు నడిచాడు రాజేంద్ర!

టైం తొమ్మిది గంటలు కావటంతో ఆఫీసుకు వెళ్లాలన్న తొందరలో వున్నాడు రాజేంద్ర.

"మా నాన్నగారు ఈ పూట యింటికి వెడుతున్నారు" అని చెప్పింది రజనీ.

అంతలో మామగారు అక్కడకు వచ్చాడు చేత సంచి పట్టుకుని.

"అల్లుడుగారు నేను వెళ్ళి వస్తా".

అమ్మాయి జాగ్రత్త. కొత్త సంసారం ఏమన్నా పొరపాట్లు తెలియక చేస్తే క్షమించండి" అని అన్నాడు మామగారు.

"మీ అమ్మాయి విషయంలో మీకు ఎలాంటి ఢోకా లేదు.

కాని.... "అని నీళ్ళు నమలసాగాడు రాజేంద్ర.

"ఏమిటో అర్థం అయ్యేలా చెప్పండి".

"మీరు ఆషాఢపట్టిగా పంపిన ఆవుని పోషించటమే కాస్త యిబ్బంది అవుతుందేమో".

ఆవు విషయం ఎత్తటమే ఆలస్యం మామగారు ఆవు దాని సంరక్షణ, తీసుకోవల్సిన జాగ్రత్తలు అన్ని వివరించి చెప్పాడు.

ఆ మాటలు విన్న రాజేంద్ర తెలుగు సినిమా చూస్తున్న ప్రేక్షకుడిలా యిబ్బందిగా ఫీల్ అయ్యాడు.




యిప్పుడు ఈ విషయం ఎందుకు కదిలించానురా బాబు అని అనుకుంటూ యింట్లోంచి బయటికి వచ్చాడు.

అతని వెనకాలే మామగారు కూడా సంచి పట్టుకుని బస్టాండ్ వైపు నడువసాగాడు.

తండ్రి వెళ్ళిపోతూంటే రజనీకి దుఃఖం ఆగలేదు. ఆమెతో పాటుగా దొడ్లో వున్న మరో మూగ జంతువు కూడా ఏదో తెలియని బాధకు గురి అయ్యింది!

* * * * *

రజనీ వంట పని పూర్తి చేసుకొని ఆవుని శుభ్రంగా నీళ్ళతో కడగసాగింది.

ఉదయం పంపులో వచ్చిన నీళ్ళన్ని మొత్తం ఆవుని స్నానం చేయించటానికే ఉపయోగించింది. ఆ తరువాత దాని ముందు కాస్త గడ్డి తెచ్చి వేసింది. రజనీ చర్యలన్నిటిని ఎదురింటి బ్రహ్మానందం భార్య శ్రీలక్ష్మి గమనిస్తున్న సంగతి పాపం రజనీకి తెలియదు.

తన పని ముగించుకుని యింటి ముందు వసారాలో కూర్చుని "పత్రిక" లో సీరియల్ ఆసక్తిగా చదవసాగింది రజనీ.

"ఏవమ్మా పని పూర్తి అయ్యిందా? తీరిగ్గా కూర్చుని పత్రిక చదువుతున్నావు". అనే మాటలు వినిపించేసరికి తలెత్తి చూసింది రజనీ.

ఎదురుగా చేటలో బియ్యం పోసుకొని వాటిలో రాళ్ళు ఏరుతూ కనిపించింది శ్రీలక్ష్మి.

"ఆఁ యిప్పుడే అయ్యింది వదినా". అని సమాధానం యిచ్చింది రజని.

"అబ్బా నీ ఓపిక్కి మెచ్చుకోవాలి రజనీ. తెల్లారింది మొదలు పంపుల్లో నీళ్ళు పట్టటం. వంట పని చేసుకొని తినటంతోనే మేం సతమతం అవుతుంటే నీవు ఎంచక్కా ఆవుని సాకుతున్నావు". అని పొగిడింది శ్రీలక్ష్మి.

రాత్రి రాజేంద్ర తమ ఎదురింటి బ్రహ్మానందం అతని భార్య శ్రీలక్ష్మిల సంగతి మొత్తం వివరించి చెప్పటంతో ఆమె పొగడ్తలకు పొంగిపోకుండా చిరునవ్వు నవ్వుకుంది. "ఏదో నాకు కాలక్షేపంగా వుంటుందని మా వాళ్ళు నా వెంట పంపారు దాన్ని. అందులో మా వారికి ఆషాఢపట్టి బహుమానంగా కూడా యిచ్చారు". అని గర్వంగా చెప్పుకున్నది రజనీ!

ఆమె మాటలు విన్న శ్రీలక్ష్మికి అది ఈ వారం విశేష వార్తగా తోచింది. దీన్ని తమ కాలనీ వాళ్ళకి ఎన్ని రకాలుగానో చిత్రీకరించి చెప్పవచ్చునని అప్పుడే ప్లాన్ చేసుకోసాగింది.

తను నోరు జారిన ఆ ఒక్క మాట ఎన్ని అనర్థాలు తెచ్చి పెడ్తుందో తెల్సుకోలేకపోయింది పాపం

రజనీ!

★ ★ ★ ★ ★

మధ్యాహ్నం ఒంటి గంట వేళ....

ఆఫీస్ నుండి భోజనానికి యింటికి వచ్చాడు రాజేంద్ర! బట్టలు మార్చుకొని కాళ్ళు కడుక్కుందామని తొట్టి దగ్గరకు వెడితే అందులో ఒక చుక్క నీళ్ళు కనిపించలేదు.

ఉదయం పంపు వచ్చినపుడు తను స్వయంగా నీళ్ళు పట్టి వెళ్ళాడు. యింతలో ఆ నీళ్ళు ఎలా మాయమయ్యాయో అర్థం కాలేదు. అదే విషయాన్ని రజనీని పిల్చి అడిగాడు రాజేంద్ర!

"పాపం నిన్నంతా లారీలో దుమ్ము కొట్టుకొని ప్రయాణం చేసి వచ్చిందని ఆవుని స్నానం చేయించా నండి". అని రజనీ అమాయకంగా సమాధానం చెప్పేసరికి స్థిచ్చి కోపం వచ్చింది రాజేంద్రకు.

"అఘోరించలేకపోయావు. ఈ పట్నంలో మనుషులు త్రాగటానికే నీళ్ళు కరువుగా వుంటే నీవు టింగురంగా అంటూ పట్టిన నీళ్ళన్నీ ఆవుకి వాడేశావు. తిరిగి రేపు ఉదయం దాకా పంపులు రావు. అందాకా ఈ మడ్డి మొఖంతో నే వుండాలి.

"ఖర్మ.... ఖర్మ...." అని అంటూ భోజనం వడ్డించ మన్నాడు.

రజనీని అన్ని తిట్లు తిడుతుంటే అవి విన్న ఆవు గుర్రుమని రాజేంద్ర వైపు చూడసాగింది.

రాజేంద్రకి భోజనం వడ్డించి రజనీ బెడ్‌రూంలోకి వెళ్ళింది.

భోజనం చేస్తున్న రాజేంద్రకు వెక్కిళ్ళు వినపడసాగాయి.

అనుమానం వచ్చిన రాజేంద్ర బెడ్‌రూంలోకి తొంగి చూశాడు.

లోపల మంచం మీద పడుకొని ఏడ్వసాగింది రజనీ. తను కోపంతో తిట్టటం వల్లనే ఏడుస్తోందని గ్రహించిన రాజేంద్ర దగ్గరకు వెళ్ళాడు.

"సారీరా రాజూ! నీళ్ళు ఖర్చు చేశావన్న కోపంతో నోటికి వచ్చినట్లు మాట్లాడి సగటు భర్తలా ప్రవర్తించాను. అయినా మనం కాపురం చేసేది ఎడారిలాంటి పట్నంలో. కాస్త ముందు చూపుతో బ్రతకటం నేర్చుకోవాలి". అని శాంతంగా మాట్లాడేసరికి రజనీ బాధంతా పొగమంచులా కరిగిపోయింది.

★ ★ ★ ★ ★

రాజేంద్ర వాళ్ళు నివసిస్తున్న కాలనీలో దాదాపు పంద క్వార్టర్స్ వుంటాయి.

వాళ్ళ కంపెనీలో పనిచేసే వివిధ స్థాయి ఉద్యోగుల కోసం కంపెనీ యాజమాన్యం స్వయంగా ఈ కాలనీ ఏర్పాటు చేసింది.

తను సెక్షన్‌లో పనిచేసే బ్రహ్మానందం యింటి ఎదురుగా రాజేంద్ర యిల్లు వుండటంతో అడపా దడపా ఆడవాళ్ళు వచ్చి వెడుతుంటారు.

బ్రహ్మానందం రాజేంద్ర కన్నా ఒక సంవత్సరం సీనియర్. పెళ్ళి అయి పది సంవత్సరాలు దాటినా యింతవరకు అతను తండ్రికాలేకపోయాడు.

ఈ విషయం గురించి ఎవరన్నా కదిలిస్తే యిప్పుడిప్పుడే పిల్లలు వద్దనుకున్నాం అని సమాధానం చెప్పి తప్పించుకుంటున్నాడు!

అతని భార్య ఈ విషయంలో భర్తని నిందించకుండా పోయిన జన్మలో తాను చేసిన పాపమే యిదంతా అని నమ్మి, పూజలు, వ్రతాలు చేస్తూ కాలం గడుపుతుంది. ఆమె దినచర్యలో భాగంగా కాలనీలో వున్న యిళ్ళన్నీ చక్కబెట్టి వస్తుంది. చిన్న చిన్న విషయాలకు రంగు రంగుల మేకప్ అద్ది ప్రచారం చేయటం ఒక హాబీగా భావిస్తుంది.

ఆమె సంగతి తెల్సిన వాళ్ళెవరూ ఆమె ముందు ఏ విషయమూ నోరు జారరు. ఆమె ముందు శ్రోతలుగానే వుంటారు. ఆవిడ గురించి భర్త రాజేంద్ర రజనీకి చెప్పినా, కాస్త పొగిడేసరికి పొంగిపోయిన రజనీ "ఆషాఢ పట్టి ఆవు" గురించి నోరు జారింది.



# విద్యార్థులలో అశాంతి ఎందుకు?

## గుర్తింపు లేకపోవటం

నేటి విద్యావిధానం రోజురోజుకూ ఒక వ్యాపార వ్యవస్థగా మారిపోతున్నది. సామాన్యునికి ఈ విద్య 'గగన కుసుమం'లా తయారవుతున్నది. కళాశాలల్లో సరైన విద్యావిధానం లేకపోవటం మూలంగా ప్రైవేటు వ్యక్తుల పరమవుతోంది. రాజకీయ పార్టీలు కూడా విద్యార్థుల్లో కలుషిత వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి. చదివిన తమ చదువులకు గుర్తింపులేకపోవడం వల్ల విద్యార్థులు తీవ్రమైన అశాంతికి గురవుతున్నారు.

-టి. ప్రసన్నలక్ష్మి (తిరుపతి)



## రాజకీయాలు

విద్యార్థుల అశాంతికి గల కారణాలలో రాజకీయాలను ముఖ్యంగా చెప్పుకోవచ్చు. అంతేగాక అధ్యాపకుల బోధన కూడా అంతంత మాత్రంగానే వుంది. రాజకీయ నాయకుల ప్రభావం విద్యార్థులపై వుందనడంలో సందేహం లేదు. వారి ప్రభావం వలన విద్యార్థులు అనవసరమైన విషయాలకు సమ్మెలు చేసి వారి విలువైన కాలాన్ని వృథా చేసుకొంటున్నారు. కాలేజీలో సీట్లు, ఉద్యోగావకాశాలు డబ్బున్నవారికే లభించడం మూలంగా మెరిట్ వున్న వారికి ప్రాధాన్యత లేకుండా పోతున్నది. దీనివల్ల విద్యార్థులలో అశాంతి పెరిగిపోయి, ఏదో విధంగా ప్యాసవుదామనే తపన తప్ప మెరిట్ సంపాదించాలనే పట్టుదల చాలా మందిలో సడలిపోతున్నది.

-రేఖ (విజయవాడ)

అంతే ఆ విషయం "లాకప్ డెత్" వార్తలా క్షణాల్లో కాలనీ మొత్తం ప్రచారం చేసింది శ్రీలక్ష్మి!

* * * * *

ఆఫీస్‌లో తన సెక్షన్ ఫైళ్ళతో కుస్తీ పట్టసాగాడు రాజేంద్ర.

ప్రక్క సెక్షన్‌కు వెళ్ళిన బ్రహ్మానందం బాతాఖాని మొదలుపెట్టాడు. త్రిపిన్స్ట రాణి తన పెదిమలకు వాడే లిప్‌స్టిక్ కంపెనీ పేరు దగ్గరనుండి ఎలిజబెత్ టేలర్ "బ్రా" సైజువరకు తనకు తెలియని విషయం ఏదీ లేదంటూ అందరితో గొప్పలు చెప్పసాగాడు!

యింతలో హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చినట్లు ఫోజ్ పెడుతూ కొత్తగా పెళ్ళి అయిన యిద్దరు జూనియర్స్‌ని మొన్న ఆషాఢ మాసంలో వాళ్ళు పడ్డ కష్టాలను చెప్పమంటు వెంటపడ్డాడు.

వాళ్ళు కాస్త సీరియస్‌గా చూసేసరికి మెత్తపడ్డాడు.

"సరే బ్రదర్స్! అనుభవాలు చెప్పకపోతే మానే కనీసం ఆషాఢపట్టిగా అత్తారు ఏం బహుమతిగా పెట్టారో చెప్పండి చాలు". అని వంకర నవ్వు ఒకటి నవ్వుతూ రాజేంద్ర వంక చూశాడు.

ఆ మాటలు విన్న రాజేంద్ర ఫైళ్ళ వెనుక ఉలిక్కిపడ్డాడు. వాళ్ళు గనక తమ బహుమతి గురించి చెబుతే తనని కూడా చెప్పమంటాడని భయపడి చిన్నగా క్యాంటీన్ వైపు దారి తీశాడు!

రాజేంద్ర ఆ విధంగా బయటకు వెళ్ళటం చూసిన బ్రహ్మానందం స్టాఫ్‌నందరిని దగ్గరకు రమ్మని పిలిచి రాజేంద్రకు ఆషాఢపట్టిగా అత్తగారు ఏం బహుమతిని యిచ్చారో వివరించి చెప్పాడు.

దానితో రాజేంద్ర ఎన్ని యిబ్బందులు పడుతున్నాడో కూడా వర్ణించి చెప్పేసరికి స్టాఫంతా నోళ్ళు తెరుచుకొని వుండిపోయారు.

క్యాంటీన్ నుండి తిరిగి వస్తున్న రాజేంద్ర వంక స్టాఫంతా వింతగా చూడసాగారు.

అసలు విషయం తెలియని రాజేంద్ర తన "షర్ట్ మోడల్ గురించి చూస్తున్నారు" కాబోలు అని అనుకున్నాడు.

అత్తగారు ఆషాఢపట్టిగా ఆవుని యిచ్చినందుకు, దాన్ని ఎంతో ప్రేమగా పెట్టి పోషిస్తున్నందుకు వాళ్ళు తనని ఆ విధంగా చూస్తున్నారని రాజేంద్రకు తెల్సినట్లు అయితే వెంటనే మామగారికి టెలిగ్రాం యిచ్చి పిలిపించి భార్యకు విడాకులు యిచ్చేవాడే.

బాస్ సెక్షన్ వైపు రావటంతో ఎవరి సీట్లలో వాళ్ళు కూర్చుని బుద్ధిగా పని చేయసాగారు.

రాజేంద్ర టేబుల్ దగ్గరకు వచ్చిన బాస్

"నీవు ఒసారి లోపలకు రావాలి".

అని రాజేంద్రకు చెప్పి వెళ్ళిపోయాడు.

బాస్ స్వయంగా వచ్చి ఎందుకు పిల్చాడో అర్థం కాక గాబరాపడసాగాడు రాజేంద్ర!

బాస్ రూం వైపు మెల్లగా నడవసాగాడు.

రాజేంద్ర ఆ విధంగా వెడుతుంటే సెక్షన్‌లో వున్న మిగతా ఉద్యోగులంతా వింతగా చూడసాగారు.

స్ప్రింగ్ డోర్ తోసుకొని లోపలకు అడుగు పెట్టిన రాజేంద్రకు గదిలోని చల్లని ఏసి వాతావరణం కాళ్ళల్లో వణుకు పుట్టించింది! అది గమనించిన బాస్ తనను చూసే రాజేంద్ర ఆ విధంగా వణుకుతున్నాడని భావించసాగాడు.

"సార్! నన్ను రమ్మన్నారు ఎందుకు?"

"అవును".

"నావల్ల ఏమన్న పొరపాటు జరిగిందా సార్".

"లేదు."

"నీ పర్సనల్ విషయం గురించి".

బాస్ నోటి వెంట ఆ మాటలు వినబడేసరికి మందుపాతర మీద కాలు వేసిన వాడిలా ఉలిక్కిపడ్డాడు రాజేంద్ర!

"కొంపదీసి ఆషాఢపట్టి గురించి కాదు కదా" అని భయపడసాగాడు.

కాని రాజేంద్ర భయపడినట్లు ఏం జరుగలేదు.

"రాజేంద్రా! నీవు ఒక యింటివాడివి అయ్యావటగా. నేను శలవు మీద వున్నప్పుడు నీ పెళ్ళి అయ్యింది. అప్పుడు ఎలాగో నేను రాలేకపోయాను- హ్యాపీ మ్యారేజ్ లైఫ్.

అవును మొన్న మీ ఆవిడ్ని కాపురానికి తీసుకుని వచ్చావటగా. రేపు ఆదివారం శలవే కాబట్టి మా దంపతులిద్దరం మీ యింటికి అతిధులుగా వద్దాం అనుకుంటున్నాం". అని బాస్ అనేసరికి ప్లాట్‌ఫాం మీద ఫలహారం చేసిన వాడిలా మొఖం పెట్టాడు- రాజేంద్ర.

పైకి మాత్రం ఎంతో సంతోషం నటిస్తూ-

"అలాగే తప్పకుండా రండి సార్" అని అన్నాడు.

"ఓరి నాయనో! బాస్ రేపు యింటికి వస్తే ఆవు విషయం ప్రస్తావనకు వస్తుంది. అప్పుడు ఏం సమాధానం చెప్పాలి."

ఆషాఢపట్టిగా ఆవుని తెచ్చుకున్న వెధవని నేను మాత్రమేనని అల్లుళ్ళ సంఘం తీర్మానం చేసినట్లు బాధపడిపోతూ తన సెక్షన్ వైపు వెళ్ళిపోయాడు రాజేంద్ర!

(ఇంకా వుంది)

## ఆట

ఎక్కడ చూసినా కులమతాల కొట్లాట!
అధికారం కోసం స్వార్థపరుల కొట్లాట!
పొంగి పొరలుతోంది వాగ్దానాల ఊట!
మొదలయ్యింది రాబందుల వేట!
వచ్చేసింది ఐదు సంవత్సరాల ఓట్లాట!!

—నక్కా రాజేంద్రప్రసాద్‌గౌర

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము
...అరుదవ భాగము

(గత సంచిక తరువాయి)















... గేయరచన ...
నండూరి రామమోహనరావు
బొమ్మలు.. బాపు














మన ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ శతాబ్ది సందర్భంగా యీ ఏడు దేశంలో అనేక కార్యక్రమాలు జరుపుచున్నారు. క్రీడారంగంలో అంతర్జాతీయ స్థాయిలో రెండు పోటీలు జరుపుచున్నారు. నవంబరు 14 నుండి 19 వరకు ఏషియన్ ట్రాక్ అండ్ ఫీల్డ్ మీట్ '89 ఢిల్లీలో జవహర్‌లాల్ నెహ్రూ స్టేడియంలోను, అక్టోబరు 15 నుండి నవంబరు 2 వరకు వరల్డ్ సీరిస్ జవహర్‌లాల్ నెహ్రూ క్రికెట్ టోర్నమెంటు




ఏప్రిల్ 26వ ప్రముఖ కాంగ్రెస్ (ఐ) నాయకురాలు శ్రీమతి షీలా కౌల్ ఏడన్ గార్డెన్స్ క్లబ్ హౌస్‌లో ప్రకటన చేయుట, భారీఎత్తున జరిగే యీ పోటీల ప్రకటన విశ్వక్రికెట్ రంగంలో సంచలనం సృష్టించినది. విజేతలకు 40 వేల యు.ఎస్. డాలర్లు నగదు బహుమతిగా ప్రకటించబడినది. ఈ పోటీలు జరుపుటకు సుమారు మూడు కోట్ల వ్యయం కాగలదు. మొదటలో అస్తవ్యస్తంగా యుండినది. ఆహ్వానించిన వెస్టిండీస్,

# నెహ్రూ శతాబ్ది

# క్రికెట్, ట్రాక్ అండ్ ఫీల్డు మీట్ '89

## యం.ఆర్.ఎఫ్. వరల్డ్ సీరీస్ జవహర్‌లాల్ నెహ్రూ క్రికెట్ ఛాంపియన్ షిప్

దేశంలో అన్ని ముఖ్య నగరాలలో నిర్వహించబడును. భారీ ఎత్తున జరుగనున్న యీ రెండు క్రీడా పోటీలు మన దేశంలో యువతలో క్రీడాసక్తి పెంచకలదనియు, మన ప్రియతమ నాయకుడు ప్రియమైన క్రీడారంగంలో పోటీలు జరుపుట వారి స్మృతికి అంజలి ఘటించుట అనవచ్చును.

## జవహర్‌లాల్ నెహ్రూ క్రికెట్

అంతర్జాతీయ స్థాయిలో జరిగే యీ పోటీలో క్రికెట్ ఆటలో అగ్రగామి అయిన ఇంగ్లాండు, వెస్టిండీస్, ఆస్ట్రేలియా, పాకిస్తాన్, ఇండియా, శ్రీలంక ఆరుదేశాల మధ్య అక్టోబరు 15 నుండి నవంబరు 2 వరకు మనదేశంలో వివిధ క్రీడా కేంద్రాలు అయిన నగరాలలో 'రౌండ్ రాబిన్' పద్ధతిలో జరుగుతాయి. మొదటి పోటీ అక్టోబరు 15 ఢిల్లీలో నెహ్రూ స్టేడియంలో ఇంగ్లాండు, శ్రీలంక మధ్య జరుగుతుంది. రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ ప్రారంభిస్తారు. ఈ పోటీలు నిర్వహించుటకు ప్రత్యేక కమిటీ జగన్మోహన్ దాల్మియా కన్వీనరుగా ఏర్పడినది. యం.ఆర్.ఎఫ్. టైరుల ఉత్పత్తిదారులు ప్రోత్సాహదారులు. ఈ పోటీలు జరుపుట గురించి ఆస్ట్రేలియా పాకిస్తాన్, ఇంగ్లాండు మొదటలో అంత ఆసక్తి చూపలేదు. ఆ దేశాల జట్ల పర్యటన కార్యక్రమాలు యిదివరలోనే నిర్ణయం కాబడుట యిందుకు కారణం. మన క్రికెట్ అధినేతల కృషి, దాల్మియా ప్రయత్నాల వలన ఎట్టకేలకు అన్ని జట్లు ఆఖరి నిమిషంలో అంగీకరించాయి. వారి అభ్యర్థన మేరకు పోటీల తేదిలలో కొంత మార్పు చేయబడినది.

## పోటీ నిబంధనాలు

పోటీలు పర్యవేక్షణకు అంతర్జాతీయ అంపైరులను ఎంపిక చేస్తారు. పోటీలో పాల్గొను అన్ని దేశాల అంపైరులకు అవకాశము యిస్తారు. ప్రతి జట్టులో 14 మంది ఆటగాళ్ళను అనుమతిస్తారు, ఒక ఫిజియోథెరపిస్ట్, ఒక క్రికెట్ మేనేజరు, ఒక టీమ్ మేనేజరులను తీసుకొని రావచ్చును. పోటీ 50 ఓవరుల పద్ధతిలో, వరల్డ్ కప్ నిబంధనలు ప్రకారం అనగా బౌలరు, వికెట్ కీపరు, 4గురు ఆటగాళ్లు ఇన్నింగు పూర్తి అయ్యేవరకు 'సర్కిల్'లో యుండాలి.

రౌండు రాబిన్ పోటీలో విజేతకు 4 పాయింట్లు, టై లేక 'నో రిజల్టు'కు చెరి 2 పాయింట్లు లభిస్తాయి. ప్రథమ స్థానములో యున్న 4 జట్ల మధ్య సెమీఫైనల్సు ఆడ్తాయి. వర్షము వలన లేక ఏ యితర కారణం వలన సెమీఫైనల్సు జరగనిచో మొదటి 1,2 స్థానములలో యున్న జట్లు 'ఫైనలు'లో పాల్గొంటాయి. ఫైనలు పోటీ ఏదైన కారణముచే జరగనిచో రెండు జట్లను జాయింటు 'విన్నర్సు'గా నిర్ణయిస్తారు.

## పోటీల కార్యక్రమం

| | | | | |
|---|---|---|---|---|
| 1989అక్టోబరు | 15 | ఢిల్లీ | ఇంగ్లాండు | శ్రీలంక |
| | 19 | హైదరాబాద్ | ఆస్ట్రేలియా | ఇంగ్లాండు |
| | 19 | రాజకోట | వెస్టిండీస్ | శ్రీలంక |
| | 21 | మద్రాసు | వెస్టిండీస్ | ఆస్ట్రేలియా |
| | 22 | అహమ్మదాబాద్ | ఇండియా | శ్రీలంక |
| | 22 | కటక్ | పాకిస్తాన్ | ఇంగ్లాండు |
| | 23 | ఢిల్లీ | ఇండియా | వెస్టిండీస్ |
| | 23 | బొంబాయి | పాకిస్తాన్ | ఆస్ట్రేలియా |
| | 25 | కాన్పూరు | ఇండియా | ఇంగ్లాండు |
| | 25 | చండీఘర్ | పాకిస్తాన్ | వెస్టిండీస్ |
| | 25 | గోవా | ఆస్ట్రేలియా | శ్రీలంక |
| | 27 | బెంగుళూరు | ఇండియా | ఆస్ట్రేలియా |
| | 27 | లక్నో | పాకిస్తాన్ | శ్రీలంక |
| | 27 | గ్వాలియర్ | ఇంగ్లాండు | వెస్టిండీస్ |
| | 28 | కలకత్తా | ఇండియా | పాకిస్తాన్ |
| | 30 | బొంబాయి | సెమీఫైనల్సు | 1,3స్థానములమధ్య |
| | 30 | నాగపూర్ | సెమీఫైనల్సు | 2,4స్థానములమధ్య |
| నవంబరు | 1 | కలకత్తా | మూడు,నాల్గవ స్థానములకుపోటీ | |
| | 2 | కలకత్తా | ఫైనలు | |

# ఏషియన్ ట్రాక్ అండ్ ఫీల్డ్ మీట్ '89

నవంబరు 14 నుండి 19 వరకు ఢిల్లీ నెహ్రూ స్టేడియంలో 8వ ఆసియా ట్రాక్ అండ్ ఫీల్డ్ మీట్ జరుగుతుంది. ఆసియా దేశాల అగ్రగామి ఎథలిట్స్ పాల్గొను యీ పోటీ 1982 ఆసియా క్రీడోత్సవాల అనంతరం మన భూభాగముపై జరుగనున్న భారీ పోటీ. షుమారు 40 దేశాలనుండి స్త్రీ, పురుష ఎథలెట్స్ యీ పోటీలో పాల్గొంటారు. చైనా, జపాన్, దక్షిణ, ఉత్తరకొరియాలు, తైవాన్‌లుకూడా తమ అంగీకారం తెల్పారు.

## ట్రాక్ యీవెంట్స్

100 మీ, 200 మీ, 400 మీ, 800 మీ, 1500 మీ. పరుగు స్త్రీ, పురుషులకు 3000 మీ, 10,000 మీ. స్త్రీలకు.

5000 మీ, 10,000 మీ. పురుషులకు.

3000 మీ. స్టీపుల్‌ఛేజ్ పురుషులకు.

మారథాన్ స్త్రీ, పురుషులకు.

110 మీ, 400 మీ. హర్డిల్సు పురుషులకు.

100 మీ, 400 మీ హర్డిల్సు స్త్రీలకు.

4x 100 మీ, 4x 200 మీ, 4x 400 మీ. రిలే స్త్రీ, పురుషులకు.

10 కి.మీ. నడక స్త్రీలకు, 20 కి.మీ. నడక పురుషులకు.

## ఫీల్డ్ యీవెంట్స్

హైజంప్, లాంగ్‌జంప్, ట్రిపుల్‌జంప్, షాట్‌పుట్, జావలీన్‌త్రో స్త్రీ, పురుషులకు.

పోల్‌వాల్ట్, డిస్కస్‌త్రో, హమర్‌త్రో పురుషులకు.

డికాత్లన్ పురుషులకు, హెపతాత్లన్ స్త్రీలకు నిర్వహించబడతాయి.

1951 లో ప్రధమ, 1982 లో తొమ్మిదవ ఆసియా క్రీడోత్సవాలు, 'సాఫ్‌గేమ్స్', పర్మిట్‌మీట్ '87, ప్రీ ఒలింపిక్ మీట్ '88 మొదలగు అనేక అంతర్జాతీయ ఎథలిటిక్ మీట్‌లు మన భూభాగంపై యింతవరకు జరిగాయి. పర్మిట్ మీట్ '87, ప్రీ-ఒలింపిక్ మీట్ '88 సందర్భములో ప్రపంచ అగ్రగామి ఎథలెట్స్ పాల్గొనుట ఒక మరువలేని అనుభూతి. విశ్వ అగ్రగామిలను చూచే అవకాశము మనదేశంలో అనేకులకు కలిగినది. 1982 ఆసియా క్రీడోత్సవాల సందర్భములో నిర్మించబడిన క్రీడాంగణములు ఢిల్లీ వచ్చేవారికి ప్రత్యేక ఆకర్షణ. ఈ క్రీడా పోటీలు ఆసియా దేశస్థులమధ్య స్నేహభావం పెంపొందించగలవు. రాబోవు బీజింగ్ ఆసియా క్రీడోత్సవాలకు యిప్పుడు జరిగే పోటీ క్రీడాకారులు తమ ప్రతిభ తెలుసుకొనుటకు అవకాశం కల్పిస్తుంది.




## జవహర్ జ్యోత్

ట్రాక్ అండ్ ఫీల్డ్ ఆసియా పోటీలు నవంబరు 14 న ఢిల్లీ నెహ్రూ స్టేడియంలో 'జవహర్ జ్యోత్' వెలిగించుటతో ప్రారంభమవుతాయి. దీనిని మన భవిష్యత్తు జ్యోతి అనికూడా నిర్వాహకులు అంటున్నారు. క్రీడా పోటీలు ఆశయం, ఆసియా దేశస్తుల మధ్య స్నేహం పెంపొందించుటకు యిది ఆశాజ్యోతి అంటున్నారు. జవహర్‌జ్యోతి దేశము నాలుగు మూలలు, కన్యాకుమారి నుండి అక్టోబరు 2, గోవా అక్టోబరు 19, కలకత్తా అక్టోబరు 22, శ్రీనగర్ అక్టోబరు 29న ప్రయాణం ప్రారంభించి దేశం ముఖ్య ప్రాంతాలు, నగరాలద్వారా జవహరలాల్ నెహ్రూ ఆశయాలను ప్రచారము చేసుకుంటూ నవంబరు 13న ఢిల్లీలో త్రిమూర్తిభవన్ (జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా నివశించిన భవనం) వద్ద చేరుకుంటుంది. దేశంలోని వృద్ధ, అగ్రగామి, వర్ధమాన క్రీడాకారులు యీ కాగడా యాత్రలలో పాల్గొంటారు. క్రీడా నిర్వాహకులు, రచయితలుకూడా ఆహ్వానించబడ్డారు. మిల్కాసింగ్, పి.టి. ఉష, ప్రకాష్ పడ్కోన్‌లను ప్రత్యేకముగా పిలిచారు. సునీల్‌గవాస్కర్ 'కాగడా'ను ఢిల్లీలో అందుకొని ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్‌కు అప్పగిస్తారు. కాగడాల ప్రయాణ సమయంలో 'క్రీడాకారుల సహాయార్థ నిధి' ప్రజలనుండి సేకరిస్తారు.




## చిహ్నం

ఈ మీట్ సందర్భములో నిర్వాహకులు ప్రత్యేక చిహ్నంకూడా రూపొందించారు. మానవుడు ఆశించే 'స్వేచ్ఛ'కు గుర్తుగా 'సీతాకోక చిలుక' ఎగురుట, దానిని రక్షించు రెండు హస్తాలు యీ చిహ్నం. సీతాకోక చిలుక, రెండు హస్తాలు మన జాతీయ జెండాలోగల మూడు రంగులు కలిగియుంటాయి. 'ట్రాక్ అండ్ ఫ్రెండ్‌షిప్' అనే వాక్యంక్రింద యుంటుంది.

ఈ పోటీలను ఇండియన్ టుబాకో కంపెనీ (ఐ.టి.సి.) దాని అనుబంధ వ్యాపార సంస్థలు సంయుక్తముగా నిర్వహించుచున్నవి.

ఎథలిటిక్స్ రంగంలో మన మహిళా క్రీడాకారిణిలు అగ్రస్థానంలో యింతవరకు యున్నారు. యీ పోటీలలోకూడా వారు తమ ఆధిక్యత నిలబెట్టుకొనగల అవకాశము యున్నది.

- ముకరమ్

సీరియల్

# పంచశూలమ్

## విశ్వ ప్రసాద్

**94**

(గత సంచిక తరువాయి)

ఇంతవరకూ సాగిన కథ-24 : పంచశూలమ్ పంపిన యువకుడు 'షా'గా చెలామణీ అవుతూ జోషీ కేసు దర్యాప్తు చేస్తుంటాడు. గురూజీ కూతురు మీనాక్షి, జయరాజ్ కొడుకు మోహన్‌లు మరణిస్తారు. జయరాజ్ భార్య పరిమళను మదన్, గురూజీ భార్య విశాలాక్షిని సుభాష్ హతమారుస్తారు. పంచశూలమ్ సన్మాన సభలో బాంబు ప్రేలి జయరాజ్ తల పగిలిపోతుంది. అందర్నీ పోగొట్టుకొని ఒంటరివాడైన గురూజీ విదేశాలకు పారిపోదామని ప్రయత్నించి పంచశూలమ్‌గా పేరు మార్చుకున్న జోషి చేతిలో చిక్కుతాడు. జోషి బృందం పెట్టిన చిత్రవధకు తట్టుకోలేక పాతికేళ్ల క్రితం జరిగిన భారత్ బ్యాంక్ దోపిడీ ఎవరు చేశారో వివరించేందుకు గురూజీ అంగీకరిస్తాడు.

గురూజీ చెప్పనారంభించాడు:-

"అప్పట్లో- అంటే 25 సంవత్సరాల క్రిందట-

"దేవీ యింపోర్ట్ అండ్ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ చాలా డౌన్‌లో ఉంది. అప్పులు ఎక్కువైపోయాయి. ఆ దిగులుతో దీప తండ్రి గుండె ఆగి చనిపోయాడు.

"దీప యజమానురాలయింది. కంపెనీ దివాలా తీసే పరిస్థితిలో ఉందని తెలుసుకుంది.

"ఆ కంపెనీలో అందరికంటే తెలివైన వాడిని నేనే. నా సలహా లేనిది ఒక్క అడుగు కూడా వేసేది కాదు దీప. కంపెనీని నిలబెట్టమని ప్రాధేయపడింది.

"అదే సమయంలో-

"మద్రాసు భారత్ బ్యాంక్‌కు మేనేజర్‌గా వచ్చాడు జోషీ.

"నా సలహా ప్రకారం యిద్దరు ముగ్గురు అమ్మాయిల్ని అతనికి ఎరగా వేసింది దీప. బ్యాంక్ నుండి దఫ దఫాలుగా పది లక్షల రూపాయలు అప్పు తీసుకుంది.

"ఆ డబ్బు వల్ల కూడా కంపెనీ నిలబడలేదు. బ్యాంక్ అప్పు తీర్చడానికి మార్గాలు లేవు. దీపను అరెస్ట్ చేసే పరిస్థితి ఏర్పడింది.

"మళ్లీ ప్లాన్ చేశాను. బ్యాంక్‌నే దోచుకోవడానికి పథకం వేశాను. దీపకు నా ప్లాన్ నచ్చింది. అంతకంటే మరో మార్గం కనిపించలేదు ఆమెకు.

"మా ఆఫీసులో విశాలాక్షి, పరిమళలు చాలా అందగత్తెలు. పరిమళంటే మహా యిష్టం జయరాజ్‌కు. నాకు విశాలాక్షి అంటే ప్రాణం. ఈ విషయం కూడా దీపకు చెప్పాను.

"మా నలుగుర్నీ సమావేశపరచింది దీప. విశాలాక్షి, పరిమళలను ఒప్పించింది. మాకు పెళ్ళిళ్ళు చేస్తానంది. ప్రతి ఒక్కరిలోను ఏదో ఒక లోపం ఉంది. అది బైట పడకుండా ఉండటానికి అంతా ఆమె చెప్పినట్లు ఒప్పుకున్నారు.

"జోషీ, కేషియర్, అక్కౌంటెంట్‌లకు సంబంధించిన కొన్ని వస్తువులు, బ్యాంక్ తాళాలు సంగ్రహించాము. విశాలాక్షి, పరిమళలకు బురఖాలు వేశాము. అక్కౌంటెంట్‌లా వేషం వేసుకుంది దీప. కేషియర్‌లా తయారయ్యాడు జయరాజ్. నేను జోషీలా మేకప్ చేసుకున్నాను.

"ఐదుగురం బ్యాంకుకెళ్ళాము. కోటి రూపాయలు దొంగిలించాము. గూర్ఖాను పొడిచాను నేను. అంతా తప్పించుకున్నాము.

"కేషియర్, అక్కౌంటెంట్, మేనేజరు జోషీలను పోలీసులు అరెస్ట్ చేశారు. రిమాండ్‌లో ఉండగా-పోలీసులు పెట్టే బాధలు భరించలేక అకౌంటెంటు, కేషియర్లు చనిపోయారు. శిక్షపడిన మర్నాడు జైల్లోంచి పారిపోయాడు జోషీ.

"తన 'దేవీ యింపోర్ట్ అండ్ ఎక్స్‌పోర్ట్' కంపెనీని మూసేసింది దీప. అలా చెయ్యమని నేనే సలహా యిచ్చాను.

"జయరాజ్‌ని పెళ్ళి చేసుకుంది పరిమళ.

"నేను విశాలాక్షిని వివాహం చేసుకున్నాను.

"మద్రాసు నుండి మకాం మారుద్దామన్నాను. అంతా అంగీకరించారు.

"అంతవరకు భూమిలో పాతిపెట్టిన కేష్ బాక్స్ బైటకు తీశాము. మూడు వాటాలు వేసింది దీప. ఒకటి తనకు, మరొకటి జయరాజ్- పరిమళలకు, మూడోది నాకు- విశాలాక్షికి యిచ్చింది.

"ఒకరి తర్వాత మరొకరం హైద్రాబాదు చేరుకున్నాం. ఓ సంవత్సరం పాటు గుట్టుగా జీవితాలు గడిపాము.

"తర్వాత-

"చిట్‌ఫండ్స్ అండ్ ఫైనాన్సింగ్ కంపెనీ పెట్టాడు జయరాజ్.

"నేను ఎక్స్‌పోర్ట్ అండ్ యింపోర్ట్ బిజినెస్ ప్రారంభించాను.

"ఏదో ప్రోబ్లమ్ లేకుండా ఏ రోజూ నిద్రపోలేదు దీప. అందుకే రాజకీయాల్లో ప్రవేశించింది. రెండుసార్లు ఎమ్మెల్యే అయింది.

"కానీ, మేము ఐదుగురం కలిసి జోషీ సార్‌కు అన్యాయం చేశాము...."

ఇంకా ఏదో చెబుతోన్నాడు గురూజీ.

ఇంతలో -

నలువైపుల నుండి నాలుగు సెర్చ్‌లైట్లు వెలిగాయి. అందరూ ఉలిక్కిపడ్డారు.

పోలీసులు చుట్టుముట్టారని అర్థం చేసుకున్నాడు జోషీ. "బేబీ! బుట్ట తీసుకో" అన్నాడు.

గురూజీ గుండెల మీద ఉన్న పాముల బుట్ట తీసుకుంది సోఫియా.

పైకి లేచాడు గురూజీ. అటూ యిటూ చూచాడు. కాలికొద్దీ పరుగెత్తబోయాడు. అబ్దుల్లా శవం కాలికి తగిలింది. బోర్లా పడ్డాడు. అంతలోనే లేచి శక్తికొద్దీ పరుగెత్తనారంభించాడు గురూజీ.

చేతిలోని కత్తి సవరించుకున్నాడు మదన్. అతని వీపుకు గురి చూసి విసిరాడు.

కత్తి వెళ్ళి గురూజీ వెన్నులో దిగింది. కెవ్వున అరిచాడు.

అంతలోనే సుభాష్ చేతిలోని రివాల్వర్ రెండుసార్లు గర్జించింది. రెండు గుళ్ళూ గురూజీ వీపులో దిగాయి.

చావు కేకపెట్టి తిరిగి బోర్లాపడిపోయాడు గురూజీ!

అదే సమయంలో నలువైపుల నుండి గాలిలోకి కాల్పులు సాగించారు పోలీసులు.

"మై సన్స్! మన యజ్ఞం పూర్తయింది. మీ తండ్రికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకున్నారు. ఐయాం వెరీ ప్రౌడ్ ఆఫ్ యు, మై సన్స్". అని, రెడ్ పైప్ దూరంగా విసిరేసి, చేతులు పైకెత్తాడు జోషీ.

హోం డిపార్టుమెంటు వారిచ్చిన 'మెడల్' సెర్చ్‌లైట్ల కాంతిలో ధగధగ మెరుస్తోంది! అంతకంటే ఆనందంగా, తృప్తిగా మిలమిల మెరుస్తోంది అతని ముఖం! పెదవుల మీద చిరునవ్వులు నాట్యం చేస్తున్నాయి!!

అతనికి సపోర్ట్ చెయ్యాలని వచ్చి- దూర దూరంలో; చెట్ల మీద, కొండల మీద పొంచి ఉన్న గూండాలు తమ ప్రయత్నం విరమించుకున్నారు.

"శూలమ్ సాబ్! ఈ పోలీసులందర్నీ ఓ చూపు చూసేస్తాను. మూడు చెరువుల నీళ్ళు తాగించేస్తాను. మట్టి కరిపించేస్తాను. పర్మిషన్ యివ్వండి". తన మామూలు ధోరణిలో అంటూ, కోటు జేబుల్లోంచి గ్రెనేడ్స్, హేండ్ బాంబులు తీశాడు మదన్.

"డాడీ! పోలీసువాళ్ళ కళ్ళు కప్పి, యింతవరకు ఎన్నెన్నో పనులు చేశాము. వీళ్ళ నుండి తప్పించుకోవడం పెద్ద సంగతి కాదు.... ముఖాముఖి పోరాడతాం. పర్మిషన్ యివ్వండి." అన్నాడు సుభాష్.

"మై గుడ్ సన్స్! తప్పు చెయ్యనప్పుడు ధైర్యంగా జైల్లోంచి తప్పించుకున్నాను. ఈనాడు మనమంతా అపరాధాలు చేశాము. శిక్ష అనుభవించక తప్పదు" అన్నాడు శాంత గంభీర కంఠస్వరంతో జోషీ.



"అంకుల్....!" ఏదో అనబోయారు- ఊర్వశి, సోఫియాలు.

"నో కామెంట్స్.... నో ఆర్గ్యుమెంట్స్". శాసిస్తున్నట్లు అన్నాడు జోషీ.

అతని నిశ్చయాన్ని వినగానే మదన్, సుభాష్, ఊర్వశి, సోఫియాలు చేతులు పైకెత్తి నిలుచున్నారు.

ఇంతలో-

## 'కాల్‌గర్ల్'గా సోనమ్

సెక్సీ తార సోనమ్‌ను పరిశ్రమలోని వారు అంతగా పట్టించుకోవటం లేదట. పహ్లాజ్ నిహ్లానీ తీస్తున్న ఒక బెంగాలీ చిత్రంలో నటిస్తున్న సోనమ్ షూటింగ్ సందర్భంగా తన కాస్ట్యూమ్ ఒకటి రావటం ఆలస్యమై పోయినప్పటికీ దాన్ని గురించి ఆరా తీసిన నాథుడే లేడట. పరిశ్రమలో తన పట్ల చూపుతున్న నిరాదరణకు ఈ ఒక్క ఉదాహరణ చాలంటోంది సోనమ్.

'మిట్టీ ఔర్ సోనా' చిత్రంలో మాత్రం సోనమ్‌ని పూర్తిగా 'వినియోగించు'కున్నారట. ఈ చిత్రంలో



సోనమ్‌ది 'బజారు అమ్మాయి' (కాల్‌గర్ల్) పాత్రట. తగిన పాత్రే దొరికిందిలే అని సంతోషపడుతున్నదట ఈ తార.

ఓ వైపు నుండి పోలీసు వేన్ వారి దగ్గరకు వచ్చింది. రివాల్వర్లు, తుపాకులు పట్టుకుని కిందకు దిగారు. ఇన్‌స్పెక్టర్‌లు, కానిస్టేబుల్సు, జోషీ బృందాన్ని చుట్టుముట్టారు.

మరో వైపు నుండి ఓ పోలీసు కారు వచ్చింది.

అందులోంచి ఐ. జి. మహేంద్ర, సి. బి. ఐ. డైరెక్టరు ఆదిత్య దిగారు.

ఇద్దరు ఇన్‌స్పెక్టర్లు, పదిమంది కానిస్టేబుల్సు ముందుకు వచ్చారు. ఒక్కొక్కరి చేతులకు సంకెళ్ళు తగిలించనారంభించారు.

"సారీ, మిస్టర్ జోషీ!" తన విచారాన్ని వ్యక్తపరచాడు మహేంద్ర.

"వెరీ వెరీ సారీ జంటిల్‌మాన్!" అన్నాడు ఆదిత్య.

"నో రిగ్రేట్స్.... జరిగిన దానికి విచారించడంలేదు నేను. జరగబోయే దానికి భయపడటంలేదు. ఐయాం వెరీ హ్యాపీ" అంటూ, విలాసంగా మీసాలు దువ్వుకుంటూ వేన్ వైపు నడిచాడు జోషీ!

## 95

న్యాయస్థానం.

నోరున్నవాళ్ళకు ఆటస్థలం.

నోరు లేని వాళ్ళకు- అది; మహాప్రస్థానం.

బోనులో నిలుచున్నాడు జోషీ. భగవద్గీత మీద ప్రమాణం చేశాడు. ఓమారు కోర్టంతా పరీక్షగా చూశాడు.

పురప్రముఖులు, ప్రజా నాయకులు, రాజకీయవేత్తలు, పత్రికావిలేఖరులు, తనకు పరిచయమున్న గూండాలు, రౌడీలు- ఎంతో మంది కోర్టు లోపల, బైట ఉన్నారు.

అతను కోరిన ప్రకారం- రిమాండ్‌లో ఉన్న మదన్, సుభాష్, ఊర్వశి, సోఫియాలను తీసుకు వచ్చి ఓ బెంచీ మీద కూర్చోబెట్టారు కోర్టువారు.

పోలీసువారు, సి. ఐ. డీ. లు కోర్టు లోపల, బైట కాపలా కాస్తున్నారు.

ఓ ఇన్‌స్పెక్టర్ పాముల బుట్ట తెచ్చి, జడ్జి ముందు ఓ టేబుల్ మీద పెట్టాడు.

బుట్ట తెరిచాడు సార్జంటు.

అందులోంచి 'బుస్' అని శబ్దం చేస్తూ, తల పైకెత్తింది ఓ ప్లాస్టిక్ పాము! ఆ పాములోనే మినీ టేప్ రికార్డర్ ఉంది!!!

దానిని ఆన్ చేశాడు సార్జంట్.

గురూజీ ఇచ్చిన స్టేట్‌మెంట్ విన్నారు- జడ్జితో సహా కోర్టువారంతా.

తర్వాత-

జోషీ ఇలా అన్నాడు:-

"మైలార్డ్! జీవరాశుల్లో మానవ జీవితానికి మహోన్నతమైన విలువ ఉంది. సృష్టిలోని జీవులన్నిటి కంటే ఉత్కృష్టమైనది మానవజన్మ. ప్రతి మానవుడు తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. అదే ఆశయంతో జీవితాన్ని ప్రారంభిస్తాడు మానవుడు.

"కాని పెంపకం, పరిసరాలు, పరిస్థితులు మానవుల్ని మారుస్తాయి.

"విదేశాల్లో చదువుకుని, ఎన్నో ఆశలతో, ఆశయాలతో ఇండియాకు వచ్చాను నేను. బ్యాంక్ ఉద్యోగిగా ఉంటూ, దేశంలోని ఆర్థిక పరిస్థితుల్లో ఎన్నెన్నో మార్పులు చెయ్యాలనుకున్నాను. వెనకబడిన వర్గాలవారిని, వ్యాపారస్తుల్ని ఉద్ధరించాలనుకున్నాను. అదే ఆశయంతో నా జీవితాన్ని ప్రారంభించాను.

"కాని, మై లార్డ్!"

"యవ్వన దశ మానవులకు పరీక్షా సమయం లాంటిది. రక్తం పొంగుతుంది. యవ్వనం బుసలుకొడుతుంది. మనసు చలిస్తుంది. శరీరం నిగ్రహాన్ని కోల్పోతుంది. కాని, ఆ సమయంలోనే మానవుడు తన మనసును అదుపులో పెట్టుకోవాలి. జీవితానికి దృఢమైన పునాదులు వేసుకోవాలి. పటిష్టమైన చరిత్రను సృష్టించుకోవాలి.

"ఆ సమయంలో మనసును నిగ్రహించుకుని, చరిత్రను పటిష్టం చేసుకోకపోతే, అప్పుడు చేసిన తప్పులు బతికినంత కాలం పీడిస్తూనే ఉంటాయి. జీవితాంతం వేదనకు, బాధకు గురి చేస్తాయి. భవిష్యత్తును నాశనం చేస్తాయి.

"యవ్వనంలో తప్పు చేశాను నేను. పరిమళ, విశాలాక్షి- ఇద్దరితోను సంపర్కం పెట్టుకున్నాను. అయితే, ఇద్దరికీ నేనంటే ఇష్టమే, ప్రాణమే. నేను కూడా ఇద్దరినీ అమితంగా ప్రేమించాను. అదే నేను చేసిన పెద్ద పొరపాటు.

"నా సంపర్కంలో మదన్ని ప్రసవించింది పరిమళ. కాని, బిడ్డ పుట్టడం అపరాధ మనుకుని, ఓ భిక్షగత్తె ముఖాన్న పారేసింది.

"సుభాష్‌ని కన్నది విశాలాక్షి. ఓ ఆయా ద్వారా అతన్ని పెద్దవాణ్ణి చేశాను.

"దీపకు, ఆమెకు ప్రతిక్షణం సలహాలిచ్చే గుర్నాధానికి ఈ విషయాలన్నీ తెలుసు. వాళ్ళిద్దరు పరోక్షంగా ఉండి, విశాలాక్షి, పరిమళలను రెచ్చగొట్టారు. ఇద్దరూ పెళ్ళి చేసుకోమని అడిగారు నన్ను.... ఇద్దర్నీ చేసుకుంటానన్నాను. కాని వాళ్ళు ఇష్టపడలేదు. సవతి పోరు ఉండకూడ దన్నారు.

"ఆ మాటలు వాళ్ళు మనస్ఫూర్తిగా చెప్పినవికావు. ఎన్నో రాత్రులు ఇద్దరూ కలసి నా పక్కన పడుకున్నారు. వాళ్ళిద్దరి మధ్య ద్వేషం, అసూయలు లేవు. ఒకరు సుఖపడితే, మరొకరు ఆనందించేవారు. ఒకరికోసం మరొకరు ఎన్నెన్నో త్యాగాలు చేశారు. అలాంటి వాళ్ళకు అన్యాయం చెయ్యకూడ దనుకున్నాను.

"కాని, గుర్నాథం పెట్టిన లిటికేషన్స్ వల్ల, దీప చెప్పుడు మాటలు విని విశాలాక్షి, పరిమళలు అన్యాయం చేశారు నాకు. కోర్టులో నాకు వ్యతిరేకంగా సాక్ష్యాలు చెప్పారు. నేను తలచుకుంటే, వాళ్ళందర్నీ ఆ సమయంలోనే ఉరికంబ మెక్కించే వాడిని. కాని, విశాలాక్షి, పరిమళల జీవితాలు నాశనం చెయ్యడానికి మనస్కరించ లేదు. వాళ్ళ మీద, వాళ్ళ నిస్సహాయ పరిస్థితి మీద జాలి వేసింది. అందుకే, కోర్టులో మౌనం వహించాను.

"వాళ్ళిద్దరకు నాతో సంబంధం ఉందని జయరాజ్, గుర్నాధాలకు క్షుణ్ణంగా తెలుసు. అయినా తెలియనట్లు నటించారు. కక్కిన కూటికి ఆశపడిన కుక్కలు వాళ్ళు. వాళ్ళకు కావలసింది డబ్బు, ఆనందం...

"మైలార్డ్!"

"బ్యాంక్ దోపిడీ నేను చెయ్యలేదు. కాని, నేను నిర్దోషినని కోర్టులో నిరూపించుకో లేదు. కోర్టువారు శిక్ష వేశారు- చట్ట ప్రకారం. మొదటి రోజున జైల్లోంచి పారిపోవాలనే ఉద్దేశం లేదు నాకు. కాని, ఎప్పటికైనా- పరిమళ, విశాలాక్షి, దీప, జయరాజ్, గురునాధాలకు బుద్ధి చెప్పాలనుకున్నాను. అందుకే జైల్లోంచి

పారిపోయాను. మొదట్లో విశాలాక్షి, పరిమళల మీద నాకు జాలికలిగినా, ప్రేమ ఉన్నా వాళ్ళు చేసిన మోసానికి, ద్రోహానికి– భరించలేని, ప్రతీకార జ్వాలలు చెలరేగాయి నాలో. నాకు అన్యాయం చేసిన ఆ ఐదుగుర్నీ హతమార్చాలని ప్రతిజ్ఞ పూనాను. ఏనాటికైనా వాళ్ళను అంతం చెయ్యాలని నిశ్చయించుకున్నాను.

"మైలార్డ్!"

"మద్రాసునుండి బొంబాయి వెళ్ళి పోయాను. పేరు మార్చుకున్నాను. 'పంచశూలమ్' అని పచ్చబొట్టు పొడిపించుకున్నాను. కాంటాక్ట్ గ్లాసులు పెట్టుకున్నాను. తేనె కళ్ళను నల్లగా చేసుకున్నాను."

అని కళ్ళలోంచి కాంటాక్ట్ గ్లాసులు తీశాడు జోషి. తేనె రంగులో తళతళ మెరుస్తున్నాయి అతని కళ్ళు.

ఆ కళ్ళలోని అందం, ఆకర్షణ చూసి, అక్కడున్న వారంతా ఆశ్చర్యపోయారు. ఆ కళ్ళను చూస్తే ఎలాంటి స్త్రీ అయినా మోజుపడుతుందనిపించింది– కోర్టులోని వారికి.

తిరిగి చెప్పనారంభించాడు జోషి.

"మైలార్డ్! నా ముక్కు మొనదేరి ఉండేది. కాని, ప్లాస్టిక్ సర్జరీ ద్వారా తప్పడగా చేయించుకున్నాను.

"ఇహ యిండియాలో ఉండటానికి మనస్కరించలేదు. పంచశూలమ్ పేరు మీద పాస్‌పోర్ట్ తీసుకున్నాను. ఫారిన్ వెళ్ళిపోయాను. దేశదేశాల్లో ఉన్న నా మిత్రుల్ని కలుసుకున్నాను. ఇరవై సంవత్సరాలు గడిపాను. డబ్బు సంపాదించాను. తిరిగి యిండియాకు వచ్చాను. పంచామృతం హోటల్లో పార్ట్‌నర్‌గా చేరాను. సుభాష్‌ని మెకానికల్ ఇంజనీరింగ్ చదివించాను. విదేశాలకు పంపించాను. సోఫియా తండ్రి పోలీసు ఆఫీసరు. ఆరునెల్లు ఇంగ్లాండులో వాళ్ళ యింట్లో ఉండి పోలీసు డిపార్ట్‌మెంటులోని మెలుకువలు తెలుసుకున్నాడు సుభాష్. ఇండియాకు రాగానే అతని చేత స్కూటర్స్ ఫ్యాక్టరీ పెట్టించాను.

"ఒకనాడు మదన్ నా దగ్గరకు వచ్చాడు. ఎవరూ చెయ్యలేని నేరాలు తను చేస్తానని, అవసరమైతే తనను ఉపయోగించుకోమని ఛాలెంజ్ చేశాడు. అతన్ని చూసేసరికి పరిమళ గుర్తుకొచ్చింది నాకు. ఇద్దరి ముఖాల్లోను దగ్గర పోలికలున్నాయి. రక-రకాల ప్రశ్నలు వేసి అతని జీవిత చరిత్ర తెలుసుకున్నాను. నావల్ల పరిమళకు కలిగిన కొడుకు అతనే అని నిశ్చయించుకున్నాను. నేరాలు చెయ్యడం విడిచిపెట్టేయమన్నాను. పంచామృతం హోటల్లో నా పేరిట ఉన్న వాటాలో సగం అతనికిస్తానన్నాను. ఇతరుల డబ్బు పూరకే తీసుకునే అలవాటు లేదన్నాడు. నేరాలు చెయ్యకపోతే తనకు నిద్రపట్టదన్నాడు. నేను యిచ్చిన ఆఫర్ నిరాకరించాడు.

"మైలార్డ్! మదన్‌లోని మూర్ఖత్వం, అజ్ఞానం అర్థం చేసుకునేసరికి నాలో తిరిగి అగ్నిజ్వాలలు రగులుకున్నాయి. తల్లి, తండ్రి చేసిన తప్పుల వలన అతని జీవితం నాశనమై పోయింది ఆప్యాయతకు, మమకారాలకు దూరమై మొరటు మనిషిగా తయారయ్యాడు. అతన్ని ఉద్ధరించడం భగవంతునికి కూడా సాధ్యం కాదనిపించింది.

"చేతిమీది పచ్చబొట్టు చూసుకుంటుంటే ప్రతిక్షణం నాలోని ప్రతీకార జ్వాలలు రగిలి, పెరుగుతూనే ఉన్నాయి. క్రమంగా ఆ జ్వాలలు నన్నే దహించనారంభించాయి. ఏదో క్షణంలో గుండెలు మండిపోయి, చచ్చిపోతాననిపించింది.

"వెంటనే రణరంగంలోకి దిగాను. నా కొడుకుల్నే ఆయుధాలుగా ఉపయోగించుకున్నాను.

"తమ్ముడిలాంటి మోహన్ని, కన్నతల్లి పరిమళను చంపాడు మదన్.

"చెల్లెలులాంటి మీనాక్షి కళ్ళు పొడిచాడు సుభాష్. తల్లి విశాలాక్షిని చిత్రవధ చేసి చంపాడు.

# పంచశూలమ్

"నన్ను చంపాలని మైక్‌లో బాంబుపెట్టాడు అబ్దుల్లా. అది జయరాజ్ ప్రాణాలు తీసింది.

"ఎమ్మెల్యే దీపాదేవిని కాల్చేసింది ఊర్వశి"

"సుభాష్, మదన్‌లు కలిసి గుర్నాథాన్ని హతమార్చారు.

"నాకు ద్రోహం చేసిన ఐదుగురు దుర్మార్గులు అంతం అయిపోయారు.

"నా ఆత్మశాంతించింది.

"కాని మైలార్డ్!

"తల్లిదండ్రులు చేసిన పాపాలు శాపాలుగా మారి పిల్లల జీవితాలను పతనం చేస్తాయి.

"ఈ విషయాన్ని- యవ్వనంలో ఉన్న ప్రతి యువకుడు, యువతి, పెళ్ళి చేసుకున్న భార్యాభర్తలు తప్పనిసరిగా గమనించాలి, గుర్తించాలి. తమవల్ల నేరాలు, ఘోరాలు జరగకుండా జాగ్రత్తపడాలి.

"యవ్వనంలో ఉండేవారికి- ఆహారం ఎంత అవసరమో లైంగిక సుఖం కూడా అంత ముఖ్యం. పరిశుభ్రమైన ఆహారాన్ని క్రమబద్ధంగా తింటాము. అలాగే ప్రేమ వ్యవహారాల్లోను, లైంగిక సుఖాల్లోను నీతి, నియమాలను, క్రమశిక్షణను అవలంభించాలి. లేకుంటే తాడు తెగిన గాలిపటంలా అయిపోతుంది జీవితం.

"తన కోర్కె వ్యవహారాలను సవరించుకోడం కోసం లాయర్ అరోరాను పెళ్ళి చేసుకుంది దీప. తర్వాత ఎంతో మందిని పెళ్ళి చేసుకుంది. ఎన్నో వందల మందితో సంబంధం పెట్టుకుంది.

"సెక్స్‌మేనియా గల భీమరాజు అహల్యను విడిచిపెట్టి దీపను పెళ్ళి చేసుకున్నాడు. భిక్షమెత్తుకుని తన యిద్దరు కూతుళ్ళను పెంచింది అహల్య. తల్లి కష్టాన్ని చూడలేక వ్యభిచారిగా మారింది ఊర్వశి. తన కుటుంబానికి జరిగిన అన్యాయాన్ని భరించలేక సొంత తండ్రి భీమరాజును, దీపను హత్య చేసింది. పోలీసు ముసుగులో అత్యాచారాలు సాగిస్తున్న అబ్దుల్లానుచంపేసింది.

"కొందరు మానవులు చేసే తప్పులవల్లనే మరికొందరు అపరాధుల్లా తయారవుతున్నారు.

"దీప, గుర్నాథం, జయరాజ్, విశాలాక్షి, పరిమళలు చేసిన తప్పుల వల్లనే నేను, నా కొడుకులు అపరాధాలు చేశాము.

"భీమరాజు చేసిన తప్పు వల్లనే ఊర్వశి నేరాలు చేసింది.

"మైలార్డ్!

"పాతికేళ్ళ క్రితం నేను చెయ్యని నేరానికి కోర్టు నన్ను శిక్షించింది. అపరాధం చెయ్యలేదని నిరూపించుకోడానికి జైల్లోంచి పారిపోయాను. నిర్దోషినని నిరూపించుకున్నాను. కాని, అలా నిరూపించుకోడానికి ఎన్నో, ఎన్నెన్నో అపరాధాలు చేశాను. ఈ రోజున పారిపోను. శిక్ష అనుభవిస్తాను.

"అంతే కాదు- నా కొడుకుల్ని, కోడళ్ళను కూడా కఠినంగా శిక్షించండి. దయచేసి, వాళ్ళకు ఉరివెయ్యవద్దు.

"వాళ్ళను ఉరితీస్తే, ఒకటి రెండు సంవత్సరాల్లో వాళ్ళ చరిత్రను ప్రపంచం మరిచిపోతుంది. అందుచేత, ఆజన్మాంత కఠిన కారాగార శిక్ష విధించండి వాళ్ళకు.

"వాళ్ళ జీవితాలు తలచుకుని, యవ్వనంలో ఉన్న ఏ యువకుడూ, ఏ యువతీ తప్పులు చెయ్యరు. ఏ తల్లిదండ్రులూ నేరాలు చెయ్యలేరు. ఒకవేళ చెయ్యాలనుకున్నా- ఆ నేరాల దుష్ఫలితం తమ పిల్లల జీవితాలను ఎలా నాశనం చేస్తుందో వూహించుకోగానే గుండె పగిలి చస్తారు.

"పరిమళ- జయరాజ్, విశాలాక్షి- గుర్నాథాలు చేసిన అపరాధాల వలన వాళ్ళ యిద్దరి వంశాలు అంతమై పోయాయి. చివరకు మీనాక్షి గర్భంలోని శిశువు కూడా చంపబడింది.

"ద్రోహం, నేరం, అవినీతి, అన్యాయం, అధర్మం ఏనాడూ విజయాన్ని సాధించలేవు. క్రమశిక్షణలేని జీవితానికి ఏనాడూ మోక్షం లభించదు.

"మైలార్డ్! చట్టాలున్నాయి, శాసనాలున్నాయి. పోలీసులున్నారు, కోర్టులున్నాయి, న్యాయాధిపతులున్నారు. కాని, హృదయానికి మించిన న్యాయస్థానం లేదు. ఆత్మ పరిశీలనకు మించిన న్యాయాధిపతులు లేరు. ప్రతి వ్యక్తి తన ఆత్మను పరిశీలించుకుంటే, తను చేసేది తప్పో, ఒప్పో క్షుణ్ణంగా తెలుస్తుంది.

"నేను తప్పు చెయ్యలేదు. కాని, చెయ్యని తప్పును సవరించుకోడానికి అపరాధాలు చేశాను. నా కొడుకుల చేత చేయించాను. కేవలం- నన్ను నమ్మించి మోసగించిన వాళ్ళ మీద, నాపైన అపరాధం మోపిన వాళ్ళ మీద ప్రతీకారం తీర్చుకోడానికి యింత మారణహోమానికి కారకుడి నయ్యాను.

"నేను చేసిన అపరాధాలకు శిక్ష అనుభవించి తీరాలి. ఈ యజ్ఞానికి- తప్పనిసరిగా ఆహుతి కావాలి నేను..."

అంటూ పళ్ళ మధ్య ఉన్న ఓ దంతాన్ని లాగాడు జోషీ. తిరిగి వెంటనే దానిని నోట్లో వేసుకుని జీడిపప్పులా నమిలేశాడు.

"డాడీ!" ఏదో అనుమానం వచ్చి, కోర్టు దద్దరిల్లేలా అరిచాడు- సుభాష్.

"శూలమ్ సాబ్!..." సంకెళ్ళు ఝుళిపిస్తూ అరిచాడు మదన్.

"అంకుల్...!!" కెవ్వుమన్నారు- ఊర్వశి, సోఫియాలు.

అప్పటికే బోను మీద తల వాల్చేశాడు... జోషీ.

"మై... గుడ్... సన్స్... అండ్... బేబీస్...!... మీ తండ్రిగా అపరాధాలు చేశాను... నేను... అయినా నా మీద... గౌరవం ఉంటే... బతికినంత కాలం... మీరు... జైల్లోనే ఉండండి..." అంటూ నురగలు కక్కుకుంటూ, కళ్ళు మూశాడు జోషీ.

"అంకుల్..."

"డాడీ"

"అంకుల్."

"శూలమ్ సాబ్..."

సోఫియా, సుభాష్, ఊర్వశి, మదన్‌ల అరుపులతో కోర్టు హాలు ప్రతిధ్వనించింది.

**(అయిపోయింది)**

### క్రీడారంగం క్విజ్ జవాబులు:

1) అత్యధిక సంఖ్యలో షటిల్స్ ఉపయోగించి రికార్డు సృష్టించారు. 66 ని.ల సేపు జరిగిన మ్యాచ్‌లో మొత్తం 182 షటిల్స్ ఉపయోగించారు. (స్కోరు 15-12, 15-12).
2) 'క్యూబా'కు చెందిన జేవియర్ శాటో మేయర్ (2.44 మీ.)
3) స్టెఫాన్ ఎడ్బర్గ్
4) వెస్టిండీస్‌కి చెందిన 'ఎవర్టన్ వీక్స్' ఫ్రాంక్ ఒరల్, క్లైడ్‌వాల్కట్.
5) పాకిస్తాన్‌పై బెంగుళూరులో తన ఆఖరి ఇన్నింగ్స్‌లో 96 పరుగులు సాధించాడు. వందవ టెస్ట్‌లాహోర్‌లో ఆడాడు.
6) మార్టినా నవ్రతిలోవా, పామ్‌ష్రివర్‌లు బాబీరిగ్స్, విటాస్‌గెరులైటిస్‌లను 6-2, 6-3, 6-4, స్కోరుతో 1985లో ఓడించారు.
7) బి.ఆర్. టేలర్ (1965) కలకత్తాలో 105 పరుగులు బౌలింగ్ 5/86
8) కపిల్‌దేవ్ నిఖంజ్.
9) డా. జిగోరకానో; సులభ పద్ధతి.
10) యాంగ్-యాంగ్ (చైనా).

# యువ కవితా

## వేచియుంటి నయ్యా వేంకటేశ!

ఏడుకొండల మీద ఎక్కి కూర్చున్నావు
ఎక్కలేను నేను ఒక్కడైన
అలివేలు మంగమ్మ అలిగి దిగి వచ్చినా
అడుగు కదపనట్టి అతి కఠిన శిలవు
శక్తి లేకున్ననూ భక్తితో నిను కొలువ
యుక్తిచే ఎటులనో ఎక్కితినిగాని
ఆవరణమంతయు అధికారముతో నిండె
అరులకిసుమంతైన తావులేదు!
లక్ష్మీకటాక్షమ్ము లక్షణమ్ముగనున్న
తక్షణమ్ము కలుగు నీ దర్శనమ్ము
మంత్రిత్వ శాఖతో బంధుత్వముండెనా
బహు సులభమయ్యా నీ ప్రాపకంబు
అర్ధరేతిరి వేళ ఆలిఫై జాలితో
అరుగుదెంచెదవంచరౌనో కాదో
అటులైన కలుగదా నీదు దర్శనమ్మని
వేచి యుంటినయ్యా! వేంకటేశ!

—కె. సూర్యం

## నిజం!

నిజం చెప్పిన నమ్మని
అబద్ధం చెప్పిన రమ్మనే
ఈ లోకంలో
నిజానికి చోటెక్కడుంది?
సత్యాన్నిపలికేవాడు
హరిశ్చంద్రునిలా
కష్టాలు- నష్టాలు
అనుభవించక తప్పదు!
నిజం నిలవను నీడలేక
నిట్టూరుస్తుంటే
అబద్ధం ఆరు అంతస్తుల మేడలో
అందంగ ఆనందాన్ని అనుభవిస్తున్నది!
కానీ
అది శాశ్వతంకాదని
నిజం నివురుగప్పిన నిప్పని
ఒకనాటికి అబద్ధం దహించక తప్పదని
అబద్ధానికేమి తెలుసు?
అబద్ధం అద్దం లాంటిది!
అర్థ కుండలాంటిది!
ఒకనాటికి పగులక తప్పదు!
నిజం బయటపడక తప్పదు !

-డి. దేవేంద్ర



## నాడు – నేడు

నాటి
రావణాసురుడే మేలు –
ఒప్పుకునేదాకా పట్టిన
సీతను ముట్టనన్నాడు!
కాని...
నేటి రావణాసురులు
పట్టపగలే పడతులను
నడిరోడ్డు బొడ్డున
దారుణంగా చెరిచేస్తున్నారు!!

– వి. జయరామిరెడ్డి

## అసలు సిసలు రక్తి

సుఖం ముఖం చూస్తున్నంతసేపు
జీవితంపై రక్తి
కష్టం కరం చేపట్టినప్పుడు
బ్రతుకంటే విరక్తి
ఇలా ఐతేలేదు ముక్తి
సుఖదుఃఖాలలోనైతం
సఖునిలా జీవితాన్ని
ప్రేమించి జీవించడమే
యుక్తిని, ఆసక్తిని కలిగియుండడమే
అసలు సిసలు రక్తి!

- శంకరగంటి కృష్ణప్రసాద్

## శేషప్రశ్న

నా కళ్ళలో –
పందానికి దిగుతున్న
కోడి పుంజులా ఉంది
ఈ జగత్తు!
నా హృదయంలో –
బౌలరు విడిచిన
క్రికెట్ బంతి వేగంలా ఉంది
ఈ ప్రజా ప్రభాతం!
మరి ఇదేమిటి–
నా చుట్టూ
ఈ పరిసరాలు
అమావాస్య నాటి కటిక చీకటి?

–ఈతకోట సుబ్బారావు

## సూది-దారం

సూది కన్నంలోంచి
దారం పోవాలి
కన్నం మాత్రం చాలా చిన్నది
మెల్లగా, నేర్పుగా
దారాన్ని కన్నంలోంచి
ఇటునుంచి అటు లాగాలి
అటూ-ఇటూ వున్న
దారానికి మధ్య సూది
అది-
జన్మకూ, జన్మకూ
మధ్య ఉండే
"సూచి"!

-వి. మధుసూదనరావు

## నాలుగో రకం!

వరకట్నం.....
కాలరు పట్టుకుని గుంజేవాళ్ళు
అధములు!
ఇస్తేనే తీసుకునే వాళ్ళు
మధ్యములు!
ఇస్తున్నా తిరస్కరించే వాళ్ళు
ఉత్తములు!
కాని,
అన్నీ అనుభవించి
అర్ధాంగుల్ని హతమార్చే నరాధములు
మాత్రం తప్పకుండా నపుంసకులే!

–మోదు రాజేశ్వరరావు

# చేసిన నేరం యేమీ లేదు

## కాళూరి వెంకటరామారావు

(గత సంచిక తరువాయి)

వేసంకాలం, గౌతమి నది శుష్కించిపోయి వుంది. జలము ఏనీలమై, స్వచ్ఛమై వుంది. అయిదు గంటలు అయ్యేవరకూ వీధి మొగం చూడలేకుండా వున్నారు ప్రజలు. ఎండ వేళ పశువులు నెమరువేస్తూ గోదావరి ఒడ్డున మర్రిచెట్ల నీడల్లో నిలబడి వున్నాయి. గేదెలు నీళ్ళల్లో పరుండి పైకి మోరలెత్తి నెమరు వేస్తున్నాయి. పశువుల కాపు కుర్రాళ్ళు చింత చెట్ల నీడల్లో గోళీకాయలాడుతున్నారు.

రంగాచారి మనస్సులో రాజ్యలక్ష్మి రూపం సునిశ్చలంగా కనపడుతూంది. అతని తలపు లన్నిటి లోనూ యిప్పుడా విగ్రహమే నిండిపోయింది. ఎల్లప్పుడూ ఆమె తన దృష్టిలో వుంటే బాగుండునేమో అని అతనికి తోచింది. ఆమె కనబడనంతసేపూ మనసు చిరాగ్గావుండేది. రాజ్యాన్ని చూడ్డంతోటే ఎక్కడలేని ఉత్సాహమూ, ఎక్కడలేని సంతోషమూనూ. అతను తరచుగా కుటీరంలోనే గడిపేవాడు. ఇదివరకు ప్రేమ గురించి పుస్తకాల్లో చదివాడు గాని యిప్పుడు స్వయంగానే చూస్తున్నాడు.

ఇంతలో "విజ్ఞానచంద్రికా" వారి స్త్రీల బహుమతీ పరీక్షలు వచ్చాయి. "రాజ్యాన్ని యీ పరీక్షలకు పంపాలోయ్. వాట్ఈజ్ యువర్ ఒపీనియన్?" అన్నాడు నారాయణమూర్తి శిష్యుడితో.

"షి ఈజ్ షూర్ టు గెట్ ద ఫస్టు ప్రైజ్ (ఆమెకి మొదటి బహుమానం తప్పక వస్తుంది)"

"అయితే ఎగ్జామినేషన్స్ రెండు నెల్లే వున్నాయి. రోజూ కాస్త శ్రద్ధగా చదివితేనే గాని బాగుండదు. నేనీ వైశాఖంలోపుగా రామాయణం పూర్తి చేయాలనుకుంటున్నాను. నాకు టైములేదు. నీకు తీరుబాటైనప్పుడు రోజూ ఒక గంట ట్రైనింగు యివ్వ డానికి స్పేర్ చెయ్యగలవా?"

"అందుకు అభ్యంతరం ఏమిటి? నేనా విషయమై తగిన కేర్ తీసుకుంటానులెండి".

"దట్ఈజ్ ఆల్‌రైట్ (సరే బాగుంది)". "నువ్వు చూస్తే మరి నేను వేరే కలుగజేసుకో నక్కరలేదు. నేను మీ నాన్నగారూ రామాయణం చదువుకుంటాము."

అది మొదలు రంగాచారి రాజ్యంచేత పరీక్ష పుస్తకాలు చదివించడం ప్రారంభించాడు. తీక్ష్ణమైన బుద్ధితో ఆమె విషయాలని గ్రహిస్తూంది.

ఒక్కొక్కనాడు సాయంకాలం ఇసుకతిన్నెల మీద కూచుని రాజ్యానికి రసాయన శాస్త్రంలో పాఠాలు నేర్పుతూ వుండేవాడు. నారాయణమూర్తి అతని బోధనా శక్తిని చూసి సంతోషంతో నవ్వుకుంటూ వుండేవాడు.

క్రమంగా రాజ్యానికి రంగాచారి దగ్గర చనువు కలిగింది. నారాయణమూర్తి వేరే పనుల మీద వున్నప్పుడు వారిద్దరే గోదావరి ఒడ్డుకి షికారు వెళ్ళేవారు. అలాంటి సమయాల్లో వారు స్వేచ్ఛగా వివిధ విషయాల్ని గురించి మాట్లాడుకుంటూ వుండేవారు. సంఘ దురాచారాలైన అతి బాల్య వివాహాలూ, నిర్బంధ వైధవ్యమూ మొదలైనవి వాళ్ళ సంభాషణల్లో దొర్లిపోయేవి. అట్టి దురాచారాల పైని ఆమెకి గల సునిశ్చితాభిప్రాయాలు అతనికి ఆశ్చర్యం కలిగిస్తూ వుండేవి. ఒక్కొక్క దురాచారాన్ని గురించి కొంతసేపు చెప్పి దాని కుదాహరణంగా ప్రపంచంలో జరిగే ఘోరాలు కొన్ని కొన్ని తెలిపేటప్పుడు రాజ్యం మనస్సు కరిగిపోయేది. ఆ దురాచారాల ఫలితంగా గంగపాలైన జీవితాలను గురించి విని ఆమె అశ్రువులు విడుస్తూ వుండేది.

నారాయణమూర్తి సంఘ సంస్కరణానికి ముందడుగు వేసిన వాళ్ళలో ఒకడు. అసలు అతడు మొదట శుద్ధ ఛాందసుడు. అతడు వద్దంటున్నా వినక బంధువులంతా అతన్ని ప్రోత్సాహం చేసి, శాస్త్రాలు చూపించి రాజ్యానికి యెనిమిదో ఏట వివాహం చేయించారు. కాని పెళ్ళయిన నాలుగు నెలల్లో అల్లుణ్ణి మశూచికం పొట్టనపెట్టుకుంది. ఆ దెబ్బతిన్న తరువాత నారాయణమూర్తికి బంధువులంటే మొహం తిరిగింది. ఇప్పుడు ముద్దు కుమార్తె యీ వైధవ్యపుటూ పడవలసిన బాధలు వాళ్ళకేం నొప్పి? తనకు గానీ?

అందుచేత అతడు పూర్తిగా మారి ప్రబలమైన సంఘ సంస్కర్త అయిపోయినాడు. కుమార్తెను విద్యావతిని చేసి, పద్దెనిమిదేళ్ళ వయస్సు రాగానే మళ్ళా వివాహం చేద్దామనే ఉద్దేశ్యం అతని హృదయ కుహరాల్లో దాగుని వుంది రాజ్యలక్ష్మికి తన పెళ్ళి ఎప్పుడు ఎలాగూ జరిగిందో జ్ఞాపకమే లేదు. తండ్రికీ, బంధువులకీ తన వివాహ విషయంలో జరిగిన రాద్ధాంత సిద్ధాంతాలు తరుచు విన్నందు వల్ల సంస్కరణాల వల్ల ఉపయోగం ఆమెకి బాగా తెలుసును.

★ ★ ★ ★

రెండు నెలలు గడిచేయి, రంగాచారి బి. ఏ. పరీక్షలో కృతార్థుడైనట్లు తెలిసింది. ఆ నాడు ఆ నారాయణమూర్తి కుటుంబాన్ని ఆచార్లు గారు విందుకు పిలిచేరు. రంగాచారి నిండు వుత్సాహంతో వున్నాడు. ఆ రోజున రాజ్యం ద్విగుణీకృత సౌందర్యంతో అతనికి కనబడింది. పచ్చని చలువ చేసిన సేలం జరీ సిల్కు చీర కట్టుకుంది. ఎర్ర సిల్కు జాకెట్టు తొడుక్కుంది. జాకెట్టును దాటి ఆమె శరీర కాంతులు ముమ్మరంగా పైకి వస్తున్నాయి. మల్లెపువ్వులు కుట్టబడిన వాలు జడ కటి పర్యంతమూ వేలాడుతుంది. మందహాస పరిశోభితమై ముఖం కలకల లాడుతూంది. ప్రభాత సూర్యుని కాంతిలో ముద్దులు గుల్కు గులాబి పువ్వుల్లాగు ఆమె చెక్కిళ్ళు కాంతి వంతములై వున్నాయి. వసంతాగమమున లలితారుణపల్లవ భూషణో జ్వలిత మగు లేమామిడి గున్నలాగు ఆమె అందము నేత్రపర్వమై, లక్ష్మీదాయకమై వుంది.

ఆనందాతి రేకాన్ని రంగాచారి శరీరం రోమాంచితమై పోయింది. అంతవరకూ మనస్సులో అణిగి వున్న ప్రేమ ఒక్కసారిగా పైకి పొంగి పోయింది. ఆమె ఒంటిగా వున్న సమయం కనిపెట్టి, "రాజ్యం! నీ పరీక్ష కూడా పాసైతే మమ్మల్ని విందుకు కూడా పిలుస్తావా?" అనకుండా వుండ లేకపోయినాడతడు. "ఇప్పుడు మిమ్మల్ని పిల్చినందుకు బదులా ఏమిటి" అంటూ చిరునవ్వుతో ఆమె వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళి పోయినా గాని ఆ జవాబు మాత్రం అతని చెవుల్లో కోకిల పలుకుల్లాగు రింగుమంటూనే వుంది.

రాజ్యానికి తన అభిలాష చెప్పాలని రంగాచార్లు అనేకసార్లు ప్రయత్నించాడు. కాని జంకుచేత మూగ్గా వూరుకున్నాడు. తన కోర్కె నోటితో చెప్పలేదన్న మాటగాని అతని ప్రతి చూపూ, ప్రతి చేష్ట అతని ప్రేమను వెయ్యి నోళ్ళతో చాటుతున్నాయి.

ఒకనాటి సాయంత్రం రంగాచారీ, రాజ్యమూ చాలా దూరం షికారు పోయారు. అక్కడ ఒక కొంతగెడ్డ గోదావరిలో కలుస్తూంది. ఆ గెడ్డ ఒడ్డున ఒక రాతి మీద వాళ్ళిద్దరూ కూర్చున్నారు.

సూర్యుడు గోదావరి ఆవలి వైపు పర్వతాల్లోకి క్రమంగా దిగి పోతున్నాడు. అతని దివ్యతేజము గౌతమీ విమల జలాల్లో ప్రతిఫలిస్తుంది. కొండల మీద వివిధ ఫల వృక్షాల మీగ వాలి పక్షులు సంతోషంతో చేస్తూ వున్న రొదలు పల్లె వారింట్లో గందరగోళంలాగుంది. గోదావరి మందంగా ప్రవహిస్తూంది. గెడ్డలో నీరు రాళ్ళ మీద కొట్టుకుని వెడుతున్నాయి. పెళగిగిన తుంపురులు వృద్ధభానుని కాంతిలో కెంపుల్లాగా మెరుస్తున్నాయి ఎక్కడా జనసంచారం లేదు. ఆ ప్రశాంత సమయంలో ప్రకృతి శోభ చూస్తూ వాళ్ళిద్దరూ సంభాషించుకుంటున్నారు. ఆ రోజు తన మనోగతాభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పాలని రంగాచారి ఉదయం నించీ తన భావాలను

రిచేసుకుంటున్నాడు. అప్పటి సంభాషణని తన భిప్రాయం వెలిబుచ్చడానికి వీలుగా మార్చాలని తను ప్రయత్నిస్తున్నాడు. క్రమంగా వారి ంభాషణ ఈ రీతిగా మారింది.

"రాజ్యం! ప్రకృతి యావత్తూ యీ రోజున గుణీకృతమైన శోభతో ప్రకాశిస్తూంది, చూశావా"

"ప్రకృతి వైభవానికి మనదేశం ప్రసిద్ధి పొందింది. తమీ తీరమంతా ప్రకృతి శోభ పరిపూర్ణమే కదా?"

"మనదేశం మహాతపస్సంపన్నులైన మహర్షుల దధూళి చేత పవిత్రమైంది. ఇప్పుడు మనం ార్చున్న ఈ ప్రదేశం అంతా తపోవనాల చేత ండినదే."

"యిట్లాంటి పవిత్ర స్థలంలో జన్మించినందుకు ారు అదృష్టవంతులు."

"ఈ స్థల పవిత్రతకి తోడు యీ సమయం కూడా హాప్రశాంతంగా వుంది. చూడూ, ఇవతల దావరీ, అవతల ఆ పర్వతాలూ, ఆ వాలయమూ, ఆ సూర్యుడూ, ఆ మహారణ్యమూ– ఇవన్నీ చూస్తే యెట్టి అజ్ఞానికైనా ర్వమయుడైన భగవంతుని శక్తి బోధపడుతుంది ఎమూ."



# చేసిన నేరం యేమీ లేదు

"నిజం, నిజం. ఈ సమయం బహుప్రశాంతమై యెట్టి మూఢుని హృదయానికి కూడా శాశ్వతతత్వ బోధ చేయడానికి చాలి వుంది–"

"రాజ్యం! (కొంచెం ఆలోచించి) యీ పవిత్ర స్థలంలో, ఈ ప్రశాంత సమయంలో, నీకొక సంగతి చెప్పదలుచుకున్నాను. ఇది యెంత రహస్యమైందో **అంత** పవిత్రమైంది కూడాను. నీవు జ్ఞానవంతురాలవు గనుక బాగా ఆలోచించుకుని మరీ– జవాబు చెప్పవలసి వుంటుంది."

రాజ్యం సాభిప్రాయంగా అతని వేపు చూస్తూంది. **అతడు** మళ్లా ప్రారంభించాడు.

"ఏ నాడు నిన్ను చూశానో, ఏ ముహూర్తాన నీ ముఖారవిందాన్ని చూశానో, నాటి నుంచి నా మనస్సులో మొలకలెత్తి, క్రమంగా పెరిగి, పుష్పించిన నా ఆశాలతని ఫలింప చెయ్యడమో, తెంపేసి సమూలంగా నాశనం చెయ్యడమో నీ చేతుల్లో వుంది– ఇంత యెందుకూ? నా భావిభాగ్యదశ అంతా నీ హస్తగతమై వుంది."

రంగాచారి కొంచెం సేపు ఆగి, ఒక్క నిట్టూర్పు పుచ్చి, గోదావరి జలం వంక తదేకధ్యానంగా చూస్తూ చెప్పడం మొదలు పెట్టాడు. రాజ్యం మౌన ముద్రాంకితమై వింటూంది.

"రాజ్యం! నువ్వు నా చేత స్వయంగా చెప్పించాలంటే చెప్పాలి కాని, యిదివరకు నా ప్రవర్తనే నాకు నీ యెడల గల గాఢానురాగాన్ని తెలియ జేయగలదు. నిన్ను చూసిన వెంటనే నువ్వు నా హృదయ రాజ్య లక్ష్మివై పోయినావు. నా హృదయ సింహాసనం మీద కూర్చోబెట్టి ప్రతిక్షణమూ, ప్రతి ఘడియా, ప్రతి రోజూ నిన్ను మనోహర భావ పుష్పాలచే అలంకరిస్తూ, పూజిస్తూ వున్న భక్తుడ్ని అయిపోయినాను నేను. నీ నిత్య సేవల్లో నా జీవితం గడిపేయడానికే నేను పూర్తిగా నిశ్చయించుకున్నాను. నీవు అంగీకరించినా, మానినా నీవే నా హృదయేశ్వరివి."

రంగాచారి రాజ్యలక్ష్మి మృదుహస్తాన్ని తన చేతుల మధ్య పట్టుకున్నాడు. ఆ స్పర్శ సుఖాన్ని అతడు సర్వప్రపంచాన్నీ మరిచిపోయాడు. రాజ్యం తన చెయ్యి తీసుకోవడానికి ప్రయత్నించలేదు ఆమె హస్తమాతని హస్తముల మధ్య నట్లే వుండిపోయింది. ఆమె మారు చెప్పకుండా యించుక సిగ్గుతో తల వంచుకుంది మందమలయానిల ప్రేరణాన్ని ఆమె ముంగురులా విశాల ఫాలముపై నాట్యమాడుతున్నాయి.

రంగాచారి "రాజ్యం! నీ హృదయం కోమలమైనదని నే నెరుగుదును. అందులో నాకొక్కింత స్థలం యివ్వకపోవనే ధైర్యాన్ని నేను ప్రార్థిస్తూ వున్నాను. కనుక ఆలోచించుకుని మరీ జవాబు చెప్పు–" అన్నాడు.

రాజ్యం ఒక్కసారి మొగమెత్తి చూసి మళ్లా తల వాల్చుకుంది. ఆ చూపుల వల్ల అతనికి కొంత ధైర్యం కలిగింది.

రంగాచారి మళ్లా "నువ్వు మీ నాన్నగారి అభిప్రాయానికి జడియనక్కరలేదు. ఆయన యిష్టం సంపాదించే భారం నాది. నీ అభిమతం తెలియజేస్తేవా, యింక ఏ ఆటంకాలనీ నేను లక్ష్యపెట్టను. ఇంక నీ యిష్టం చెప్పు సరేనా?" అన్నాడు.

ఆమె ఒక గడియసేపాలోచించి మృదు మధుర స్వరాన్ని "సరే" అని మాత్రం అంది. తక్షణం అతడా బాలికను గాఢాలింగన మొనర్చుకున్నాడు. పుష్పలతా సదృశ్యమగు ఆమె శరీర మాగాఢ పరిష్వంగ సుఖాన్ని మైమరచి పోయింది. అతి పవిత్ర ప్రణయలాంఛన మగు నా యువతీయువకుల పరీరంభమును తూర్పు దిశను మిలమిల మెరుస్తూ వున్న ఒక నక్షత్రం తొంగి చూసింది.

సన్నని చీకట్లు నాలుగు మూలలా కమ్ముకుంటున్నాయి. వేలకు వేలు నక్షత్రాలతో వినిర్మలాంబరము . నదీ జలంతో ప్రతిబింబిస్తూంది. విహంగకుల కలకలారావాలు పూర్తిగా శాంతించాయి.

ఆ ప్రశాంత సమయంలో, గౌతమీ మహానది సాక్షిగ, అనంతకోటి నక్షత్రముల సాక్షిగ, వారిద్దరూ తమ ప్రణయ ప్రమాణములు చేసుకున్నారు. వారి ప్రమాణవాక్యము లాలకించి వృక్షాలన్నీ తల లూపి తమ నిండారు సమ్మతిని వెళ్లబుచ్చాయి.

"విజ్ఞాన చంద్రికా పరిషత్తు" వారి పరీక్షలైనాయి. మరి నెల రోజుల నాటికి మూడు మొదటి తరగతి బహుమానాలున్నూ, ఒక రెండవ తరగతి బహుమానమున్నూ, మంచి యోగ్యతా పత్రికలున్నూ, రాజ్యానికి వచ్చాయి. నిజంగానే ఆచారిగారి కుటుంబాన్ని ఆ రోజు విందుకి ఆహ్వానించారు. ఆనంద భారం చేత యించుక తల వంచుకుని సిగ్గుతో మందగమనాన్ని వచ్చి తన బహుమతుల్ని రాజ్యం రంగాచారికి చూపించింది "ఇవన్నీ నీ శ్రమ వల్ల వచ్చినవేనోయ్" అని నారాయణమూర్తి శిష్యుణ్ని శ్లాఘించాడు.

* * * *

ఆ నాటి కానాడు రంగాచారికీ రాజ్యానికీ వుండే గురు శిష్య భావం స్నేహంగా పరిణమించింది. రోజు రోజు వారి ప్రేమ వృద్ధి పొందుతూంది. ప్రతిరోజూ వారిద్దరూ షికారు పోతూ వుండేవారు. తీరుబాటున్న ప్రతి ఘడియ రంగాచారి కుటీరంలో నే గడిపేవాడు.

వారిద్దరి నడవడికా నారాయణమూర్తీ గమనించక పోలేదు. ఈ విషయమై వారు సంభాషించుకున్నారు కూడానూ అతి పవిత్రమైన దినదినమూ నూతన వికాసము పొందుతుండే నిర్మల ప్రేమను అడ్డు పెట్టడానికి వాళ్ల మనస్సులు ఒప్పుకోలేదు. అది మహాపాపంగా వాళ్ళు భావించుకున్నారు." నా పాపిష్టి కళ్లకి ఈ నాటికి వెలుగు కనబడ్డది. మన పిల్ల సంతోషం మనది కాదా ఏమిటి? అని సుందరమ్మ భర్తతో అంటూ వుండేది.

రాజ్యం తల్లితండ్రులు యీ విషయంలో యెంత సౌజన్యత చూపించారో, రంగాచారి తల్లితండ్రులు అంత పట్టుదల చూపించారు. నారాయణమూర్తి యెడల రామానుజాచారికి గల స్నేహ గౌరవాలు యిందులో పని చేయలేదు. చూచాయిగా యీ వార్త విన్నది మొదలు వాళ్ల గుండెల్లో రాయి పడ్డట్లయింది. కుర్రాడు కులభ్రష్టుడై పోతున్నాడని వారు ఖంగారు పడ్డారు. ఈ విషయమై ప్రొఫెసరు గారితో ఆచార్లు గారు ఒకనాడు చాలా కష్టంగా మాట్లాడారు కూడాను. అది మొదలు ఆయన కుటీరానికి వెళ్లడం మానేశాడు. కొడుకుని



'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు
తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.
–సంపాదకుడు.

వెళ్లవద్దన్నాడు గాని అతను వినలేదు.

"నా మాటకి ఎదురు నడిచి, మత భ్రష్టుడై పోదలుచుకున్నప్పుడు నా యింట్లో మాత్రం వుండదమెందుకూ? అని యిద్దరి ముగ్గురి చేత కొడుక్కి తెలియజేశాడు. అతను మాత్రం ఏమీ జవాబియ్య లేదు.

ఒకనాడు ఉదయం ఆరు గంటలన్నర అవుతుంది. గోదావరి నది మీద నుంచి చల్లని గాలులు వస్తున్నాయి. సూర్యుడింకా కొండల పైకి రానందున కుటీరం వరకూ యెండ రాలేదు. రంగాచారి కుటీరం దక్షిణ వసారాలో ఒక చక్కని పడక కుర్చీలో కూర్చుని దీర్ఘాలోచనలో మునిగి వున్నాడు. గాలికి అతని వుంగరాలు తిరిగిన క్రాపింగ్ మెల్లిగా కదిలి తెల్లని విశాలమైన నుదురుపై పడుతున్నది. పూల తోటలోని పూలు సువాసనలు గుప్పుతున్నాయి. అనేక రకాల పక్షులు తోటలో చురుగ్గా ధ్వని చేస్తున్నాయి. అతని మనసుకీ సౌఖ్యమంతా తోచడం లేదు. భావబద్ధములైన అతని నేత్రాలు నిశ్చలంగా ప్రకాశిస్తున్నాయి. అతని పక్కనే ఒక తుంగ చాప పరిచి వుంది. దాని పైన నగిషీ చెక్కిన గలీబుతో ఒక దిండు వుంది. ఆ దిండు మీద ఒక "భారతి" సంచిక విసనకర్రా వున్నాయి.

ఇంతలో లోపలనించి ఉప్మాతో వున్న వెండి పళ్లెం ఒక చేతిలోనూ, కాఫీతో వున్న వెండి మరచెంబు యింకో చేతిలోనూ పట్టుకుని రాజ్యం వచ్చింది. పళ్లెమూ, చెంబూ అక్కడవుంచి మళ్లా లోపలికి వెళ్లి ఒక వెండి కాఫీ గ్లాసు కూడా తీసుకొచ్చి చాపమీద కూచుంది.

రాజ్యాన్ని చూడ్డంతోటే అతనికి ఆలోచన తగ్గింది. లేత అరిటాకులాగ కోమలమై, మనోహరమై వున్న ఆ సౌందర్యమూర్తిని చూసేసరికి అతనికి ఎక్కడలేని ఆనందమూ కలిగింది. సంపెంగ పూవుల ఛాయను మరిపిస్తూ వున్న ఆమె శరీరకాంతులు ఆ పల్చని చీరదాటి పైకొస్తున్నాయి. ఆమె కోమలాధరము సహజంగా అరుణమై, దర్శనీయమైన ఆ ముఖానికి తగినట్లుగా వుంది. మాట్లాడినప్పుడల్లా చెవులకి వున్న వజ్రాల తమ్మెట్లు జిగజిగ మెరుస్తున్నాయి. వినీలమైన శిరోజములు కొద్దిగా చెదిరి ఆ ముఖ సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. వక్షోభాగము సమున్నతమై గౌరవనీయమై వుంది. మంచి పనితనం గల రెండు వరుసల బంగారు గడియారపు గొలుసు రెండు వరసలతో మెడలో మెరుస్తూంది. చేతులకున్న రెండు జతల బంగారు గాజులున్నూ శరీర కాంతితో కలసి పోయాయి. ఆమె అక్కడికి రావడం చేత వసారాలోని అన్ని వస్తువులకీ సౌందర్యమూ, కాంతీ, సువాసనా వచ్చేయని చెప్పడంలో అబద్ధం లేదు.

విలాసంగా మాట్లాడుకుంటూ వాళ్ళిద్దరూ ఆ పళ్లెంలో ఉప్మా తిన్నారు. రెండు గ్లాసుల్లోనూ




## తల్లక్రిందులా అవ్వాలంటావ్ ఓ. కే.!

ఇదీ ఓ వాగ్బాణం అనుకోండి దీన్ని మరో వాగ్బాణంతో మీరు ఉపసంహరించాలి- ఆ "రిపార్టీ" గుచ్చుకోవాలే గాని బాధించకూడదు. రసభరితంగా వుండాలే గాని అశ్లీలం కొట్టవచ్చి నట్లుండరాదు. కార్డు మీద మాత్రం రాయాలి. ఈ వాక్యం పైన రాసి మీ ప్రతి వాక్యం దాని క్రింద రాయండి. మీ పూర్తి చిరునామా ముఖ్యం. ప్రచురించిన రెంటికి రు. 25, రు. 15 చొప్పున బహుమతి వుంటుంది!- ఈ విషయంలో సంపాదకునిదేతుది నిర్ణయం.

**20-10-'89లోగా అందేలాగా రిపార్టీలు పంపించాలి!**

చాలా మంది వెంటనే "రిపార్టీ"ల వర్షం కురిపించారు. కొన్ని మాత్రం ఎంపిక చేసి వేస్తున్నాం. బహుమతులు పొందిన రెండూకాక- మరికొన్ని యిక్కడ వేశాము. తతిమ్మా వారి "వాగ్బాణాలు" స్థలాభావం చేత వేయలేక పోయాం. లాటరీ తీసి కొందరి పేర్లు మాత్రం వేస్తున్నాం! ఒకసారి బహుమతి రాలేదని నిరుత్సాహపడక మళ్ళీ ప్రయత్నించండి.

-ఎడిటర్

## "ఏంగురూ దాదాగిరీనుంచి చెంచాగిరీకి దిగిపోయావా?"

* రు. 25 బహుమతి పొందిన రిపార్టీ:

**"మా గూండాబాస్ యిప్పుడు ప్రజానాయకుడై పోనాడుగా అందుకని!"**

- ఐ. పద్మజ (మద్రాసు)

* రు. 15 బహుమతి పొందిన రిపార్టీ:

**"చెంచాతో అయితే 'అన్నిటినీ' కలుపుకోవచ్చునని!"**

- డి. సాయియోగానందగౌతమ్ (నూజివీడు)

### మరికొన్ని వాగ్బాణాలు

"ఏంచేయను....మా "బాస్" పవర్ 'రాజీనామా'తోనే పోయిందిగా!"
- యన్. ఉమానాగేశ్వర్ (సీతారామపురం)

"యిలా పొజిషన్ పెంచుకుంటే పొలిటీషియన్ కావచ్చు!"
- శర్విష్ఠ, కె. (కందుకూరు)

"అదేం కాదు....మావాడికి ట్రైనింగ్ యిస్తున్నా.....!"
- షేక్ అతావుల్లా (విజయవాడ)

### లక్కీ పేర్లు

టి. త్రివేణి (పేలేరు), పి. సువర్ణ (కలకత్తా), బి. వి. రమణమూర్తి (రాయగడ), చైతన్య (విజయవాడ), ఎం. సుశీల (ప్రత్తిపాడు), పి. బాలాజీ (శ్రీహరికోట), కె. వెంకటేశ్వరశర్మ (పాదలాడ), కె. ప్రసాద్ (గుంటూరు), ఎన్. నరసింహా రావు (హైదరాబాద్), బి. భవాని (తణుకు), సిద్ధార్థ (నిడదవోలు), [illegible] రవికిరణ్ (కొత్తగూడెం), బి. రాజప్రసాద్ (శ్రీకాకుళం).

రంగాచారి కాఫీ నింపాడు. వేడి వేడి కాఫీ తాగడంతోటే వాళ్ళిద్దరికీ చక్కని చెమటలు పోశాయి. రాజ్యం నుదుటిమీద చెమట్లబిందువులు ముత్యాల లాగున్నాయి. ఆమె కుంతలములా బిందువుల్లో రెండు మూడు చోట్ల అంటుకున్నవి. రంగాచారి చొక్కాకున్న రోల్డుగోల్డు గుండీలు తీసేసి చల్లని గాలిని ఆహ్వానించాడు. పవన బాలుడు అతని వల బనియనులో నుండి శరీరాన్ని తాకి తన్నాహ్వానించినందుకు కృతజ్ఞత చూపించుకున్నాడు.

అతని మనోవీధి లో రాజ్యంతో కూడిన తన భావి జీవితం పొడగట్టింది. తనదైపోయిన రాజ్యాన్ని ఆధారంగా చేసుకుని అతడు సౌఖ్య సామ్రాజ్యాన్ని నిర్మించుకున్నాడు. ఆ సుఖమయ జీవితమే తన పరమావధిగా భావించుకున్నాడు. ఈ సమయంలోనే- యీ తలపుల్లోనే- తన భావి సౌఖ్యాలకుండే అభ్యంతరాలు- పౌర్ణమీ మనోహర చంద్రికాశోభితమైన నిర్మల గగనం భయంకర కాల మేఘాచ్ఛాదితమై పోయినట్లు- అతనికి తోచి, హృదయాన్ని కారు చీకట్లతో నింపాయి. మనోహ్లాదకర స్వప్నమున, సుందర తేజోమూర్తుల సందర్శనాన్ని తన్మయుడైయున్న మానవుడికి- హఠాత్తుగా- భయంకరనారీ పిశాచ దర్శనమైనట్లయింది. తండ్రి పట్టుదల సంఘ ప్రతిష్ఠ- యివి మహాపర్వతాల్లాగు అతనికి కనబడ్డాయి.

అతడు నాలుగు వేపులా చూసి ఒక్క నిట్టూర్పుతో, "రాజ్యం, మన స్నేహాని కెన్ని ఆటంకా లున్నాయి?" అన్నాడు.

"ఏమి ఆటంకాలూ?"

ఏ మాటంకాలంటావా? మా నాన్న పట్టుదలా, సంఘమూ మొదలైనవి. మన వివాహం అవడంతోటే నాకూ దేవాలయానికి వున్న సంబంధం ఒదిలి పోతుంది. రాబడి తగ్గిపోతుంది దాని ఫలితంగా. ఇవన్నీ నాకు వేదన కలిగిస్తున్నాయి.

ఇద్దరూ రెండు నిమిషాలు మాటాడలేదు. ఆ హృదయాల్లో ఎంత తీపి ఆలోచనలు కొట్టుకున్నాయో ఊహించవలసిందే కాని చెప్పడానికి వీల్లేదు. చివరకు రాజ్యం అంది "మీరు చెప్పినవన్నీ నేను ఇదివరకే ఆలోచించాను. మహాశక్తితో, అనివార్యమైన వేగంతో భూచక్రాన్ని ముంచివేయడానికి వస్తూవున్న కాల ప్రవాహాన్ని ఆపుచేయగల శక్తి ఒకవేళ ఉండవచ్చునేమో కాని,- నిర్మల ప్రేమవాహినిని అడ్డు పెట్టగల శక్తి యిప్పటికీ పుట్టలేదు. పుట్టబోదు కూడాను. ఆ సంగతి వేరే మీకు చెప్పడ మెందుకూ? ఈ అభ్యంతరాలని పవిత్ర ప్రేమ లెక్క చెయ్యదు. ప్రేమ నిమగ్నమైన మనస్సుకి కులపర్వతాలు తృణప్రాయం- సప్త సముద్రాలూ సెలయేళ్లకంటే అధ్వాన్నం- అలాంటి సమయంలో మీరు చెప్పిన అభ్యంతరాలు లెక్కలోకి రావు. ఉద్యోగం, ఉద్యోగం అంటారు. ఎందుకూ? మా నాన్న ఆస్థికంతా నేను వారసురాలినన్నమాట మరిచిపోయారా? ఈ పర్వతాల్లోనే, యీ అరణ్యాల్లోనే, యీ జంతువుల్లోనే మన కాలం గడపాలని యెన్నిసార్లో సంతోషంతో అనుకున్న మాటలు యింతలోనే మరుపా? మనకి సంఘమూ, ప్రపంచకమూ అన్న భయం ఎందుకు? ఈ జంతువు లేమైనా ప్రపం చానికి భయపడు తున్నాయా? తోటి మానవుల్ని నిర్బంధంలో వుంచి చిత్రవధ చేసే మనుష్యుల కంటే యీ ఘాతుక జంతువులే మనకి యెక్కువ స్నేహం చెయ్యతగ్గవిగా నాకు తోస్తుంది."

ఈ మాటలు రాజ్యం మెల్లగానూ, గంభీరంగానూ చెప్పేసి ఒక్క నిట్టూర్పు విడిచింది. వర్షాకాలంలో యిరుదరులూ నిండి ప్రశాంతంగా ప్రవహించే గంగా స్రవంతిలాగుంది ఆమె వాగ్ధోరణి.

రంగాచారికి ఆవేశ మెక్కువై పోయింది. తక్షణం రాజ్యం చేయి పట్టుకొని, "రాజ్యం! వూరికే అన్నానుగాని, యీ అభ్యంతరాలు నన్ను భయపెట్టలేదు. ఈ చెట్ల కొమ్మల్లో మధుర ఫలాలు తిని విహరించే చిలక దంపతుల్లో మనం

# ఫొటో వ్యాఖ్యా పోటీ-30 ఫలితాలు



లక్కీ పేర్లు

జి. మహేశ్వరి (విజయవాడ), జి. ఎస్. శివకుమార్ (కాకినాడ), టి. రాజగోపాల్ (రాజమండ్రి), కె. జయ పద్మజ (మానేపల్లి), ఎస్. నరసింగరావు (అలమండసంత), కె. జయశ్రీ (విశాఖపట్నం), బి. పాములరావు (చినఓగిరాల), వి. జె. రామిరెడ్డి (కర్నూలు), డి. శ్రీశాస్త్రి (చాగల్లు), టి. విజయలక్ష్మి (గుత్తూరు).

## బహుమతి పొందిన వ్యాఖ్య

"వేళకాని వేళలో విలేఖరుల ప్రశ్నాబాణాలు
ఎంగిలి చేతితో నే మహామాత్యుల సమాధానాలు"

–నెల్లూరు మనోహరరెడ్డి (చిల్లకూరు)

---

"తిండినాది మొదలాయే మీ ప్రశ్నలతో చావాయే వరద బాధితుల గొడవాయే కేంద్రనిధులు రావాయే."

–సందక గురునాధరావు (విజయవాడ)

విలేఖర్లు: మీరు ప్రధాని అయితే?
ఎన్. టి. ఆర్ : జీతం రెండు రూపాయలు తీసుకుంటాను బ్రదర్స్!

–నివాస్ (కొత్తగూడెం)

"అన్నగారి నవరసాల సంచలన వార్తల విందు
పాత్రికేయుల కలాలకెంతో పసందు
అందుకే వారికొద్దు వేరేవిందు"

–ఎం. పి. ఎస్. కళ్యాణి (విశాఖపట్నం)

---

ఒకళ్ళమై విహరిద్దాం. వేసవి కాలంలో వెన్నెలలో గోదావరిలో నీరు తాగి యిసక తిన్నెలమీద విశ్రమించే లేళ్ళ జతల్లో మనం ఒకళ్ళమై విశ్రమిద్దాం. వసంత సంధ్యల్లో, పల్లవాలంకృతమైన ప్రకృతిని చూసి ఉప్పొంగి గానం చేసే పికద్వంద్వాల్లో మనం ఒకళ్ళమై గానం చేద్దాం." కొంచెం సేపు వూరుకుని, "మా నాన్నతో నా నిశ్చయాన్ని చెప్పేసి రేపు వస్తాను. నేను మరి యింటికి వెళ్ళడానికి వీల్లేదు" అన్నాడు. పది గంటలైన తర్వాత రంగాచారి యింటికి వెళ్ళాడు.

* * * * *

రంగాచారి కుటీరం కాపురస్థుల్లో ఒకడై పోయాడు. హిందూ సాంప్రదాయానికి విరుద్ధంగా నడిచినందువల్ల స్వామి అర్చనాది కార్యాలకి అనర్హుడవడం చేత దేవస్థానపు ఈనాముల మీద రంగాచారికి హక్కు పోయింది.

* * * * *

ఒక ఏడాది గడిచింది. కొడుకుని మళ్ళీ తండ్రి చూడలేదు. కాని ఒక్క కొడుకూ దూరమైపోయిన విచారం అతన్ని క్రుంగతీసింది. మంచం పట్టిన తరువాత తన్ను చూడ్డానికి కొడుకు రెండుసార్లొస్తే అతను ఒప్పుకోలేదు. కాయిలా ప్రతిమించి రాగాన బడ్డది. జీవితాశ లేనప్పుడు మాత్రం రామానుజాచార్యుకి కొడుకు చేసిన నేరం ఏమీ లేదని బోధపడ్డది.

ఒకనాడు ఉదయం నారాయణమూర్తీ, రంగాచారీ శ్రీరామగిరి వెళ్ళారు. రంగాచారి తండ్రి మంచం మీద కూచున్నాడు. పశ్చాత్తప్తుడైన ఆ జనకుడు కొడుకు వీపు మీద తన శుష్కహస్తాన్ని వేసి నిమురుతూ హీనస్వరంతో, "నాయనా" అన్నాడు. లోతుకుపోయి నిస్తేజములైన అతని నేత్రాల్లో ప్రేమరసం అశ్రురూపంగా బయలు దేరింది.

పితృభక్తుడైన కుమారుడు దుఃఖంతో "నాన్నా! నన్ను క్షమించు" అని డగ్గుత్తికతో అన్నాడు.

"నాయనా! నిన్ను శ్రీరామచంద్రమూర్తి రక్షించుగాక!" అవసాన దశలో పుత్ర వత్సలుడును, పూజ్యుడునైన జనకుని పవిత్రాశీర్వాదమును రంగాచారి పొందినాడు. భక్త్యావేశంచేత తండ్రి పాదాలకు తన శిరము తగిలించాడు. ఆ అమూల్యాశీస్సు అతని మనస్సుకి ఉత్సాహదాయకమైంది. "తండ్రికి వ్యతిరేకంగా నడిచాను కదా!" అనే భారం అతని మీద నుంచి పోయింది.

మరి రెండు రోజులకి నిష్కలంక చరిత్రుడున్నూ, దైవభక్తుడున్నూ అయిన ఆ వృద్ధ వైష్ణవుడు పరిపూర్ణమైన మనశ్శాంతితో పరమ పదించాడు. ఈ రోజుల్లో కుటీరవాసులు అక్కడే వుండిపోయారు. బంధువులెవరూ ఆ యింటికి రాలేదు. విచారపు రోజులు గడిచాయి.

దేవాలయ మాన్యాలన్నీ నాంచారు భర్తకి అప్పచెప్పి, శ్రీరామగిరిలోని తన ఇల్లు చెల్లెలికి, బావమరిదికి ఇచ్చేసి, రంగాచారి కుటీరంలోనే వుండిపోయాడు.

* * * * *

మరి మూడు సంవత్సరాల నాటి సంగతి.

సాయంకాలం నాలుగు గంటలన్నర అవుతూంది. ఇసకతిన్నెలింకా చల్లబడలేదు. కోయబాలురు పశువుల్ని గోదావరిలో నీరు తాగిస్తున్నారు. గాలికి సన్నని ఇసక తెరలు పైకి తీస్తున్నాయి. చిన్న కెరటాలు ఒడ్డుకి తాకి మళ్ళీ లోపలికి పోతున్నాయి. స్వచ్ఛజలంతో గౌతమి మెల్లగా నడుస్తూంది.

రంగాచారీ, రాజ్యము గోదావరి వైపు షికారు బైలుదేరారు. రాజ్యం చెయ్యి రంగాచారి చేతుల్లో బంధింపబడి వుంది. ఇద్దరూ మెల్లిగా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. వాళ్ళ వెనుక యిరవై గజాల దూరంలో నారాయణమూర్తీ, సుందరమ్మ వొస్తున్నారు. నారాయణమూర్తి చేతుల్లో రెండేళ్ళ కుర్రవాణ్ణి ఎత్తుకుని, మాటి మాటికీ ముద్దులాడుతూ, వాడి చేష్టలు భార్యకి చూపిస్తూ వొస్తున్నాడు.

"అసలుకంటే వడ్డీ ముద్దు సుమండీ! మన రాజ్యాన్ని ఎన్నడైనా మీరిల్లాగా ఎత్తుకుని ఆడించారా చిన్నప్పుడూ? మీకు మనవడు అంత ముద్దొస్తున్నాడేం?" అని నవ్వుతూ సుందరమ్మ భర్తతో అంది.

(అయిపోయింది)

(ప్రమోదూత (1930) ఉగాది సంచిక నుంచి)

**మేషం :** మీరు పత్రికా రంగాన శ్రమించువారా? మేలే. పత్రికాధినేతలా? మేలైన సమయమే. చిత్ర రంగాన శ్రమించువారా? సదవకాశాలున్నాయి. రాజకీయవాదులా? మేలే. స్త్రీలకు : సభా మర్యాద, కొందరకు ఉద్యోగ వసతి, గమనించండి.

**వృషభం :** డబ్బును గూర్చి ఏమాత్రం భయం లేదు. వాహనం కొనుగోలు చేయుటకు కొందరకు ఆస్కారం. గ్రామాంతరం వెళ్ళుటకు కొందరకు ఆస్కారం. అప్పులవలననో, డబ్బు చాలకనో ఏదో యిబ్బంది ఏర్పడవచ్చు. స్త్రీలకు : కొందరకు సత్కారాలు, సాంఘిక రంగాన మేలు కొందరకు.

**మిథునం :** శుభ సమయం. ఆదాయవృద్ధి, చలన చిత్ర రంగానుకూలత, మిత్ర వర్గమ్నుండి రావలసిన డబ్బు అందటం గమనింపదగిన సమయం. బంధుమిత్రులు యింటికి రాగలరు. అతిథి అభ్యాగతులను ఆదరింపనున్నారు. స్త్రీలకు : సభా గౌరవం, వృత్తియందు అభివృద్ధి, అపూర్వ వస్తు సేకరణ గల దినం.

**కర్కాటకం :** ఎవరేమనుకొన్నా మీ కెలాంటి లోటు లేదు. బంధువర్గీయులు రానున్నారు. ధనరీత్యా ఎలాంటి లోటు లేదని గ్రహింపగలుగుతారు. గ్రామాన, కుటుంబాన, బంధు మిత్ర సమూహంలో అనుకూలత, గౌరవ మున్నది. గ్రహించాలి. స్త్రీలకు : వస్తు వాహన సేకరణకు, కొందరకు వ్యాపారరీత్యా అనుకూలం.

**సింహం :** అపూర్వ వస్తు సేకరణకు అవకాశంగల వారం. కొందరకు వాహన యోగ్యతకు ఆస్కారం. నూతన మిత్ర సమాగమం, రాజకీయాలందు అనుకూలత గల దినాలే. కేతువు క్రమంగా ఉపకారి కానున్నాడు. స్త్రీలకు : సజ్జన సాంగత్యం, ధనలబ్ధి, మిత్ర సమాగమం.

# వారఫలం

## 6-10-1989 శుక్రవారం మొదలు
## 12-10-1989 గురువారం వరకు

**కన్య :** 'అర్ధాష్టమ శని' చర్య చవి చూడనే చూచారు. ఆరోగ్యలోపం కూడ కనిపించేసిందిగా! ఉద్యోగరీత్యా అనుకూలమే. కొందరకు నూతన వ్యాపారానికి ఆస్కారమున్నది. ధన వసతికి ఎలాంటి లోటు రాదు. స్త్రీలకు : సాధు సజ్జన సాంగత్యం. సుఖ శాంతులు, సభా మర్యాదకు లోపం రాదు.

**తుల :** 'శని' అనుకూలుడు. కుటుంబాన గ్రామాన, నగరాన లాభదాయకమైన, గౌరవప్రదాయకమైన పరిస్థితులు ఏర్పడనున్నవి. రాజకీయ రంగాన మీకు ప్రసిద్ధి ఏర్పడుట నిశ్చయం. పరిచితులతో స్నేహం లాభదాయకం. స్త్రీలకు : అభిమానించేవారున్నారు. ఆదాయమున్నది.

**వృశ్చికం :** మొదటి రెండు దినాలలో మీరు చేయని పనులు లేవు. ఆదాయానికి ఎలాంటి లోపం లేదు. ఒకానొక వ్యవహారాన విజయం చేకూరుట నిశ్చయం. ప్రసిద్ధులతో మంతనాలు సాగిస్తారు. సాధు సజ్జన సాంగత్యమున్నది. స్త్రీలకు : ఇరుగు పొరుగు తగాదాలు రావచ్చు. ప్రయాణమందు యిబ్బంది రావచ్చు. ఎంత జాగ్రత్తగా సంచరిస్తే అంత మేలు. గ్రహించారుగా!

**ధనుస్సు :** అభిమానించే వారున్నారు. సకల మర్యాదలకు ఆస్కారం. చాలకాలంగా కనిపించని వ్యక్తులు కనిపిస్తారు. రాజకీయాలందు మేలు. మేలు కోరినవారు యింటికి రానున్నారు. అతిథి అభ్యాగతులను ఆదరించవలసిన సమయం. స్త్రీలకు : నూతన మిత్ర సమాగమం, ఉద్యోగమందు పెంపు, యత్న కార్య సాఫల్యం, గ్రహించాలి.

**మకరం :** ధన బలమే చాలదు. మంది కావాలి. మార్బలం కావాలి. గ్రహ బలం కావాలి. అంతా ఎగుడు దిగుడుగా కొనసాగే వారం. ధన లోపం ఉన్నదిగాని, పెద్దగా బాధ లేదు. వృత్తి వికాసం, వ్యాపారాన సలక్షణమైన ఆదాయం గల దినం. దూరభారాలకు వెళ్లవలసిన అగత్య మున్నది. స్త్రీలకు : ఆదాయం, అనుకూలం, శుభయోగం గల సమయం. గ్రహించాలి.

**కుంభం :** చిత్ర రంగానుభవం గల వారికి అనుకూల దినాలు. నల్లని వస్తు విక్రేతలకు శుభదాయక సమయం. పంపిణీదారులకు అనుకూలం. రాజకీయవాదులకు మేలైన సమయం. 'గురు శనులు' అనుకూలురైనందున కావలసిన దేమి? స్త్రీలకు : శుభదాయకం, ఆరోగ్యదాయకం, నూతన మిత్ర సమాగమం. గ్రహించాలి.

**మీనం :** సభా రంగాన మీకు ప్రసిద్ధి యేర్పడనున్నది. పదిమందిలో ప్రసిద్ధి రానున్నది. విద్యావేత్తల సహాయమున్నది. కొందరకు 'లాటరీ' 'స్పెక్యులేషన్' లాభదాయకం, గ్రహించాలి. స్త్రీలకు : శుభ సమయం. వృత్తియందు పెంపు, రాజకీయ రంగాన ప్రతిభ, గుర్తింపు. ఒక్క వారంలో మరేం కావాలి?

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



## అమెరికన్ నౌకాదళానికి భారతీయ సంతతి అధికారి

అమెరికన్ నౌకాదళంలో భారతీయ సంతతికి చెందిన మొట్ట మొదటి, ఏకైక అడ్మిరల్‌గా విశిష్ట స్థానానికి చేరుకున్న రియర్ అడ్మిరల్ రూప్‌చంద్ 'రే' సరీరామ్‌ని పై ఫోటోలో ఎడమవైపున చూడవచ్చు. మధ్యన ఇండియాలో అమెరికా రాయబారి శ్రీ జాన్ ఆర్. హబ్బార్డ్, కుడిప్రక్కన అమెరికా నౌకాదళం "పసిఫిక్ ఫ్లీట్" కమాండర్ ఇన్‌చీఫ్ అడ్మిరల్ డేవిస్ ఇ. జెరిమియా కూడా వున్నారు. ఈ అమెరికన్ నౌకాదళం ఉన్నతాధికారు లిరువురూ ఇటీవల మ్యాడ్రిడ్‌ని సందర్శించారు. రియర్ అడ్మిరల్‌గా శ్రీ సరీరామ్ ప్రమోషన్‌ని అమెరికన్ సెనెట్ ఇటీవల ధ్రువీకరించింది. శ్రీ సరీరామ్ తండ్రి ఈ శతాబ్దం తొలి భాగంలో ఇండియా నుంచి అమెరికా వెళ్లి అక్కడ స్థిరపడ్డారు. (యు.ఎన్.ఐ.ఎస్.)



"రెండు పదుల వ్యక్తులు కేంద్రంలో కూర్చొని పనిచేయడంద్వారా నిజమైన ప్రజాస్వామ్యం లభించదు. అట్టడుగు స్థాయినుండి ప్రతి గ్రామంలోని ప్రజలు దీనికై కృషిచేయాలి"

—గాంధీజీ

# ప్రజలకు అధికారం

ముఖ్యమైన అంశాలు

**పంచాయితీ రాజ్ బిల్లు :**

* గ్రామ, బ్లాకు, జిల్లా స్థాయిలలో పంచాయితీలు.
* ఈ మూడు స్థాయిలలో అన్ని స్థానాలకు ఎన్నికల సంఘ పర్యవేక్షణలో ప్రత్యక్ష ఎన్నికలు.
* పదవీకాలం — 5 సంవత్సరాలు. ఏదైనా ఒక పంచాయితీ ముందుగా రద్దయితే, ఆరు నెలలలోగా ఎన్నికలు జరగాలి.
* షెడ్యూల్డు కులాలు/షెడ్యూల్డు తెగలకు జనాభాలో వారి నిష్పత్తినిబట్టి స్థానాల కేటాయింపు.
* స్త్రీలకు 30 శాతం కేటాయింపు.
* ప్రాంతీయ అభివృద్ధి ప్రణాళికలను సామాజిక న్యాయానికి లోబడి రూపొందించి అమలుపరిచే అధికారం.
* పంచాయితీ తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించటానికి తగిన నిధులు.

**నగరపాలిక బిల్లు :**

* మూడు రకాల నగరపాలికల్ల స్థాపనకు ఏర్పాటు — నగర పంచాయితీలు, పురపాలక సంఘాలు, పురపాలక కార్పొరేషన్లు.
* ఎన్నికల సంఘ పర్యవేక్షణ క్రింద ప్రత్యక్ష ఎన్నికలు—పదవీ కాల పరిమితి ఐదు సంవత్సరాలు.
* ఏదైనా పురపాలక సంఘం ముందుగా రద్దయితే ఆరు నెలలలోగా ఎన్నికలు జరగాలి.
* ప్రజా సేవా తత్పరులైన వ్యక్తులు తమ ప్రాంతంలో పనిచేయడానికి వీలుగా వార్డు కమిటీల ఏర్పాటు.
* ప్రాంతీయ వ్యవస్థలకు తగిన అధికారాన్ని ఇవ్వడం.
* ప్రణాళికలను రూపొందించడంలో వారికి ఎక్కువ పాత్ర.
* పురపాలక సంస్థలకు తగినంత ఆర్థిక సదుపాయం.



## అభివృద్ధిని, ప్రజాస్వామ్యాన్ని ప్రజల ముంగిట్లోకి తీసుకుని వచ్చే విప్లవాత్మకమైన చర్యలు

davp 89/637 TEL

# సాహితీ పజిల్

గెల్చుకోండి రు.200/-

## గళ్లనుడికట్టు-20




కూర్పు : పింగళి వి. కృష్ణారావు

ఆధారాలు

**నిలువు**

1. అప్పడములో బెల్లపు అప్పచ్చి
3. ఒక రాముడి ఆయుధం
4. ఈమె నిద్ర ప్రసిద్ధం
8. దేవుని చేరే మార్గం
9. దీని ఆచూకీ తేలికగానే తెలుస్తుంది
10. పొదరిల్లు
11. కంటికి దీనివల్ల చాలా బాధ
14. కావ్యేషు--రమ్యం
15. తిక్కన తండ్రి
17. వక్కకు తోడుగా కారం

**అడ్డం**

2. ఆకులు కూడ తినని పార్వతి
5. ఒకటి నిలువు లాంటిదే పన్ను
6. నాలుగు నిలువులో చివర మారితే అల
7. ఇది ఒక రకమయిన కవిత్వం
12. తమ్మినిబట్టి బ్రహ్మను చెయ్యండి
13. దుష్యంతుడి భార్య
16. నీరు ఇది ఎటుంటే అటు ప్రవహిస్తుంది
18. అంగీకారము
19. పదిహేడు నిలువు లాంటిదే కోతి
20. సోమవారం వాడు అందంగా వుంటాడు

ఆధారాలున్నాయి. నుడికట్టు గళ్లు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి! ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపినవారికి రు. 200/– లు బహుమతి లభిస్తుంది– ఒకరికన్నా ఎక్కువమంది కరెక్టు ఆన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే! - ఎడిటర్

**ముగింపు తేదీ: 26-10-'89**

ఆంధ్రసచిత్రవారపత్రిక

పంపినవారి పేరు : ........................................

పూర్తి చిరునామా : ........................................

........................................ పిన్‌కోడ్ ..........

# ఆయుర్వేద వైద్య సలహాలు

**వి. పాలెం-గుంతకల్**

ప్రశ్న : కుడికాలు, మోకాలుపై నల్లనిమచ్చలు, గోకినచో రసివచ్చును.

జవాబు : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి వ్యాధిహరణరసం, మధుస్నుహి రసాయనం, శారిబాద్యాసవం సేవించుచూ పైకి రసోత్తమాదిలేపం వ్రాయవలెను.

**పి. శివశంకర్-ప్రొద్దుటూరు**

ప్రశ్న : 2 సం.ల నుండి పురుగులు దొలిచినట్లు వున్నది. గోధుమరంగు చారలు.

జవాబు : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి వ్యాధిహరణరసం, మధుస్నుహి రసాయనం, శారిబాద్యాసవం లోనికి సేవించుచూ పైకి రసోత్తమాది లేపం వ్రాయవలెను.

**ఎస్.పి. శ్రీనివాస్-అనంతపురం**

ప్రశ్న : ముఖముమీద నల్లని పొరలు, జుట్టు రాలుట, ముఖము ఆకర్షణగా నుండుటకు.

జవాబు : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీవారి శారిబాద్యాసవం, మధుస్నుహి రసాయనం, పూర్ణచంద్రోదయం మాత్రలను లోనికి సేవించుచూ తలకు భృంగామలక తైలం రాసుకొనవలెను.

**ఎం. ప్రసాదరావుగారు, గాజువాక.**

ప్రశ్న: గ్యాస్టిక్ ట్రబుల్ నివారణ, విరోచనము సరిగా అవ్వదు.

జవాబు: చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ చింతలూరువారి స్వర్ణక్రవ్యాదరసం 10 గ్రా. +సూర్యావర్తి 10 గ్రా. + పైత్యాంతకరసం 10 గ్రా. కలిపి 61 మాత్రలు చేసి ఉదయం - సాయంకాలం మజ్జిగతో ఒక్కొక్క మాత్ర సేవించవలయును. త్రివృత్ లేహ్యం 200 గ్రా. రాత్రి పరుండబోవునప్పుడు 15 గ్రా. లేహ్యం నమిలి మ్రింగి వేడినీరు త్రాగవలయును.

ఔషధములు దొరకుచోటు : చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ, బ్రాంచి కొత్త రోడ్డు జంక్షన్, టి.వి.ఎస్. ట్రాన్స్‌పోర్టు ఆఫీసు ఎదురుగాగల మేడపైన, విశాఖపట్నం.

**పి. రామచంద్రరావు, కడప.**

ప్రశ్న: తలనొప్పి నివారణ.

జవాబు: చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ చింతలూరువారి చంద్రావర్తి రసర 10 గ్రా. + తిప్పసత్తు 10 గ్రా. కలిపి 51 మో. ఉదయం - సాయంకాలం మాదీఫల రసాయనంతో ఒక్కొక్క మోతాదు సేవించవలయును. తలకు బ్రాహ్మితైలం రాయవలయును.

ఔషధము దొరకుచోటు: నాగరాజలక్ష్మి మెడికల్స్, ట్రంకురోడ్డు, కడప.

**మహాలక్ష్మిగారు, కాకినాడ.**

ప్రశ్న: పొడిదగ్గు, తుమ్ములు, జలుబు, అపానవాయువుల నివారణ.

జవాబు: చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ చింతలూరువారి స్వర్ణక్రవ్యాదరసం 10 గ్రా. + పైత్యాంతకరసం 10 గ్రా. కలిపి 51 మాత్రలు ఉదయం 1 మాత్ర, సాయంకాలం 1 మాత్ర భోజనం అయిన తరువాత మజ్జిగతో సేవించవలయును. లోహ బ్రక సిందూరం 10 గ్రా. త్రిఫలచూర్ణం 10 గ్రా. కలిపి 51 మోతాదు ఉదయం 1 మోతాదు, సాయంకాలం 1 మోతాదు తేనెతో సేవించవలయును.

ఔషధములు దొరకుచోటు: చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ, బ్రాంచి గంజాయ్‌వారివీధి, గ్యాస్ కంపెనీవద్ద, కాకినాడ.

# అవీ-ఇవీ-అన్నీ



హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ సినీ కల్చరల్ అకాడమీ వారి ఆధ్వర్యంలో, 'నంది' అవార్డు గ్రహీతలు, 'ప్రేమ' చిత్ర దర్శకులు శ్రీ సురేష్ కృష్ణ, మరియు 'ప్రేమ' చిత్ర సినిమాటోగ్రాఫర్ శ్రీ పి. ఎస్. ప్రకాశ్‌గార్లకు సన్మానం జరిగినపుడు, సినీ నటుడు శ్రీ కమలహాసన్ శ్రీ సురేష్‌కృష్ణగార్కి మెమెంటోను బహూకరిస్తున్నప్పటి చిత్రం. అకాడమీ అధ్యక్షుడు శ్రీ ఎస్. రాధాకృష్ణగారిని, కార్యదర్శి శ్రీ ఎ. రవీంద్రరావు గారిని కూడ చిత్రంలో చూడవచ్చు.

## దోమల బాధా నివారిణి
## ''జాప్''



రాత్రిపూట దోమలవల్ల నిద్రాభంగం వాటిల్లకుండా వుండేందుకుగాను బీనా ఎలక్ట్రోమాటిక్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారు 'జాప్' అనే పేరుతో ఒక క్రొత్తరకం ఎలక్ట్రానిక్ పరికరాన్ని మార్కెట్లోకి విడుదల చేశారు! ఈ పరికరం నుండి వచ్చే శబ్దతరంగాలకు దోమలు మటుమాయమై పోతాయట. 240 గంటలపాటు ఒకే ఒక పెన్సిల్ సెల్‌తో పనిచేసే ఈ పరికరం కేవలం 75 రూపాయలు మాత్రమేనంటున్నారు.



'ఆపద్బంధు' వాహనాల నిర్వహణకై వైశ్యా బ్యాంకు అధ్యక్షుడు శ్రీ రమేష్ గెల్లీ రాష్ట్ర అత్యవసర వైద్య సహాయ కేంద్రం అధ్యక్షుడు, రాష్ట్ర అసెంబ్లీ స్పీకరు శ్రీ జి. నారాయణరావుకు 50 వేల రూపాయల మేరకు చెక్కును విరాళంగా అందజేస్తున్న చిత్రం. హైదరాబాద్ అల్విన్స్ లిమిటెడ్ అధ్యక్షుడు శ్రీ పి. ఎస్. ఆర్. రావు, వైశ్యా బ్యాంకు హైదరాబాద్ డివిజనల్ మేనేజరు శ్రీ సి. వి. మోహన్ రాజా, డెవలప్‌మెంట్ ఆఫీసర్ శ్రీ పి. ఎస్. ఆర్. మూర్తి కూడా చిత్రంలో వున్నారు.



జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్శిటీలో గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషి కార్టూనిస్ట్ సత్యమూర్తికి మెమెంటోని బహూకరించారు. ప్రక్కన జె. యన్.టి.యు.-డీన్, ప్రొఫెసర్ డా. బి. హెచ్. బ్రిజ్ కిషోర్‌గారు.



చికాగోలోని తెలుగు కమ్యూనిటీ హాలులో ప్రముఖ చిత్రకారుడైన శ్రీ ఉత్తమ్ ఆర్ట్ ఎగ్జిబిషన్ జరిగినప్పుడు ఎగ్జిబిషన్‌ను సందర్శించిన నటుడు చంద్రమోహన్, చిత్రకారుడు శ్రీ ఉత్తమ్. ప్రక్కనున్నవారు "యు. ఎస్. ఆర్ట్ అసోసియేట్స్" వైస్ ప్రెసిడెంటు శ్రీ డి. సంగ్రామ్



# పరువంపు పాటకి 60 వసంతాలు!

భాషా భేదంలేకుండా భారతీయులంతా గంగానది పేరు చెప్పుకుని గర్వపడ్డట్లు లతామంగేష్కర్ పాటలను ఏదేశమేగినా ఎందు కాలిడినా సగర్వంగా చెప్పుకుంటారు. స్వతంత్రంవచ్చిం తర్వాత యింతవరకు గడచినకాలంలో చాలామంది గాయనీమణు లు వచ్చారు వెళ్ళారు కాని ఆనాటికీ నేటికీ అందర్నీ మంత్రముగ్ధుల్నిచేస్తూ వస్తున్న అవిశ్రాంత అమృతగానం లతామంగేష్కరమ్మదే! "నిదుర పోరా తమ్ముడా" అంటూ ఆమె కంఠాన జోలవిన్న ఏ తమ్ముడు కూడా హాయిగా నిశ్చింతగా కనులుమూసుకొనినిదురమ్మవొడిసౌఖ్యాన్ని పొందకుండా వుండడు-విరహం, ప్రణ




యం, శాంతం, చిలిపి చికిలితనం ఏరసమైనా ఆ అమృత భాండంనుంచి వెన్నెల సోనలై జాలువారుతాయి.

బంగారం డిస్కులేకాదు-ప్లాటినం డిస్కులందుకున్న లతమ్మకి 60 వసంతాలు నిండాయి. షష్టి పూర్తి ఆమెకిగాని ఆమె మృదు మధుర వాణికి శిశిరాలు లేవు అన్నీ వసంతాలే!

"ఆయేగా ఆయేగా కోయీ ఆనేజానేవాలా ఆయేగా" మహల్ పాట "యహ్ జిందగీ ఉసీకాహై జో కిసీకా హోగయా" అనార్కలీ పాటలనాడు ఆమెకెంత ప్రాచుర్యంవుందో యివ్వాళకూడా ఆమె కంత పాప్యులారిటీ వుంది. పాప్యులారిటీకి మరోపేరే లతా. అట్లా అని సంగీత విద్వాంసుల మధ్య ఆమెకి చిన్న పీటలేదు-అక్కడా ఆమెకు మన్నన వున్నది. వేలకొలదీ పాటలు అదొక యంత్రం నుంచి వెలువడుతున్నట్లు ఆమె నిర్విరామ స్వర పేటికనుంచి పండిత పామర జనరంజకంగా రావలిసిందేను!

"లతలా" అని ఎవరినైనా ఇవాళ అనవలసిందేగాని - ఫలానీవారిలాగా "లతా" అనడానికి వీలులేదు. ఆమెకి ఇవాళకూడా పాతపాటలే ఇష్టం-ఆమె ఫ్యాన్స్‌కి పాతపాటలే ఇష్టం-యివ్వాళ్టి పాటలు బాంగ్ బాంగ్, డింగ్ డిష్, ఉస్సు, అస్సూ-అంటూ చేసే గోలక్రిందనే లతా మంగేష్కర్ వొక యింటర్‌వ్యూలో కొట్టి పారేసింది.

భారతదేశానికి శత్రుదేశాలున్నాం కాని లతా మధుర కంఠానికి శత్రుదేశాలు లేవు.

మాతృభాష మరాఠీని ఆమె హిందీ సంగీత సామ్రాజ్య మహారాణి అయినాకూడా వదిలిపెట్టలేదు. మాతృభాషలో సినిమాలు నిర్మించింది. సినిమాలకి సంగీత దర్శకత్వం వహించింది. కొన్నింటిలో నటించింది. అసలామె వెండితెర ప్రవేశమే బాలనటిగా! అచ్చం కోకిలమ్మలాగ వున్న నాటి టీనేజర్ లతా-వెండితెరమీద పాడుతూ కనపడ్డది. ఇవాళ కోట్లాది హృదయ యవనికమీద ఆమె పాటలు స్వర స్వరూపాలై పులకింతలు రేపుతున్నాయి.

ఆమె పాటలు-పాడిన చిత్రాలు

వగైరా ఇవ్వాలంటేమైలుకోఅంగుళం వంతున స్కేలు వుంచుకున్నప్పటికీ యిక్కడ చోటు చాలదు-అంచేత 60 వసంతాల 'లత"మ్మను అభినందిస్తున్న సంగీత ప్రియులందరితోనూ గొంతుకలిపి జేజేలు చెప్పేముందు ఆమె నటించిన మరాఠీ చిత్రాల పేర్లు, హిందీ చిత్రాల పేర్లు యిస్తాను.

పాహ్లీ మంగళగౌర్ (1942) ఛిముక్లా సంసార్ (1943) మాఝే బాల్ (1943)గాజాబాహూ(1944) బడీమా(1945)జీవనయాత్ర(1940) - యివిగాక సుభద్రా మందిర్ అనే రెండు హిందీ చిత్రాలలో 1947 ప్రాంతాలలోనటించిందామె.ప్రస్తుతం "లేకిన్" అనే చిత్రం నిర్మిస్తున్నది. ఇది "నిర్మాత" గా ఆమె మూడో చిత్రం అవుతుంది. ఒక అరడజను మరాఠీ చిత్రాలకామె సంగీత దర్శకత్వం కూడా వహించింది.

ఆమె కిష్టమైన గాయకుడు అమర్ సైగల్-సైగల్ని ఆమె కల్సుకోలేదు కాని-సైగల్ కుమారుడు-సైగల్ పెట్టుకున్న నవరత్నాల వుంగరం వొకటి లతాకి బహూకరించాడట!అదిఆమె ఎల్లప్పుడూ ధరిస్తుందిట!- స్వతంత్ర భరతమాత సగర్వంగా తన కంఠాన ధరించే సంగీత రత్నమాల లతా మంగేష్కర్!

## శ్రీలంకలో మన సేనకి 'శాంతి'

శ్రీలంకలో భారతీయసైన్యాల 'ఉనికి' మీద కొలంబో - ఢిల్లీలు రెండు - "పాము చావని, కర్ర విరగని" మాదిరి ఒక ఒప్పందాన్ని సెప్టెంబర్ 18 న చేసుకున్నాయి. ఈ సంవత్సరాంతానికి అనగా ఒప్పందం జరిగిన వంద రోజుల లోగా భారతీయ సైన్యాలు పటాలాలు పటాలాలుగా, ఒడలెక్కి ఇంటిముఖం పట్టాలి అని - కాదు కాదు పట్టే ప్రయత్నం చేయాలన్నదే ఒప్పందంలోని సారాంశం - భారతీయ సైన్యాల ఉనికిని ప్రేమదాస గ్దూడా తన మనస్సు



లోపల లోపల ఉండాలనే .కోరుకుంటారనే రాజకీయ పరిశీలకులు కొందరున్నారు !

ఎల్. టి. టి. ఇ. పులులను ఈ రెండు సంవత్సరాల కాలంలో సహజ భుజకీర్తులు, సశాస్త్రీయ అస్త్ర శస్త్రాలు వున్న "శాంతి సేన"యే అణగద్రొక్కలేక పోయింది. (మనలో మాటలెండి ఇది). అలాంటప్పుడు ప్రస్తుతం "ప్రేమదాస" గూడు క్రింద ప్రస్తుతానికి చేరి యా. పి. ఎల్. ఆర్. ఎఫ్. మీద కయ్యానికి కాలు దువ్వుతున్న తమిళ ఈలం పులులు రేపొద్దున్న మళ్లీ "దీగ్ బచ్చా" అంటూ తిరగబడితే - శ్రీలంకేశుడు తట్టుకోలేడు. ఈశాన్య ప్రాంతంలో ఇప్పుడున్న గవర్నమెంటు - అసలు గవర్నమెంటు కాదు!" ఎందుకంటే మేం ఎన్నికలలో పాల్గొనలేదు అంటున్న ఎల్. టి. టి. ఇ. ఇవాళ కాకపోతే రేపైనా ఎన్నికల రంగంలో దిగుతుంది. అప్పుడు ప్రేమదాస బలం దానికుంటే - ఇప్పుడు భారతీయ సైన్యాల అండదండల చాటున "మాకు మిగతా హక్కులు కూడా ఇవ్వండి. హక్కులు లేని వేరు కాపురం మాకెందుకు" అంటున్న గవర్నమెంటు పార్టీ దిక్కులేనిదైపోయినా పోవచ్చును. అందువల్లనే శ్రీ ప్రేమదాస రంకెలు తగ్గించాడు. కాగల కార్యం గంధర్వులే తీర్చారు అన్న చందాన మన సేనలు ఎల్. టి. టి. ఇ. ని - ప్రేమదాస శరణు జొచ్చేలాగా చేశాయి. "శాంతి సంఘంలో" సింహళ టెర్రరిస్టుల సంఘం కూడా వుండే విధంగా ప్రేమదాస చేయగలిగాడు. దీంతో ఒక రాజకీయ తుఫాన్ సద్దు మణిగింది తాత్కాలికంగానైనా !

శాంతి సంఘం కాని, శాంతి సేన కాని ఇప్పుడు శ్రీలంకలో వున్న తీవ్రవాద వర్గాల మధ్య సయోధ్య కుదర్చకపోతే - జరిగేదేమీ ఉండదు. తీవ్రవాద వర్గాలు తమిళ ప్రాంతాలలో ఎంతగా ఉన్నాయో, సింహళ ప్రాంతంలో కూడా జె. వి. పి. రూపంలో అంతకంటే కూడా ఎక్కువగా కరాళ నృత్యం చేస్తున్నాయి - ఈశాన్య ప్రాంతంలో మరొకసారి ఎన్నికల రణరంగంలోకి అవి తీవ్రవాద వర్గాలను లాగి - బ్యాలెట్ బాక్సు చెప్పే తీర్పుకు తలవొగ్గేలా చేయటంలోనే ఒక పరిష్కారం రాగలదు. అయితే ఇది సాధ్యమా? పులుల చేత సాత్వికాహారం తినిపించాలంటే శాంతి సంఘానికి గల శక్తి చాలదేమో...? ఏది ఏమైనా భారత దేశంలో రాజీవ్ గాంధీకి ఈ సమస్య మీద ఊపిరి పీల్చుకునే టైము దొరికింది. ముళ్ల కంచెమీద వడ్డ పైపంచెను చిరగకుండా తీసుకునే ప్రయత్నమే ఈ శాంతిసేన ఉపసంహారణ ఒప్పందం. ఇందులో ఉన్న మడత పేచీలు చాలా ఉన్నాయి. అవి అంత తేలికగా నూరు రోజుల కాలంలోనే పరిష్కారం అయిపోతాయి అనుకున్నవాడు 'ఆశావాది' అవుతాడే కాని రాజకీయ పరిశీలకుడు కాదు.

25-9-89

## "ఆత్రేయ"కు నివాళి
## నాకు నచ్చిన "మనసుపాట"

అమర కవి ఆత్రేయ రచించిన మీ కిష్టమైన, హృదయాలు పిండుకొనే పాట తీసుకుని దాని ముక్కటం లేదా పల్లవి రాయండి- అది ఏ చిత్రంలోదో, ఎవరెవరి మీద ఎవరి కంఠంతో చిత్రీకరించారో కూడా రాయండి. మీ పేరు-వూరూ రాసి పోస్టు చేయండి-కేవలం "కార్డు" మీదే రాయండి! వారంరోజుల్లోగా-

**ఆంధ్ర సచిత్ర వార పత్రిక**

గాంధీనగర్, విజయవాడ-3కి పంపండి.

- ఎడిటర్

# వీక్లీ పోస్టు

(4 వ పేజీ తరువాయి)

## ఆత్రేయకి అశ్రువందనం!

దేవుడు మనుషులపై మత్తుమందు చల్లాడు
మత్తుమందు చల్లి మనుషుల్ని మోసం చేసేడు
దేవలోకంలోని గంధర్వ కిన్నెరల కవిత్వాలు
తనపై అమృతధారల్ని వర్షించలేదేమోమరి
మన మనసుకవిపై మనసైన దేవుడు
తొందరపడి మనుషుల్ని మోసం చేసేడు
ఇంత మంది మనసుల్ని మూగ చేసేడు!
రాయక– రాయించుకో జూసిన వాళ్ళనీ
రాసి– విన్న వాళ్ళనీ ఏడ్పించిన
ఆ రాయని భాస్కరుని చేత
దేవుడంత గొప్పగా మళ్ళీ రాయించుకోగలడా
మనసున్న ఇంత మంది ఉసురు
అదైవానికి తగలకపోతుందా–
మనసుని మథించిన మనసుకవీ!
మీ గీతాల్లో మీ మనసును వీక్షిస్తాం
మీ ఆఖరి గీతం వరకు విని తరిస్తాం
మీ గీతాలన్నీ పాడుకుంటాం
మీ గీతాల సారాన్ని జీర్ణించుకుంటాం
ఇప్పుడు–
మా మూగ మనసులో నీరాజనాలర్పిస్తున్నాం
చెమరించిన నయనాలతో అశ్రువందనాలర్పిస్తున్నాం!

–కనగాల రామచంద్రరావు
వెంకటపాలెం

## ఈ వారం సలహా

విజయవాడ రైల్వేస్టేషన్‌లో ఏ ప్లాట్‌ఫారమ్‌మీదికి ఏ ఎక్స్‌ప్రెస్ రైలు వచ్చి అగుతుందో ఎంక్వయిరీ ఆఫీసులో అడగకండి! జవాబురాదు. లైసెన్స్ కూలీ నడగండి కొంతలో కొంత చెబుతాడు!

## తేట తెలుగు పాట!

నాలుకపై మొగ్గ తొడిగి
పగడాల పెదవులపై విచ్చుకొని
పాలమీగడలాంటి
తెల తెల్లటి రెక్కలతో
మెత్త మెత్తగా ఎగిరి వెళ్తుంది
పక్షిలా నీ పాట గాలిలో తేలుతూ
గుండెల్లోంచి చొచ్చుకొచ్చిన
అచ్చమైన పాట
నాగరికత కాలుష్యం సోకని
అసలు సిసలు పాట
కష్ట జీవుల కన్నీటిని
మరిపించే పాట
తనువుకు ఆనంధాల
అద్దకాలు అద్దే పాట
అది తేట తెలుగుపాట!

కొడిమెల శ్రీరామమూర్తి, ఏలూరు

## ఆ రైల్లో నేనూ వున్నాను..

ఆలస్యంగా ఖర్గపూర్ చేరిన ఆంధ్రసచిత్ర వార పత్రిక (1-9-89)లో 'తాజాకాలమ్' శీర్షికన వీరాజీగారి 'దేశభక్తిలేని చాయ్‌వాలా'కు ప్రతిస్పందనగా ఈ లేఖ. వీరాజీగారి సందేహాలు ప్రతిఒక్కరు అంగీకరించదగ్గవి. 14-8-89 నాడు విజయవాడ నుండి సరియైన సమయానికి హౌరా వైపు బయల్దేరిన డౌన్ కోరమండల్ ఎక్స్‌ప్రెస్ ప్రయాణీకుల్లో నేనొకణ్ణి. అగ్ని ప్రమాదం సంభవించింది కోచ్ నంబర్ ఎస్.6లో కాగా నేనున్నది కోచ్ నెంబర్ ఎస్.8లో.

వాయువేగంతో సాగిపోతున్న డౌన్ కోరమండల్ ఎక్స్‌ప్రెస్‌ని భీమడోలు ప్రాంతంలో హఠాత్తుగా చైనులాగడం జరిగింది. కారణం ఏమిటని తొంగిచూచిన ప్రజలకు కోచ్ ఎస్ ఆరులో నుండి దట్టమైన పొగ రావడం కనిపించింది. ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని సదరు బోగీ ప్రయాణీకులు బండి వెస్టిబుల్ కావడంతో అగ్నిప్రమాదం లేని మిగతా బోగీలలోకి పారిపోవడం ప్రారంభించారు తమతో వున్న అన్ని సామాన్లను వదిలి ప్రాణ రక్షణ ధ్యేయంగా. అగ్నిప్రమాదం బోగీలో ప్రవేశించిన ప్రయువేటు వెండరు చాయ్‌వాలా స్టవ్ పుణ్యమా అని లెట్రిన్‌లో జరిగింది. వాయువేగం పుణ్యమాని సృష్టింపబడ్డా కుదుపుల కారణంగా స్టవ్ తిరగబడింది. గమనించే పరిస్థితిలో లేడు చాయ్‌వాలా. ఫలితంగా బోగీ పూర్తిగా మసైపోయింది. ప్రాణనష్టం జరగలేదు-చిన్న చిన్న గాయాలు తప్ప.

అగ్నిప్రమాదం చూచిన వెంటనే పేంట్రీ కార్ సిబ్బందిబండిలో వున్న రైల్వే సిబ్బంది సహకారంతో చేతిలో వున్న ఫైర్ ప్రివెంటివ్ డివైసెస్‌తో రంగంలోకి దిగారు. భీమడోలు అవుటర్‌లో జరిగిన ఈ అగ్నిప్రమాదం కబురు స్టేషన్ మాస్టరు వరకు వెళ్లడం. వెన్వెంటనే అగ్నిమాపక దళాలకు కబురు చెయ్యడం-అరగంట వ్యవధిలో వారు వచ్చి స్థితిని అధీనంలోకి తెచ్చుకున్నారు. ఈలోపుగా రైల్వే సిబ్బంది ఆ మంటలు మరో బోగీలోకి ప్రవేశించకుండా వెస్టిబుల్‌ని తెగ్గొట్టి వేరు చేయడం జరిగింది. ఆ తర్వాత బండి మెల్లగా భీమడోలు స్టేషనుకు చేరుకుంది.

రెండు గంటల తర్వాత విజయవాడ డివిజనల్ రైల్వే మేనేజర్ ఘటనా స్థలానికి విచ్చేసారు. భీమడోలు స్టేషనులో బాధితులకు సాధ్యమైనంత సహకారాన్ని, ఆప్తులకు సందేశం పంపే ఏర్పాటుతో, దిగులుగా వున్న బాధితులకు మానసిక ధైర్యాన్ని నూరిపోసారు. కొద్ది మోతాదులో ఆర్థిక సహకారాన్ని కూడా బాధితులకు అందజేసారు.

ఇక వీరిని అరికట్టే ప్రయత్నం..నేను రైల్వేలో టికెట్ కలెక్టర్‌గా పని చేస్తున్నా. వారిని ఎన్నో విధాలా బెదిరించి బోగీలోనికి రాకుండా నిర్బంధం చేయబోతే, బొండాలు చెక్కుతున్న వెండర్ మమ్మల్ని చేతిలో కత్తిని మార్చి మార్చి చూస్తూ నిర్లక్ష్య ధోరణిలో సాగి పోవడం చూస్తే వారి అంతరంగిక భావాలు ఎవరికైనా యిట్టే అర్థమవుతాయి. భద్రతాసిబ్బంది సహకారంతో వారిని ఎదుర్కోపోతే మరుసటి రోజున వారి యూనియన్ నేతృత్వంలో రైలు రోకో ఫలితంగా రైల్వే అధికారులు రైల్వే సిబ్బందిని పిలిచి చీవాట్లు పెట్టి 'యాక్ట్ విత్ టాక్ట్' అంటూ నీతి బోధ చేయడం..అడ కత్తెరలో పోక చెక్కలా రైల్వే సిబ్బంది. ఏది ఏమైనా యిటువంటి ప్రమాదాలు నిర్మూలనకు బండిలో ప్రయాణీకులు కూడా చేయూతనందిస్తే, కాస్తోకూస్తో అదుపులోకి తీసుకురావచ్చు అని నా అభిప్రాయం-

జోగారావ్ గుండాన
ఖరగ్‌పూర్

Editorial Adviser: *S. RADHAKRISHNA*, Editor: *VEERAJI*,
Printed and Published by *S. NAGESWARARAO* for Nageswara Rao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520003.
Phones: Editorial: 75667, Business: 61247, 61248.



ఈ మోపెడ్ కొన్నదగ్గర్నుంచీ నా ప్రాణానికి నిశ్చింతలేకుండా పోయింది. నాలో వున్న శక్తంతా దాన్ని స్టార్ట్ చేయటంతోనే హరించుకుపోతూంది. ఎక్కడపడితే అక్కడ ఆగిపోవటం - దాన్ని తోసుకొని షెడ్‌కి తీసుకెళితే వాడు దాన్ని విప్పటంతో - తీగలాగితే డొంకంతా కదిలిన చందాన అవీయివీ వూడ బెరికి అరిగిపోయాయనో - తెగిపోయాయనో చెప్పి వందో రెండొందలో చేతి చమురు వదిలించటం - ఇదో తంతుగా మారింది.

"పోనీ వెధవ మోపెడ్ అమ్మిపారేయకూడదూ!?" అని ఒకటే పోరుపెడుతూంది మా ఆవిడ.

అచ్చం ఓ ఆరునెలల క్రితం - ఇట్లాగే పోరింది బండి కొనమని. మీకంటె ఎటెండర్ ఏకాంబరంకూడా బండి కొన్నాడంది. వారితో వీరితో పోలికలు పెట్టి నానా రాద్ధాంతం చేసిపారేసి నాచేత 'లోను' పెట్టించి మరీ కొనిపించింది.

ఈనాడు అది పాడయిపోయిందని మా ఆవిడమీద నేరంతోసేస్తున్నాగాని, నామట్టుకు నేనుకూడా పొరుగు వాళ్లంతా బళ్లు కొనటంచూసి అసూయ చెందటం - కోరిక పెంచేసుకోవడం - అదే సమయంలో మా ఆఫీసులోవారంతాకూడా కలిసికట్టుగా కొనిపించే ప్రయత్నానికి పాల్పడ్డం జరిగింది.

అందునా ఓ రోజు మా ఆఫీసుముందు, లారీ ఒకటి వచ్చి ఆగింది. దీనిమీద ఓ క్రొత్త మోపెడ్ 'డిస్‌ప్లే'చు ఎడ్వర్టయిజ్ చేయటానికని వూరేగిస్తున్నారు.

దానిపేరు 'గప్‌చిప్' అని, చడీ చప్పుడు లేకుండా వెళ్తుందని దానికాపేరు పెట్టినట్లు, ఫుట్ బ్రేక్సు, ఆటోమేటిక్ గేర్స్, ఆయిల్ కన్జమ్షన్, షాక్ ఎబ్జార్బర్స్ గురించి చెబుతూ అది ఇటలీ కొలాబరేషన్ అనికూడా వివరించాడు.

బయటకెళ్లి చూసిన మా అందరికీ అందంగా దర్శనమిచ్చింది.

మొత్తానికి నేనా రోజే ఓ బండి వాడ్నవటం - అది మొదలు మొహమాటాలలో ఇరుక్కోవటం - ఆ మొహమాటాలకు ఫలితంగా తడిసి మోపెడైన రిపేర్స్ రావటం - పగలు - రాత్రి అది నాకొక్క సమస్యగా మారటంకూడా వరుసగ్గా జరిగిపోయాయి.

ఆ రోజుకూడా మోపెడ్‌తో ఆఫీసుకు బయలుదేరి వెళ్తుంటే సరిగ్గా గంట స్తంభం దగ్గరకొచ్చేసరికి ససేమిరా కదలనని పూరీ జగన్నాధుడిలా మొండికేసింది. వందతిట్లు తిడితే ఆ మొండి జగదు మంచి జగ్గడై కదుల్తాడేమోగాని - 'గప్‌చిప్' తన పేరును నిలబెట్టుకుంది.

నేనేనాడూ కుస్తీపట్లంటే ఎరుగను. కానీ ఇంతకంటె కుస్తీపట్లు సులువేమో ననిపించింది. పెద్ద చెరువులో ఎత్తిపడేయాలనిపించేంత ఒళ్లు మండిండి.

ఆడెబ్బై కేజీల శకటాన్ని తోసుకుంటూ అక్కడికి దగ్గర్లోని మెకానిక్ దగ్గర పడేసి సాయంత్రం వచ్చేసరికి రెడీచేయమన్నాను.

ఆఫీసుకి అసలే గంటలేటయింది.

ఆఫీసరు నామీద విరుచుకుపడ్డాడు.

డిసిప్లిన్ లేదన్నాడు.

కారణం చెప్పాను.

"ఇదేసాకు ఓ వందసార్లు నీ నోటంట విన్నాను. ఏ రాచకార్యాలు వెలగబెట్టు కొస్తున్నావో నాకేం తెలిసేదుస్తుంది. ఆ వెధవబండి అమ్మి పారేస్తే పోతుంది.

చాలాసార్లు ఆఫీసుకి లేటవటానికి కారణభూతమైన మోపెడు నాపాలిట భూతంలా దాపురించింది.

ఆఫీసయినాక సరాసరి మెకానిక్‌ని కలిసాను. నన్ను చూస్తూనే నా చేతిలో అంజనేయుడితోకంత స్పేర్‌పార్ట్స్ లిస్టు పెట్టాడు.

"మొత్తంబండివిప్పి ఓవరాయిలింగుచేసి పార్ట్స్ అసెంబిల్‌చేసి ఇవ్వటానికి అయిదొందలౌతుంది" మీరు డబ్బివ్వటమే తరువాయి నేను తేవటానికి సిద్ధం అన్నట్లు కనిపించాడు.

మాట నాలుగు జ్వరం వచ్చేసింది.

"కొని ఆరునెల్లుకాలేధు. ఇంతమదుపు ఎందుకౌతూంది." నాకోపం, చిరాకు వాడిమీద రుద్దాను.

"ఎందుకౌతుందేమిటండీ! ఏ చేతకో, సుజుకీవో కొనుక్కుంటే బాగుండేది. మీరు డబ్బుకి జంకి మోపెడ్ కొనుంటారు. అందుకే ఇప్పుడిన్ని బాధలు పడ్డం... మరెందుకు అమ్మిపారేయండి అన్నాడు.

ఇంతమంది చెవినిల్లు కట్టుకుని చెప్పబట్టి అదే అభిప్రాయం నాలో కాంక్రీటులా స్థిరపడిపోయింది.

ఎంతకు కొన్నానో చెప్పి... ఎంతకెళ్తుందో అడిగాను.

చెప్పాడు!

గుండె గుభేలుమంది !!

"ఏమిటి మూడువేలు లాసుకా!!"

"పోనీలెండి సార్... నేనేదో మింగేస్తున్నట్లు మాట్లాడుతున్నారు. పట్టుకుపోయి మీరే అమ్ముకోండి" అని మోపెడ్ స్టాండ్ తీసి నావైపు త్రిప్పాడు.

వాడిని బ్రతిమిలాడేసరికి నా కంఠనరాలు తెగిపోయాయి.

"నిజానికి మోపెడ్ కొనటానికి ముందుకెవరూ రారుసార్! మార్కెట్లో ఇప్పుడు కొన్నివందల బండ్లు దిగాయి. కానీ మేమే పార్టీని వెతుక్కొని ఏదో ఓలా నచ్చచెప్పి అమ్మిపారేస్తాం. మీకిష్టమైతే చెప్పండి." అని హేండిల్‌బార్ అటు-యిటు త్రిప్పుతూ అడిగాడు మెకానిక్.

ఇంకా అప్పు అప్పులాగే వుంది - ఇట్లా మూడువేలు నష్టానికి అమ్మటం? కానీ తప్పదు. వుంటున్నకొద్దీ దాని రేటు మరీ పడిపోతుంది.

సరేనన్నాను.

తన కమీషన్ మూడువందలు - బాగుచేసి అమ్మేదాకా పూచీ పడ్డానికి అయిదువందలు - వెరసి ఎనిమిదివందలు వచ్చే డబ్బులో మినహాయించుకోవలసి వుంటుందనికూడా చెప్పాడు.

ఏవో ఫారాలు తెచ్చి సంతకాలు తీసుకున్నాడు.

నేనా ఛాయలకే రానవసరంలేదని వారం తదుపరి అమ్మి డబ్బు ఇంటికి తెస్తానని అడ్రసు తీసుకున్నాడు.

అన్నప్రకారం నా సొమ్ము నాకు అందిం

చాడు.

తలంటుకున్న హాయి కల్గింది. వచ్చిన నష్టం తలుచుకున్నప్పుడల్లా కళ్లల్లో పులుసు పడిన అనుభూతి కల్గుతూంది.

ప్రస్తుతం రెండు బస్సులుమారి ఆఫీసుకి వెళ్తున్నాను! కొలదికాలం గబ గబ గడిచిపోయింది.

ఒకరోజు ఆఫీసునుండి వచ్చేసరికి నాన్న గారి దగ్గర్నుంచి వుత్తరం వచ్చినట్లు తెలిపింది మా ఆవిడ.

తీసుకుని చదివాను.

ఆరు నెలలుగా నేను వెళ్లటం కాని - ఆయన రావటంకాని కాక పోవటం - వుత్తరాలుకూడా వ్రాసుకోకపోవటం వలన - చాలా బెంగతో ప్రేమ ఒలకబోస్తూ వ్రాసారు.

దానికి జవాబుగా వెంటనే వుత్తరం వ్రాసాను. అయితే బండి కొనటం ఆ వెంటనే పెద్ద నష్టానికి అమ్మేయటం వంటివి వ్రాస్తే తిడతారని చెప్పి ప్రస్తావించలేదు. రెండు బస్సులు మారి ఆఫీసు వెళ్లటం కష్టంగా వుంటూందని మాత్రం తెలిపాను.

తరువాత ఓ వారానికి నన్ను అర్జంటుగా రమ్మంటూ నాన్నదగ్గర్నుంచి లెటర్ వచ్చింది.

ఎందుకో తెలీకపోయినా అర్జంటుకాబట్టి సెలవుపెట్టి వెళ్లాను.

అదీ యిదీ మాట్లాడాం.

"ఒరే రేవంత్! నిన్ను పిలిపించిన కారణం చెబుతున్నాను. నీకు ఆఫీసుకు వెళ్లనికి చాలా ట్రబుల్‌గావుందని వ్రాసావు బా! అందుకని నీ సౌకర్యంకోసం - నాల్గువేలకి చౌకగావచ్చిందని సెకండ్‌హాండ్ మోపెడ్ కొన్నాను... ఎవరో ఒకాయన విజయనగరమేనట... ఆరు నెలలు వాడి... పెద్దబండి కొనుక్కోవాలని చెప్పి అమ్మేసాడట... నాకొలీగుకు తెలిసిన మెకానిక్ అమ్మాడు. ట్రాన్స్‌ఫర్ చేయించి రెండురోజుల్లో సి. బుక్ వగైరాలు యిస్తానన్నాడు. నా డబ్బు నీకు వీలున్నపుడు యిద్దూగానిలే!" అన్నారు నాన్న.

"నాన్నా! సుజుకీవో, చేతకో, కొనుక్కుదామనుకుంటుంటే మోపెడ్ కొన్నారా! అనవసరంగా!" నసిగాను.




"ఎందుకురా అన్ని వేలు తగలేసి కొనటం... రిపేరువస్తే వందలకి వందలౌతుంది. ఓసారి త్రొక్కిచూసుకో పద..." అంటూనే వీధిలోకి దారి తీసారు.

వీధిగది తలుపు తెరిచారాయన.

అది చూసిన నేను మంచుకి కొయ్యబారినట్లయ్యాను.

కారణం!

అది నేనమ్మేసిన గుప్‌చిప్ మోపెడ్ ఎన్.డి.ఎన్. 4979. ●







# ఆ నొప్పికి స్ట్రాంగ్ చికిత్స అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిళితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింప జేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

## అమృతాంజన్ స్ట్రాంగ్

మిక్కిలి బాధాకరమైన నొప్పులకు




అమృతాంజన్ లిమిటెడ్

